# అమృతాంజన్‌కే తెలుసు ఒంటి నొప్పులు

అమృతాంజన్‌తో మీరు నిజంగా నొప్పులు బాధలు మర్పించేస్తున్నారు. నాలుగుసార్లు గట్టిగా తడిమితేచాలు మీ నొప్పులు అప్పుడే తగ్గుముఖం పట్టేస్తాయి.

ఘాటైన ఇతర మందులలాగకాక బాధ వుండేచోట అమృతాంజన్ పై చర్యవల్ల అతిశీఘ్రంగా గుణం ఇట్టే కనిపిస్తుంది. శక్తివంతమైన 10 ఔషధాలు చేరిన మందు ఏ యితర బాధలను కలిగించదు.

85 సంవత్సరాల పైబడిన ప్రసిద్ధి గల అమృతాంజన్ బెణుకులు, తల నొప్పి మరియు జలుబులకుకూడా బాగా పనిచేసి అమోఘంగా నివారిస్తుంది.

ఈ బాధలు చెప్పిరావు. అనుకోకుండా వస్తూంటాయి. అందుకే చేతికి అందుబాటుగా అమృతాంజన్ వుంచుకోడం మంచిది. ఎప్పుడు అవసరమవుతుందో మీకసలు తెలియదు.




## అమృతాంజన్

శీఘ్ర నివారిణి. నమ్మకమైనది. ఏ ఇతర బాధనూ కలుగచేయదు.

OBM 7656 TG

# పాల నుంచి ఘన పదార్థాలకి మీ పాప సులభంగా మారేలా చూడండి...

# నెస్టమ్: సున్నితమైన మార్పుకోసం ప్రత్యేకంగా రూపొందించిన బేబీ సీరియల్



మీ పాపకి మీరు ఎంతో మంచి ఆహారం యివ్వాలనుకుంటారు. అందుకే మీరు పాపకి చనుపాలు యిస్తారు. మీరు యివ్వగలిగిన వాటిలో ఎంతో పోషకత్వం కలిగి సులభంగా జీర్ణమయే ఆహారం అదే.

పాపకి నాలుగు నెలలు నిండాక, పాప ఆహారంలో ఘన పదార్థాలు వుండాలి. కాని పాప జీర్ణం చేసుకునే విధానం యింకా సున్నితంగా వుంటుంది. అందుకే పాపకి సులభంగా జీర్ణమయే సీరియల్ కావాలి నెస్టమ్ వంటిది. ప్రత్యేకంగా రూపొందించినది కావటంతో మొదటగా ప్రవేశపెట్టే ఘన పదార్థంగా నెస్టమ్ సరియైనది. ఇది బియ్యంతో తయారు చేయబడింది గ్లూటెన్ లేకపోవడం వలన దీనిని సులభంగా జీర్ణమయే సీరియల్‌గా పోషకాహార నిపుణులు అంగీకరించారు.

మీ పాప పోషకాహారానికి ఆధారంగా వుండే 11 విటమిన్లతోనూ, ఇనుము మరియు కాల్షియంతోనూ బలపరచబడినది కావడంతో నెస్టమ్ "కావాలి" అని పోషకాహారం విలువ తెలిసిన మీ వంటి తల్లులు అంటారు. విటమిన్లు పాప చర్మానికి మెరుపుని ఇస్తాయి. కళ్లలో కాంతులు తెస్తాయి. రోగ నిరోధక శక్తిని కలిగిస్తాయి. ఆరోగ్యవంతమైన రక్తం కోసం ఇనుము, దృఢమైన ఎముకలు, పళ్లకోసం కాల్షియం అవసరం.

పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశపెట్టడం ఎప్పుడూ సులభమైన పద్ధతి కాదు. కాని నెస్టమ్ పాలనుంచి ఘన పదార్థాలకి మార్పు సున్నితంగా వుండడానికి మీకు సహాయం చేస్తుంది.

SAA/FSL/N/2671 TEL




ఇనుము మరియు 11 విటమిన్లతో బలపరచబడినది

## నెస్టమ్® రైస్

తయారు చేయడం సులభం



| | | |
|---|---|---|
| ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి | నెస్టమ్ చేర్చండి కలపండి | తినిపించుటకు తయారు |



### ముఖచిత్రం

18—2—83 సంచికలో వెలువడిన "కోడలు కావాలి"లో పూర్ణిమ చూస్తూనే ఎమ్మో అలరించింది. పూర్ణిమగారిని చూస్తూనే ఎందుకోగాని "నరేష్"గారు గుర్తుకొచ్చారు. కనుక శ్రీ నరేష్ గారిని బహు అందముగా చిత్రించి ఆంధ్రపత్రిక వెలువడింప కోర్తాము ఈ "నరేష్"గారు వెలువడే శుభ సందర్భాన్నా మన పత్రికకు స్నేహలతను వెలువడింప చేయవలసిందిగా నేను కోరుతున్నాను.

యన్. శ్రీనివాస్ (తుని)

### సీరియల్స్

ఆంధ్రసచిత్ర వారపత్రికలో పడుచున్న కథలు సీరియల్స్ చాలా బాగుంటున్నాయి. రాగాగ్ని, నీలాకాశము ప్రత్యేకంగా బాగున్నాయి. రాగాగ్ని ముగింపు ఎలా ఉంటుందోనని అనుకునేవారము. ముగింపు చాలా చక్కగా ముగించారు.

చింతకింది శంకర్ (బొంబాయి)

### ఒకచోటు నుంచే

నటి వనిత ముఖచిత్రంతో వెలువడ్డ ఆంధ్ర సచిత్ర వారపత్రిక (11 2 83) చాలా బాగుంది. కర్నాటక మాజీ ముఖ్యమంత్రి శ్రీ గుండూరావు రెండు చోట్ల నుంచి పోటీ చేయలేదు (వ్యక్తిగతం శీర్షిక—11 2 83 సంచిక) రెండు చోట్లకు 'నామినేషన్' ఫైలు చేసి తరువాత ఒకచోట నుంచి విరమించుకున్నారు.

రాఘవేంద్ర కాడ్లూర్ (బళ్ళారి)

### మాటికో కోటికో ఒక్కరు

అనతికాలంలోనే ఆంధ్రుల అభిమానాన్ని పొందిన యువతార పూర్ణిమ ముఖచిత్రం నయనానందకరంగా వుంది ఈ పత్రికలో "మాటికో కోటికో ఒక్కరు" కథను అందరూ చదివి తీరాలి.

ఎస్. వెంకటేశ్వర్లు, సుజనాదేవి (మహబూబాబాదు)




### కథలు

సుమలత ముఖచిత్రంతో వచ్చిన సంచికలో "సుబ్రావ్‌కి కోపం వచ్చింది" కథ చదివిన మాకు నవ్వు వచ్చింది. హాస్యంతో రూపొందించిన "హోం డిపార్ట్‌మెంట్" కథ వెరైటీగా వుండి మమ్మల్ని ఆనందపరిచింది.

బిరుదరాజు సతీష్‌కుమార్‌భట్, ఇతరులు (కాజీపేట)

* * *

11—2—83 సంచిక మీరు ప్రచురించిన "కామాక్షి కోరిక"లో ఆమె పడిన అవస్థ, చివరకు ఆ కోరికను సమాధి చేస్తూ శంకరం చెప్పిన మాటలు నేటి మధ్యతరగతి కుటుంబాల నిజ స్థితికి అతి సమీపంగా ఉన్నాయి

శ్రీమతి పరాగిత్ (రాయచోటి)

### కళ్ళలో నీళ్ళు

మహానటి సావిత్రి గూర్చి వారి కుమార్తె విజయచాముండేశ్వరి తెలియచేసిన విషయాలు చదివాక మా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఎం. లలితా నాగేశ్వరరావు (బైపల్లి)

### " బలి "

"వనిత" ముఖచిత్రం సుందరంగా వుంది "బలి" కథ చదువుతుంటే మా కళ్ళ వెంబడి నీళ్ళు ధారాపాతంగా వర్షించాయి.

యండమూరి శ్రీరామ్మూర్తి (రాజమండ్రి)

* * *

మీరు ప్రచురించిన "బలి" కథ ప్రసాద్ లాంటి స్నేహితులకు కనువిప్పు లాంటిది.

ఆర్. రఘునందన్ (తిరువూరు)



### న్యూఢిల్లీ లేఖ

జయదుబాషి గారు "శ్రీమతి ఇందిరాగాంధి పార్టీ పతనానికి కారణాలు" చాలా బాగా వ్రాసారు

ఎస్ కన్నయ్యనాయుడు, ఎస్ జ్యోతి (తిరుపతి)

* * *

'న్యూఢిల్లీ లేఖ'లో డా జయదుబాషిగారు మన ప్రధాని పరాజయానికి కారణాలు చక్కగా వివరించారు

కొమ్మినేని శ్రీనివాసరావు (గుంటూరు)

* * *

నటి వనిత ముఖ చిత్రం సుందరిగా అలరించిన పత్రిక రమ్యంగా ఉండి, నన్ను ఒక్క క్షణం రెప్ప వేయనీయలేదు డాక్టర్ జయదుబాషి గారి "న్యూఢిల్లీ లేఖ"లో తెలియని విషయాలు వివరిస్తున్నారు పత్రికలో ప్రచురిస్తున్న వ్యక్తిగతం శీర్షిక నాకు నచ్చింది

బిరుదరాజు సతీష్‌కుమార్ భట్ (కాజీపేట)

### వ్యక్తిగతం

"వ్యక్తిగతం" శీర్షిక చిన్నదయినా భలేగా వుంది 'న్యూఢిల్లీ లేఖ' పాఠకుల్ని ఆలోచింప చేస్తున్నవి.

వై. చంద్రశేఖరరెడ్డి (నగరి)

* * *

వ్యక్తిగతంలో వేసిన చిత్రాలు, వాటిని గురించిన వివరాలు ఆసక్తిదాయకం

షేక్ మస్తాను, ఇతరులు (రేపల్లె)

* * *

మీరు ఈ మధ్య ప్రారంభించిన "వ్యక్తిగతం" శీర్షిక మాకెంతో నచ్చింది ఈ శీర్షికద్వారా సమకాలీన ప్రముఖులను గూర్చి తెలుసుకో గలుగుతున్నాము ముఖ్యంగ వారి ఫోటోలు ప్రచురించడం వలన చిరకాలం గుర్తువుంటారు వివరణ తక్కువే, కాని చాలు

ఆవుల రమణారెడ్డి (జమ్మలమడుగు)

### ముగింపు వచ్చలేదు

మీరు ప్రచురిస్తున్న ప్రశ్నావళి, డాక్టర్ సలహాలు బావుంటున్నవి.

రాగాగ్ని రచయిత్రి చిట్టారెడ్డి సూర్యకుమారి గారు అందరి పాత్రలను చాలా చక్కగా జీవింప చేసినారు. అయితే ముగింపు నచ్చలేదు

జి విజయలక్ష్మి (నర్సిపూడి)

### గులాం యాసీన్

తెలుగు రచయిత, కవి కీ. శే. గులాం యాసీన్ గారి రచనలపై పరిశోధన వ్యాసాలు రాస్తున్నాను దయచేసి వారి రచనల వివరాలు తమ వద్ద ఉన్నచో వారు ప్రతులు, కత్తిరింపులు పంపగలిగినచో పంపించి సహకరించవలసిందిగా కోరుతున్నాను

ఆనంద్ప్రియ, 22—1—492, సుల్తాన్‌పురా, హైదరాబాద్—500024.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం 11–3–'83
దుందుభినామ సం అధిక ఫాల్గుణ బ ద్వాదశి
సంపుటము *75* : సంచిక *28*
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1–50 |
| ఆరుమాసాల చందా | రు 42–90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 85–80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



## లోకంపోకడ









# డోలాయమానస్థితిలో ఉన్న మన సమాజం !

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత 35 సంవత్సరాలకు తన ఉనికేమిటో తనే తెలిసికోలేనటువంటి పరిస్థితికి భారత సమాజం చేరుకుంది ఆది ఏ వైపుకు మొగ్గాలో దానికి తెలీడంలేదు. ఒక క్షణం ఇటువైపుకి మరొక క్షణం అటు వైపుకి మొగ్గుతూ ఎక్కువసేపు ఒకచోట ఉండటం లేదు ఆఖరికి ఈ సమాజం ఒక లోలకం లాంటిది అయింది అన్ని సమాజాలు భారత దేశం అంత పురాతనం అయినప్పటికి ఈ లోలకం దశ గుండా వెళ్ళాల్సిందే కానీ, ఈ దశ అంత సులభంగా జరిగిపోదు

ఢిల్లీ ఎన్నికలే తీసుకోండి అక్కడ కేవలం రెండు ముఖ్యమైన పార్టీలు ఉన్నాయి, అవి లోలకం ఎటు కదిలితే అటు మొగ్గు చూపుతూ ఉంటాయి నిజం చెప్పాలంటె పెద్ద సమస్యలేవి ఇందులో లేవని అనుకున్నారు మునిసిపల్ ఎన్నికల్లో పెద్ద సమస్యలేముంటాయి ? ఏ పార్టీ గెలుస్తుంది, ఏ పార్టీ ఓడుతుంది అనేది పెద్ద సమస్య కాదు కొద్దిపాటి తేడాలో ఓట్లు ఏమైనా చేయగలవు ఈ ఓట్లు సమస్యల వల్లనో, సిద్ధాంతాల వలననో వచ్చి పడవు కేవలం అధికారంలో ఉన్నందు వల్లనే ఇందిరా కాంగ్రెసు భారతీయ జనతాపార్టీ కన్న కొద్దిగా ఎక్కువ ఓట్లు సంపాదించింది, కొద్దిలో ప్రమాదం నుంచి బయట పడింది వచ్చేసారి లోలకం బి జె పి వైపు మొగ్గుతుంది ఇది తప్పగ అని నా ఉద్దేశ్యం

కానీ ఆంధ్రప్రదేశ్, కర్నాటకలలో అలా జరగలేదు వాస్తవానికి ఇందిరా కాంగ్రెసు అక్కడ ఓటర్లచే తిరస్కరింప బడింది




డా॥ జయదుబాషి

మన దేశంలో కేంద్ర ప్రభుత్వానికి ఎక్కువ అధికారం ఉంది కేంద్రం జాతీయ ఆదాయం మీద, రైలు, విమాన రవాణా సౌకర్యాల మీద, రక్షణ, విదేశీ విధానం మీద కచ్చితమైన అజమాయిషీకి కట్టుబడి ఉంది దేశం తొలి దశలో దీని గురించి ఎవరూ పట్టించుకోలేదు ఉక్కు కర్మాగారాలు నెలకొల్పడం, విద్యుత్ కేంద్రాలు ఏర్పాటు చేయడం లేదా ప్రపంచం లోని నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని కొనుగోలు చేయడం, ప్రపంచ బాంక నుంచి ఋణాలు తెచ్చుకోవడం ఏమంత కష్టమైన పని కాదు. ఇవన్నీ కూడా ఆధునీకీకరణకు, పెరుగుదలకు ఎంత అవసరమో అభిప్రాయం ఉంది. ఎవరో ఒకరు ఇవన్నీ చేయవలసి ఉంది. జాతీయ దృక్పథంతో, తదనుగుణ పథకాలతో వీటిని కేంద్రం ఎందుకని చూడటం లేదు ?

అయితే ఇవన్నీ ఇప్పుడు జరిగిపోయిన విషయాలు మన కిప్పుడు సక్రమంగా నడవని ఉక్కు కర్మాగారాలున్నాయి అంతకంటె అధ్వాన్నంగా ఉన్న విద్యుత్ కేంద్రాలు ఉన్నాయి మనం నిధులకీ, కొత్త సాంకేతిక పరిజ్ఞానానికి ఎక్కడికి వెళ్ళాలి ? కేంద్రం ఇవన్నీ చెయ్యాలని మనం అనుకుంటామా ? మనమే చేసుకోవాలి అంటే రాష్ట్రాలని కాదు నా ఉద్దేశ్యం వ్యక్తులు కూడా. శ్రీ ఎన్ టి రామారావు తమ ప్రభుత్వానికి మాత్రమే అధికారం కోరడం లేదు. వ్యక్తులకు కూడా కోరుతున్నారు ఇటీవలి ఢిల్లీ పర్యటనలో తమ నూతన విధానాన్ని వివరిస్తూ, ఆయన ఒక చిన్న ప్రకటన ఇచ్చారు అందులో ఆయన తమ ప్రభుత్వం ప్రవేటు రంగాన్ని పెంపొందించేందుకు, ప్రోత్సహించడానికి అన్ని సౌకర్యాలు కల్పించే విధానం అనుసరిస్తుందని పేర్కొన్నారు శ్రీ రామారావు ఉద్దేశ్యంలో వికేంద్రీకరణ అన్నది కేవలం అధికారం న్యూఢిల్లీ నుంచి హైదరాబాదుకు పంపిణీ చేయడం కాదు అలా అయితే ఒక తరహా అధికార యంత్రాంగం స్థానంలో మరొక రకం అధికార యంత్రాంగం ప్రవేశ పెట్టడం అవుతుంది. ఇది మంచిది కాదు తెలుగు దేశం పార్టీ కోరుకునేదేమిటంటె మొత్తం అధికార యంత్రాగాన్నంతా సుళువుగా ఉండేలా చెయ్యాలి. మొదట కేంద్రం నుంచి రాష్ట్రాలకు, రాష్ట్ర ప్రభుత్వం నుంచి వ్యక్తులకు అన్ని స్థాయిల్లో ప్రభుత్వ అధికారాన్ని తగ్గించడాన్ని తమ పార్టీ కోరుతోందని అన్నారు నిజానికి ఇది తీవ్రమైన



కోరిక ముఖ్యంగా ఈ తరహా కోరిక శ్రీమతి ఇందిరాగాంధీ వంటి స్వార్థపరురాలైన వ్యక్తికి నచ్చదు శ్రీ ఎన్ టి రామారావుకు తమ అభినందనలు పంపడానికి ఆమెకి దాదాపు రెండు వారాలు పట్టగా, అవి నిజంగా అభినందనలే అయితే, నాకు ఆశ్చర్యం కలగలేదు.

ఇన్ని రోజుల నుంచి కేంద్రం అధికారం పెరుగుతూ వచ్చింది దానిని తగ్గించాలి పప్పు, బియ్యం మొదలు టెలిఫోన్ మరమ్మత్తులు, రైలులో రిజర్వేషన్ల వరకు ప్రభుత్వం లోని ఎవరో ఒక నాయకుడి వద్దకు పరుగెత్తాలంటె అయ్యేపని కాదు అసలు ఇంజన్‌కు, బ్రేకుకు తేడా తెలీని ఘనీఖాన్ చౌదరి లాంటి వారు రైల్వేలను ఏం నడపగలరు? అవి ప్రవేటు రంగాలుగా ఉన్నప్పుడే బాగుండేది భారత దేశంలో సమర్థవంతమైన పెద్ద విద్యుత్ కేంద్రాలు టాటా వారిచే నెలకొల్పబడినవే ప్రపంచంలో ధాన్యం షాపులన్నీ మన వైశ్యులే బాగ నడపగలుగుతున్నారు

ప్రభుత్వం ప్రమేయం ఎక్కువగా లేకపోయినా ముఖ్యంగా కేంద్ర ప్రభుత్వ జోక్యం లేకుండా ఉంటే సమస్యలు చాల మటుకు వాటికవే సమసి పోతాయి అన్ని చోట్ల కంటే కేంద్రంలోనే ఎక్కువ గందరగోళాలున్నాయి దిగుమతులని తగ్గించి విదేశీ మారకాన్ని కేంద్రం ఆదా చెయ్యాలని గట్టిగా అనుకుంటున్నదని ఎవరైనా భావిస్తే తప్పకుండా 'బుద్ధి శుద్ధి' చెయ ఉంటుంది.

ప్రభుత్వం వైపు నించి గాలి ప్రజల వైపుకి మళ్ళుతూ ఉంది. ఇలా జరగడం మంచిది నా ఉద్దేశ్యంలో ప్రజలు శ్రీమతి ఇందిరా గాంధీ కన్నా తామే స్వయంగా సమస్యల్ని పరిష్కరించుకోగలము అని అనుకునే స్థాయికి చేరుకునేవరకు ఈ వాతావరణమే ఉండాలి వాస్తవానికి అప్పటి కన్నా ఎక్కువగా ఈ గాలి అధికార పార్టీలోని వారికి బాధాకరంగా, ముఖ్యంగా వారి రాబడికి ప్రతిబంధకంగా, పరిణమించిందంటే అవాస్తవం కాదు.




సాయంకాలం ఆరయింది —

ఆరుబయట వాలుకుర్చీలో కూర్చుని ఆకాశంవంక చూస్తున్నారు మాధవయ్యగారు —పగటి వెలుగింకా పూర్తిగా తగ్గిపోలేదు — గూటికిపోయే వేళయ్యింది కాబోలు . పక్షులు బారులు బారులుగా ఆకాశంమీద ఎగురుతూ పోతున్నాయి.

మనుగడకోసం ఓ "గూడు"నిర్మించుకునే తాపత్రయం చాల ప్రాణుల్లో కన్పిస్తుంది — ప్రాణికోటిలో మేధాశాలి అయిన మానవుడు యీనాడు తన మేధస్సు ఉపయోగించి ఆకాశాన్నంటే కట్టడాల్ని నిర్మిస్తున్నాడు. అయితే విజ్ఞానమూ, నాగరికత పెరిగిన యీరోజుల్లో కూడ అద్దెయిళ్ళలో అగచాట్లు పడుతూన్న వారూ, చెట్ల నీడనే జీవితాల్ని గడిపేసుకునేవారూ ఎందరో వున్నారు — దీనికి కారణం మనిషికీ మనిషికీ మధ్య నిరంతరం పెరిగిపోయే అడ్డుగోడలే — ఆ అడ్డుగోడలకు పునాది డబ్బు !

మాధవయ్యగారి ఆలోచనలు ఎక్కడెక్కడికో పోతున్నాయి — ఇన్నాళ్లకు తన కలలు ఫలించాయి — తనకూ ఓ గూడు ఏర్పడింది. సంతృప్తిగా ఇంటివైపోమారు చూసుకున్నారు మాధవయ్యగారు — ఈ యిల్లంతా తను దగ్గరుండి కట్టించాడు ఇటుక, యిసుక, రాయి అన్నీ దగ్గరుండి తనే కొన్నాడు — కూలీల్తో కూలిగా పని చేశాడు—డబ్బొక్కటే సుందరానిది గాని శ్రమంతా తనదే

అందుకే అంత మమకారం; సంతృప్తి

తన తాతలూ, తండ్రులూ అంతా అద్దె యిళ్ళలోనే జీవితాల్ని గడిపేశారు కానీ తనలా సంతృప్తి పడలేకపోయాడు తనకంటూ ఓ యిల్లు వుండాలనే కోర్కె యీనాటిదా? చిన్ననాడే బలపడింది. ఆ కోర్కె తన మనసులో నానాటికీ బలపడి మరింత తీవ్రమైంది చివరికి యిన్నాళ్లకు . ఓ యింటిని నిర్మించగలిగాడు.

స్వంతిల్లు, ముందు జాగాలో పూల మొక్కలు, మధ్యలో కూర్చొని సాయంకాలాలు గీతాధ్యయనం బాగానే వుంటుంది— కానీ ..

మాధవయ్య గుండెలు ఒక్కమారు బాధతో బరువెక్కాయి కాస్సేపటికితేరుకొని, గుమ్మంలోంచి హాల్లోకి దృష్టి సారించారు ప్రయాణ సన్నాహంతో ఇల్లు సందడిగా వుంది కొడుకు సుందరం బెడ్డింగు చుడుతున్నాడు పెట్టె సర్దుతోంది కోడలు—గదంతా సామానుతో చిందరవందరగా వుంది

'ఏమిటీ చీకట్లోనే కూర్చుండిపోయారేం. వీధిలైటన్నా వేసుకోకపోయారూ' అంటూ వచ్చింది మాణిక్యం.

'ఎందుకూ వెన్నెల ఎట్లాగూ వస్తుందిగా' ఏదో గొణిగారు మాధవయ్యగారు

ఆవిడమళ్ళీ వంటింట్లోకి వెళ్ళిపోయింది

రెండురోజుల్నించీ వంటింట్లోనే సతమతమైపోతోంది మాణిక్యం సుందరానికిష్టమైన చక్కిలాలు, సున్నుండలూ చేసి డబ్బాలకెత్తింది. ఊరగాయల్ని చిన్న చిన్న జాడీల్లో పర్దింది. కొడుకంటె ఆమెకు ఎనలేని ప్రేమ — ముగ్గురాడపిల్లల మధ్య కలిగిన ఒక్కగానొక్క మగ కుర్రాడు మరి ! వాడి పుట్టుక, చదువు, ఉద్యోగం యింత వరకూ అన్నీఉన్న వూళ్ళోనే జరిగిపోయాయి. స్వంత తెలివితేటల్తోనే బేంకులో ఉద్యోగం సంపాదించుకున్నాడు ఇన్నేళ్ళ తర్వాత యిప్పుడు ప్రమోషన్ మీద దూరంగా వెళ్ళిపోతున్నాడు 'అక్కడిభాష, మనుషులూ, వాతావరణం అన్నీ కొత్తే — ఎలా నెగ్గుకొస్తాడో ... ?' అని దిగులు పడుతుందావిడ.

గోడ గడియారం ఏడుగంటలు కొట్టింది.

మరో రెండు గంటల్లోనే ట్రైను. మళ్లీ ఎన్నాళ్ళకో కొడుకుని చూడ్డం! మాధవయ్యగారి మనసుసు దిగులావరించింది

'భోజనాలు పెట్టేస్తున్నాను, లేవరూ' మాణిక్యం వచ్చి పిల్చింది ఆకలి లేకపోయినా లేచి, కాళ్ళూచేతులూ కడుక్కున్నారాయన. భోజనం చేస్తున్నంతసేపూ ఎన్నోజాగ్రత్తలు చెబుతూనే వున్నాడు సుందరం

'డబ్బు విషయమై బాధపడొద్దు మీ కెప్పుడు అవసరమైతే అప్పుడు ఉత్తరం రాస్తే పంపిస్తా' అని హామి యిచ్చేడు.

'అనవసరమైన బెంగలు పెట్టుకుని ఆరోగ్యం పాడుచేసుకోకు' అంటూ తల్లిని హెచ్చరించాడు.

భోజనమయ్యాక మళ్లీ యధాస్థానంలో కొచ్చి కూర్చున్నారు మాధవయ్యగారు. గాలి చల్లగా వీస్తూంది-ఉండుండి సన్నజాజి తీగమించి కమ్మని పరిమళం కూడ నాసికారంధ్రాల్ని తాకుతోంది జాజితీగ నిండా గుత్తులు గుత్తులుగా పూలు ఆ పూలు చూస్తూంటే పెద్దకూతురు సీతామహాలక్ష్మి గుర్తుకొస్తుంది.

పెళ్ళయి, ముగ్గురు పిల్లల తల్లి అయినా సరే తండ్రి మీద మమకారం కొద్దీ ఏడాదికో మారు వస్తూనే వుంటుంది చూచిపోడానికి. రవికలగుడ్డ తప్ప ఏమిచ్చినా తీసుకోదు.

'పెంచి, చదువులు చెప్పించి, కట్నాలిచ్చి పెళ్ళిళ్లు చేసి మా జీవితాలకో దారి చూపించారు. ఇంకా ఎందుకు నాన్నా యివన్నీ? ఈ స్థితిలో మేమే మీకివ్వాలి' అనేది

ఆ మాటలకు కళ్లంట నీళ్ళు తిరుగుతాయి తల్లిదండ్రులపై పిల్లలకామాత్రం అభిమానముంటే యిక కావల్సినదేముంటుంది?

ఇల్లు యింకా పూర్తవకముందే ఓ జాజి తీగను తెచ్చి బాల్కనీలోకి ప్రాకేట్టు పాతి, చుట్టూ పుల్లలతో కంచె వేసింది

'ఈ చెన్నంగీ, కేరళా కొబ్బరీ మంచివి నాన్నగారూ. మంచి దిగుబడి వుంటుంది' అంటూ నాలుగు కొబ్బరి మొక్కల్ని తెచ్చి నాలుగువైపులా నాటింది రెండో అమ్మాయి వనజ వనజ కన్నీ తల్లి పోలికలే కుదస్తంగా పొదుపుగా సంసారాన్ని చేస్తుంది 'ఈ పూల మొక్కలకేంగాని; వేల బాగుచేయించుకుని నాలుగు కూరవిత నాలేసుకుంటే అవసరానికుంటాయి' అని ఓ సలహాకూడ యిచ్చింది.

ఎవరి సలహానూ తీసెయ్యలేదు తను. అయితే ఇల్లు పూలమొక్కలతోనూ, పళ్ల చెట్లతోనూ కళకళలాడితే సరిపోదు. పిల్లాపాపలతో నవ్వుతూ, కేరింతలతో నిత్యం నందన వనంలా వుండాలి అప్పుడే ఆనందం!

కానీ కోరుకుంటున్న కొద్దీ తన కటువంటి ఆనందం మిగిలకుండానే పోతోంది

బరువుగా నిట్టూర్చేరు మాధవయ్యగారు.

అప్పుడే యింటిముందు రెండు ఆటోలు ఆగేయి.

సామాను ఒకటీ ఒకటీ ఆటోల్లో జేరవేస్తున్నారు.

'నాన్నా ఒక్కమారిలా వస్తారా' పిలిచేడు సుందరం

వాచీ చూశారు. మరో అరగంటలో ట్రైను స్టేషన్ వదిలేస్తుంది.

కొడుకు, కోడలూ తన కాళ్లకి నమస్కరిస్తూంటే దుఃఖం ఆగలేదు మాధవయ్యగార్కి ఎంత కఠినంగా గుండె నిబ్బరంగా వుందామనుకున్నా కళ్ళలో నీళు నిళ్ళు తిరుగుతూనే వున్నాయి. మాణిక్యమ్మగారి సంగతి సరేసరి!

'మరీ ఏమిటమ్మా మీరు? చిన్నపిల్లలమా ఏమన్నానా? విదేశాలకు పోయి కొన్నియేళ్ళు గడిపొస్తున్నారీరోజుల్లో ఈ దేశంలోనే మరో రాష్ట్రంలో మరో వూరు అంతేగా! పైగా సెలవులూ లీవ్‌ట్రావెల్ కన్సెషన్లూ వుండనే వున్నాయి - వస్తూ వెళ్తూనే వుంటాము' సుందరం మాటలకు కాస్త వూరడిల్లింది మాణిక్యమ్మ.

'ఉత్తరాలు రాస్తుండరా' ఆమె మాటలకు తలూపేడు సుందరం.

## జీవితం

గడిచిన ప్రతి దినం
అనుభవాల సోపానం
వచ్చే ప్రతి ఉదయం
ఆశల తోరణం
జనించే ప్రతి క్షణం
ఉజ్వల తరంగం

కె. అయ్యప్పనాయుడు

'వాడికి తీరిక కుదరకపోతే న రాయవమ్మా నిర్మలా'

'అలాగే' అంది నిర్మల, గేటు దాటుతూ.

ఆటోలు కదిలి వెళ్లిపోయాయి

కాస్సేపు గేటుదగ్గరే నిలబడి వెనుదిరిగి యధాస్థానానికొచ్చి కూర్చున్నారు మాధవయ్యగారు.

మాణిక్యమ్మగారు మౌనంగావంటింట్లోకి నడిచారు

క్షణం క్రితంవరకూ సందడిగా వున్న యిల్లు ఒక్కమారు నిశ్శబ్దమైపోయింది — గాలి స్తంభించిందేమో ఆకుల కదలిక కూడ లేక్కడా లేదు—వెన్నెల మసగ మసగ్గా వుంది.

ఇంటివంకొకసారి చూశారు మాధవయ్యగారు—మసగ వెన్నెట్లో పాలరాతి మేడలా మెరిసిపోతోంది

అయితే తను కోరుకున్నదేమిటి? సాధించినదేమిటి? ఈ ఒంటరితనమూ, ఈ నిశ్శబ్దజీవితమేనా తను కోరుకున్నది? ఈ గూడు కోసమేనా తను కలలు కన్నదీ? మాణిక్యంతో తన పెళ్లి నిశ్చయమైనపుడు అత్తవారన్నారు, 'కట్నం పెద్దగా యిచ్చుకోలేకపోయినా మాకున్నదాంట్లోనే ఓ చిన్న స్థలం యిల్లు కట్టుకునేందుకు యివ్వగలం' అని

అప్పుడు నిజంగానే సంతోషం కలిగింది— ఎంత తీసుకున్నా కట్నండబ్బు ఎన్నాళ్లుండిపోతుంది? అదే నిజమైతే తన చిరకాల వాంఛకు పునాదిరాయి పడ్డట్లే

ఎన్ని వాగ్దానాలు చేసినా, ఎంత అభిమానమున్నా మధ్యతరగతి కుటుంబాలు మరి! పెళ్ళి ఖర్చులూ, అప్పులూ, వడ్డీలూ, తాకట్లూ .. మొత్తానికి ఉన్న స్థలాన్ని అమ్మేసుకున్నారు వాళ్ళు.

'మా వాళ్ళు మిమ్మల్ని నమ్మించీ అన్యాయంచేశారు' అనేది మాణిక్యం

'పోనీలే – ఆయాచితంగా ఒకరి ఆస్తి అనుభవించే రాత మనకి లేదు' అన్నాడేతప్ప నిరుత్సాహపడలేదు

ఆ తర్వాత కూడ తోటి వుద్యోగస్తులూ, స్నేహితులూ ఇళ్లస్థలాలు కొనుక్కున్నప్పుడు కూడ మనసులో కోరిక వున్నా సాగలేక పోయాడు కారణం అప్పటికే పెద్దపిల్ల పుట్టడం ఇంటద్దెలతోసహా అన్ని ఖర్చులూ పెరగడం—

రెండో కోరిక కూడ మరోమారు

# గూడు

అవకాశమొచ్చింది చవగ్గా స్థలాల్ని కొని పంచుకుంటూ స్నేహితులు తనను కూడ బలవంతం చేశారు అయినా తనకు అప్పుడూ అదే సమస్య డబ్బు సమస్య! తనవంటి సామాన్య ఉద్యోగస్థుడికి నాలుగువేలంటే మాటలా? ఏ ప్రావిడెంట్ ఫండు తలో కొంత తీసి, కొంత అప్పుచేస్తేనో అనే ఆలోచన కూడ వచ్చింది కానీ మాణిక్యమే అందుకు పడనియ్యలేదు

"పోన్లెద్దురూ రోజులు గడిచిపోతున్నాయిగా మనకా గీత లేదనుకుందాం—ఇన్ని అప్పులు చేసి స్థలంకొన్నా, యిప్పట్లో మనం యిల్లుకట్టలేం ఈలోగా జీతంలో యీ అప్పుల కోతలూ, వడ్డీలూ మొదలైతే యీ పాటి తిండికే మొహం వాచిపోతాం"

మాణిక్యం మాటలు నిజమే అన్పించాయా క్షణాన బొత్తిగా జీతంమీద గడిచే జీవితాలు మరి! ఆతర్వాత వరసగా కొడుకూ, కూతురూ పుట్టుకొచ్చారు

తనలోని కోర్కె కోర్కెగానే వుండిపోయింది గాని అందని ద్రాక్షలా పుల్లన కాలేదు

తన అభిప్రాయాన్ని తెల్పుకున్న మాణిక్యం మాత్రం అంటుండేది.

'పోనిద్దురూ, ఏమి యిళ్ళు. ఏం లోకం పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారా వాళ్ళ చదువులూ, తిళ్ళూ, బట్టలూ, పెళ్ళిళ్ళూ—ఇవి చూడాలా? అప్పట్లోనే స్వంతం జతకూరి వుంటే ఇప్పుడు యిల్లుకట్టే తాపత్రయంలో వుందుం ఆ ఇటుకలమీద, సిమ్మెంటు యిసకమీద వెచ్చించేది పిల్లలకోసం ఖర్చుచేస్తే వాళ్ళ జీవితాలైనా బాగుపడతాయి ఎక్కడుంటే వెళ్ళిపోవు రోజులా? అన్యాయంగా పైసాకూడా ఆర్జించలేని మనలాంటి వాళ్ళకి ఇళ్ళెలా సమకూరుతాయండీ?'

మాణిక్యం మాటలో ఎంత ముందు చూపున్నదీ యిప్పుడు అర్థమౌతోంది

'జీవితాన్నెంత తేలిగ్గా తీసుకుంటే బ్రతుకంత హాయిగా గడుస్తుందోయ్' అనేవాడో స్నేహితుడు.

కానీ యే ఆశయాలూ, ఆశలూ లేని జీవితం నిరర్థకమన్పించేది తనకు

ఆశలమాటెలావున్నా తనకున్న ఆశయాల మూలంగానే పిల్లల్ని పెంచి, చదువులు చెప్పించి వాళ్ళకి మంచి జవితాన్ని యివ్వగలిగేడు

ఆ సంతృప్తి చాలు!

సుందరం ఉద్యోగంలో చేరిన మూడేళ్ళ తర్వాత ఓరోజు తనతో ఓ విషయాన్ని కదలేశాడు మళ్ళీ ఆశను రేపాడు.

తోటి వుద్యోగులంతా కోపరేటివ్‌గా స్థలం కొనుక్కుంటున్నారట— 'మనంకూడ ఓ చిన్న స్థలం తీసుకుంటే బావుంటుందేమోనని నా అభిప్రాయం నాన్నా' అన్నాడు అప్పటికి సుందరానికి ఇల్లు కట్టుకునేందుకు ప్రభుత్వం వారిచ్చే లోనుకు ఎలిజిబిలిటీ రాలేదు – తనూ రిటైరై ఏడాదైంది ప్రావిడెంట్ ఫండూ, గ్రాట్యూటీ అన్నీ కలిపి బేంకులోనే వేసి వుంచాడు ఉన్నది ఒక్క ఆడపిల్ల– దాని పెళ్ళి చేసేస్తే తనబాధ్యత కొంత తీరిపోతుంది— తన జీవితం గడవటానికి పెన్షన్ డబ్బులు చాలు

ఆ సమయంలో సుందరం స్థలం విషయం ప్రస్తావించడం కాస్త ఆలోచింపచేసింది

కొనవూపిరితో వున్న కోర్కె మళ్ళీ నిలదొక్కుకుంది– బాగా ఆలోచించాక, 'ఫర్వాలేదు తనిప్పుడు కొనగలడు–' అనే ధైర్యం వచ్చింది-

ఏ కళనుందో మాణిక్యం కూడ అందుకు అడ్డు చెప్పలేదు

స్థలంకొన్న రెండేళ్ళకు సుందరానికి లోను శాంక్షనైంది – ఇల్లు రెండు పోర్షన్లుగా కట్టి ఒకటి అద్దెకిచ్చి ఒకదాంట్లో తాముంటే బావుంటుందన్నాడు సుందరం— కానీ తనే అందుకు ఒప్పుకోలేదు ఇన్నాళ్ళూ యీ అద్దెలూ బాధలూ ఎలాగూ తప్పలేదు— కట్టుకునే స్వంతిల్లైనా పెద్ద పెద్ద గదులతో తామొక్కరే వుండేట్టుగా వుండాలని పట్టుపట్టాడు— సుందరంకూడ ఏం మాట్లాడలేదు

రెండు పడగ్గదులూ, వంటగదీ, అతిథుల కోసం ఓ గదీ, ముందు హాలూ తను అనుకున్న విధంగానే యింటి ప్లాను గీయించాడు.

ఇల్లు సగం అయ్యేసరికి ఆఖరమ్మాయి అరుణకి సంబంధం కుదిరింది రెండుమూడు నెలల్లోనే పెళ్ళి జరిగిపోవాలని పట్టుబట్టేరు అబ్బాయి తరపువాళ్ళు

(60వ పేజీ చూడండి)

# వారఫలం

11–3–1983 శుక్రవారం మొదలు
17–3–1983 గురువారం వరకు

♈ మేషం అన్ని వ్యవహారాలలో మీకు ఆనందం కల్గుతుంది నూతన వ్యాపారంలో జోక్యం కల్గుతుంది లేదా చేసే వ్యాపారం పటిష్ట దాయక మవుతుంది చాల కాలంగా నిలచిన ధనం చేతి కందుతుంది స్త్రీలకు ప్రయాణావకాశాలు, తద్వారా ధన లబ్ధి

♉ వృషభం చాల కాలంగా రాని డబ్బు, ఒక వేళ పోయినదీ అనుకొన్నది, ఈవారం చేతి కందుతుంది మీరు చాల కాలంగా ప్రయత్నించి, విఫలులైన వ్యవహారం ఈవారం సత్ఫల దాయకం బంధు వర్గీయులు యింటికి రామన్నారు స్త్రీలకు విదేశ పర్యటనావకాశాలు కొందర పట్ల సఫలం కాగలవు

♊ మిధునం, రాజకీయంగా మికు మేలే జరిగింది, అందుకని ఎగుడు దిగుడుగా ప్రవర్తించకండి శ్రద్ధా సక్తులతో మెలగితే, మంచి ఆదాయం, అనుభవం, ఆనందం పొంద గలుగుతారు స్త్రీలకు విద్యా రంగంలో, నటనా రంగంలో, ఆటలో పాటల్లో చాలమందికి సదవకాశాలు లభిస్తాయి

♋ కర్కాటకం అధి కార వర్గంతో గాని, గ్రామ పెద్దల తో గావి, బంధువులతో గాని తగాదా తంటాలకు, దిగరాదు బంధువులతో శుభ కార్య నిమిత్తం మీరు గావించే చర్చలు మంచి ఫలితాల నిస్తవి స్త్రీలకు ఉద్యోగం లోని వారికి చాల మంది 'ప్రమోషన్' ఆశింప దగిన వారం ధనలబ్ధి కూడా గల వారమే

♌ సింహం విలువగల వస్తువులు కొంటారు చాలమందికి దైవ కార్యాలు నెరవేర్చె సదవకాశం లభిస్తుంది శుభ కార్యం నిమిత్తంగా కొందరు ప్రయాణించ నున్నారు స్త్రీలకు ఆరోగ్య భాగ్యం, ఉద్యోగ మందు అనుకూలం సభా గౌరవం, పత్రికా గౌరవం కూడా చేకూర గల దినములే

♍ కన్య అపేక్షతో వచ్చినట్లు, ప్రేమ చూపినట్లు, మేలు చేయ దలచినట్లు, కొందరు వెంట బడుతారు గమనించి మెలగాలి చాలమందికి గ్రామంలో, ఉండే చోట ప్రసిద్ధి ఏర్పడుతుంది అనుకొన్న దానికన్న, వ్యాపారం లో సదవకాశం లభించే అవకాశం ఉన్నది స్త్రీలకు రాచకార్యాల లో జోక్యం ఉన్నవారికీ, ఉద్యోగస్థులకు అనుకూల దాయక వారమే

♎ తుల 'మబ్బు విడిచిన సూర్యుని లాగు' వ్యాపార రంగంలో, వ్యవహార రంగంలో మీకు ప్రకాశమున్నది ప్రసిద్ధి ఏర్పడుతుంది చాలమందికి శుభ ప్రస్తావనలకు అను కూల వారం విధి విరామం లేకుండా శ్రమించ వలసి వస్తుంది స్త్రీలకు అన్ని విధాలా మేలు జరుగుతుంది ఉద్యోగంలో లాభదాయక మార్గాలు చేజిక్కుతాయి

♏ వృశ్చికం వ్యాపారంలో సర్వాను కూలత చేకూరుతుంది వస్తు సేకరణకు శ్రమిస్తారు, అంద వలసిన ధన సేకరణకూ యత్నిస్తారు సర్వ విధాలా మేలు చేకూరిం దని, వృత్తిలో నూతనావకాశాలు లభించాయనీ ఆనందిస్తారు స్త్రీలకు కొందరు ఉద్యోగ నిమిత్తమై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి

♐ ధనుస్సు ఆదాయం యథా ప్రకారమే సమకూడి వస్తుంది దూర బంధువులతో శుభ కార్య ప్రస్తావనలు ఫలవంతం కాగలవు - బాహాటంగా వ్యాపారం చేసే వారు, అధికార వర్గాన్ని గమనించి మెలగాలి స్త్రీలకు అన్ని రంగాల వారికి లోపం కనిపిస్తుంది ధనాభావం కూడా చెప్ప దగిన అంశం

♒ మకరం వ్యాపార రంగంలో అభివృద్ధి కనిపిస్తుంది మీకు సహజంగాగల ప్రతిభ రాణించే అవకాశం, ఆదాయం ఉద్యోగ వృత్తులందు అభివృద్ధి కనిపిస్తుంది మీతో వ్యాపారంలో వ్యవహారంలో పోటికి రానున్నారు, గమనించి మెలగండి స్త్రీలకు సుఖ శాంతులు ఆరోగ్య భాగ్యం సమకూడుటకు ఆక్షేపణ లేదు

♑ కుంభం శుభ కార్యాను కూలత, బంధువుల మూలకంగా మీకు మేలు చేకూర నున్నది శాంతంగా వ్యవహారం సానుకూలం చేసికోండి పోటి వారి పోటీని ఎదుర్కొన వలసిన పరిస్థితులుంటాయి స్త్రీలకు విలువగల వస్తు సేకరణ, ఉద్యోగాధి వృద్ధికి అవకాశం గలవారం, గమనించి మెలగండి

♓ మీనం అధికార పదవులందున్న వారికి అభివృద్ధి దాయకం వ్యాపారం చేసే వారికి వారం అనుకూలదాయకం చాలమందికి ఉద్యోగాలు చిక్కే అవకాశ మున్నది స్త్రీలకు పదవులందు వృద్ధి, నూతన వస్తు సేకరణకు అవకాశాలు ఏర్పడ నున్నాయి

*— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి* ★

## వ్యక్తిగతం



జియాంగ్ చింగ్ ఒకప్పుడు సినిమా నటి ఆ తరువాత రాజకియవాది కీ శే మావ్‌ట్సె దుంగ్ యొక్క నాలుగవ సతీమణి అయ్యారు ఆ కాలంలో ఆమె పలుకుబడి బాగా పెరిగింది "సాంస్కృతిక విప్లవం" నాయకత్వాన్ని సయితం వహించారు చివరికి "నలుగురి ముఠా" నాయకులుగా చీనా క్రొత్త పాలకులచేత మరణ శిక్షకి అర్హురాలుగా పేర్కొనబడ్డారు అయితే, 69 సంవత్సరాల జియాంగ్ చింగ్ మరణ దండనని "జీవితాంతం" జెయిలు శిక్షకి మార్చారు



ఇటీవల లెబనాన్‌లో కొందరు క్రైస్తవులు ఒకపాలస్తీనా శరణార్థుల శిబిరానికి వెళ్లి అక్కడి వారిని ఎందరినో దారుణంగా హత్య చేశారు దాని బాధ్యత ఇస్రాయిల్ రక్షణశాఖ మంత్రి శ్రీ ఏరియెల్ షారన్‌దేనని ఒక ఇస్రాయిలీ విచారణ సంఘం-వారు నిర్ణయించారు ఆయన రాజీనామా చెయ్యాలని కూడా వారు అన్నారు శ్రీ షారన్ తమ పదవికి రాజీనామా చేశారు



పశ్చిమ జర్మనీలో ప్రయాణీకుల ని తీసుకుపోయే విమానాల పయిలట్ ఉద్యోగాలు చేసే వనితలు ఇద్దరేట ఈ ఇద్దరిలో ఒకామె పేరు సిగ్రిడ్ నాయిహావుస్ ఈమె వయస్సు 34 [రెండవ అమ్మాయి పేరు బార్బరా మిర్‌ల్ ఆమె బొమ్మ చూపబడ లేదు] పశ్చిమ జర్మనీలో మొత్తం 2500మంది పయిలట్‌లు ఉన్నారు




## 7

(గత సంచిక తరువాయి)

ఆందరకు మందులిచ్చేసి కూర్చుంది రెండు వార్డులకు మధ్యనున్న తన కుర్చీలో అలా చేరబడి ఆలోచనలలో పడింది, మెల్లగ తన జీవితం మనస్సులో కదలాడింది రెండు రోజుల తరువాత ఇల్లంతా ఫినైల్ కలిపిన నీళ్ళతో తుడవాలనుకుంది నీరజ ఆ ఇంట్లో కాస్త ఈగలు ఎక్కువైతే అత్తగారు సహాయం చేస్తానంది "సరే మీరు వంటిల్లు, ఆ ప్రక్కగది శుభ్రం చేయండి సామాన్లన్ని ఓ ప్రక్కకు పెట్టి, నేను వచ్చి తడి గుడ్డతో తుడుస్తా," అని ఓ ఒప్పందం కుదుర్చు కున్నారు

నీరజ పెద్ద గదిలోని సామాన్లను వసారాలోనికి తరలించడం మొదలెట్టింది మంచాలను రెండింటిని గోడనుంచి దూరంగ జరిపింది ఆ సందులోదూరి అక్కడున్న కొన్ని సామాన్లను తెచ్చి వసారాలో పెట్టింది ఆ క్రింద మంచం క్రింద తుడవడానికి మంచానికి గోడకు మధ్యన దూరింది వంగి కాస్త తుడిచి కొయ్యబారిపోయింది నేలను చూస్తూ

నేలపైన పగిలిన ఎర్రని చేతి గాజుముక్కలు ఓ నాలుగు, వాడిన సంపంగిపూల చెండు ఓ చిన్నది పడున్నాయి నీరజకు ఎర్రని గాజులు ఇష్టముండవు మల్లెపూలు, సన్నజాజి, గులాబిపూలంటే ఎంతో ప్రీతి అవితప్ప మరోపూలు పెట్టుకోదు భర్త మోహనరావు ఏనాడైనా దొరికేయిగదా అని సంపంగి పూలు తెస్తే అవి సాయంత్రం మాత్రమే పెట్టుకుని పడుక్కోబోయే ముందు వాటిని తీసేసి వసారాలో నున్న నీళ్ళ బాల్చీలో పడేసేది అంతేకాని అవి పెట్టుకుని మంచమెక్కేది కాదు ఆ గాఢమైన వాసనకు నీరజకు తలనొప్పి వచ్చేది ఒకటి రెండు సార్లు భర్తకు చెప్పింది వాటిని తనకోసం తేవద్దని అట్లాంటిది ఈ సంపంగి చెండు ఇక్కడకు ఎలా వచ్చింది పోనీ ఎప్పటిదో ఇక్కడ పడుందని అనుకునేందుకు వీలులేదు ఆ పూలు వాడి వున్నాయిగాని బాగా ఎండిపోయిలేవు అవి తన గాజుల ముక్కలు కావు తనెప్పుడు ఆ వికారపు ఎరుపు గాజులు పెట్టుకోలేదు అవి తప్పకుండ ఇంకెవర్తివో అయ్యుండాలి ఎవరివి చెప్మా!

వెంటనే సినీమాహాల్లో కమల చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చేయి—"నీరజ! నీ మొగుడు అంత మంచివాడు కాడని తెలుసా? నువ్వు పుట్టింటికి వెళ్ళినప్పుడు ఆ అమ్మాయి సరాసరి మీ ఇంట్లోనే తిష్టవేసేదట"

అనుమానం లేదు తను, అత్తగారు సినీమాకి పోగానే ఆ ముండను తెచ్చుకొని ఉంటాడు మరి ఆనాటి ప్రొద్దున్న తన భర్త అత్తగారు గదిలో ఏవో గుసగుసలాడుకుంటున్నారు — తను రాగానే ఠక్కున ఆపేసేరు బహుశా రాత్రి ఏర్పాటు గురించేమో అప్పుడు నీరజకు గోదావరి ఒడ్డున అమ్మలక్కలు ఆడుకున్న మాటలు జ్ఞప్తికివచ్చేయి

"రంభలాంటి పెండ్లాం పుట్టింటికి వెళ్ళగానే తనకు తెల్సిన ముండని సాయంత్రాలు ఇంటికి తెచ్చుకుని రాత్రి పంపించేవాడు"

"అతగాడు ఉద్దండుడట — ఎవర్నీ ఖాతరు చేయడట ఆ తల్లి కూడ అలాంటి మనిషేనట"

**జరిగిన కథ—4.** నీరజ తండ్రి పురుషోత్తం తల్లి పాము కాటుకు గురై మరణిస్తుంది నీరజ ఇంటర్ వరకు చదివి ఆపైన స్తోమత లేక ఆపేసింది వున్న ఒక్క అన్నా మిలటరీలో చేరిపోతాడు తండ్రి చేస్తున్న స్కూలు టీచరు ఉద్యోగంలోంచి రిటైరవుతాడు నీరజకు వచ్చిన సంబంధాల్లో తండ్రికి నచ్చక కొన్ని జాతకాలు కలవక ఒకటి తప్పిపోతాయి చివరకి దూరపు బంధువొకాయన సహాయంతో ఓ రెండో పెళ్ళి వాడితో నీరజ పెళ్ళి చేయటానికి నిశ్చయించు కొంటాడు ఆమె తండ్రి నీరజ పెళ్ళి మోహన్ రావ్‌తో జరిగిపోతుంది ఆ తర్వాత ఆమె తండ్రి మరణిస్తాడు ఎంతో ఉత్తముడు అనుకొన్న తన భర్తకు లేని వ్యసనమంటూ లేదని, తన అత్త ఆడేదంతా నాటకమని తెలుసుకొంటుంది నీరజ గతంలోంచి భవిష్యత్తులోకివస్తే నీరజ ఓ హాస్పటల్‌లో నర్సు అదే హాస్పటల్‌లో పనిచేస్తున్న డాక్టర్ కృష్ణ నీరజ గతం ఏమైనప్పటికీ ఆమెను పెండ్లి చేసుకొంటానని చెప్తాడు ఫైర్ ఆక్సిడెంట్‌లో వళ్ళు కాలి ఆ హాస్పటల్‌లో చేరిన వసుమతి నుంచి సమాచారం సేకరించటానికి నిర్ణయించు కొంటుంది నీరజ

నీరజ భయంతో వణికిపోయింది జుగుప్సతో కుంచించుకుపోయింది మెల్లగ గుండె దిటవు చేసుకుని ఆ గది తుడిచింది తరువాత తడిగుడ్డతో తుడిచి సామాన్లను యధాతథంగ పెట్టేసి మంచాల్ని జరిపేసింది

"అత్తయ్య! గది శుభ్రంచేసేను మరి మిగతా గదులు ఇవాళ తుడవలేను నాకు తల నొప్పిగా ఉంది," అని చెప్పేసి ఆ బాల్చీని ఆ తడి గుడ్డను అలా వసారాలో పడేసి పోయింది

"బాగుందే వరస కాస్త పనిచేస్తేనే నీకు తలనొప్పి వస్తే రేపు పిల్లా పాప కల్గితే మరీ శక్తి ఉండదు కాబోలు"

నీరజ జవాబు చెప్పే స్థితిలోలేదు

"సరే ఎలాగూ సామాన్లను తీసేను కనుక నేనే తుడుస్తాలే" అని సుబ్బాయమ్మ ఆ బాల్చీని తీసుకుంది

నీరజ పెద్దగదిలోకి పోయి ఆ దుప్పట్లను, గలీబులను ఉక్రోషంతో తీసి కుళ్ళు బట్టలలో పారేసింది చాకంటి గలీబులను, దుప్పట్లను తీసి పర్చింది ఆ మధ్యాహ్నం అత్తగారు చూడకుండ మెల్లగా ఏడ్చింది ఏమి చేయడానికి పాలుపోలేదు సరే కొన్నాళ్ళు అతడ్ని కనిపెట్టి చూద్దామనుకుంది

ఆ సాయంత్రం మోహనరావు ఆఫీసునుండి సరిగ్గా అయిదుంపావుకు వచ్చి కాళ్ళు చేతులు కడుక్కుని బట్టలు మార్చుకుని ముస్తాబయేడు నీరజ పరీక్షగ అతడ్ని గమనించింది అతడి ముఖం అమాయకంగా సహజంగానే ఉంది ఏ బెరుకు లేదు నీరజకు అంతా అగమ్య గోచరంగ ఉంది

"నీరజ! ఈ రాత్రి నాకోసం భోజనంవండకు మా బాంకువాళ్ళు ఒకడికి బదిలీ అయిందని విందు ఇస్తున్నారు కాకినాడ మేమంతా బస్సులో వెళ్తున్నాము నేను కాకినాడ నుండి వచ్చేక రాత్రి పదకొండు గంటలు దాటొచ్చు అమ్మా నువ్వు విన్నావుగా నేను రాత్రి త్వరగ రాకపోతే నువ్వేమి గాభరా పడకు— ఏం?"

"అలాగే నాయన!" అంది సుబ్బాయమ్మ నీరజ అలా వింటూ ఊరుకుంది

ఆ రాత్రి ఆమె మంచం మీద పడుకుందేగాని అనుమానంతో కుతకుతలాడి పోయింది బహుశా ఆ కాకినాడ వన్నెలాడి దగ్గరకు పోతున్నాడేమోనని బాధ పడింది

ఆ రాత్రి మంచి నిద్రలో ఉంది నీరజ రాత్రి పన్నెండు గంటలౌతుంది మోహనరావు, ఇంటికి చేరేడు అతడి తల్లి వెళ్ళి తలుపు తీసింది బాగా విస్కీ త్రాగొచ్చాడేమో తూలుతున్నాడు మోహనరావు

"ఏమిట్రా ఇది? ఇవాళ ఎక్కువ త్రాగినట్లున్నావు నీరజకు తెలివి వస్తే గోల చేస్తుంది"

"ఏడ్చింది ఇంతకీ అమ్మా దానికి మనం ఎందుకు జంకాలె"

"అది చాల తీక్షణంగ చూస్తుందిరా?"

"బాగుందే అమ్మా — ఎప్పుడూలేందీ నీకెలా ఈ బెదరు కల్గింది — నువ్వంటేనే హడలు కదా రజనికి"

"రజని వరి పిరికిది నీరజ అలా కాదురా ఎందుకో దాని చూపు చాల గంభీరంగ ఉంటుంది"

"అదోపోజు— దాని కెవరున్నారే ఆదుకోడానికి మనం గెంటేస్తే "

"ఏమైన అంతగ త్రాగి ఇంటికి రాకురా — రసాభాసు చేస్తుంది "

"చూడమ్మా నాకు పిరికితనం మారి పోయకు నేను దానికి మొగుణ్ణా అది నాకు మొగుడా చెప్పు నాకు ఏది రహస్యంగి ఉంచాలని లేదు అదో బాధ కూడ నాకు స్వేచ్ఛగ నా ఇంట్లో నేను త్రాగకుండ దాని సుడేమిటి నాకు నువ్వు అలా చూస్తుండు దాన్ని ఎలా లొంగదీసుకుంటానో "

"సరిలేరా— నీ ఇష్టం," అని తలుపు గడియ పెట్టి సుబ్బాయమ్మ వెనుక గదిలోకి పోయింది పడుకుందుకు

మోహనరావు తూగుతో గదిలోకి వచ్చేడు తలుపు తీస్తున్నప్పుడే అయిన చప్పుడికి నీరజకు తెలివి వచ్చింది ఎలాగు అత్తగారు తలుపు తీసింది కదా అని తను మంచం దిగలేదు వసారాలో తల్లీ కొడుక్కు జరిగిన సంభాషణ విని ఆశ్చర్యపోయింది భర్త నిజస్వరూపం మెల్ల మెల్లగ బయట పడ్తూంది అయితే స్త్రీ వ్యామోహంతోపాటు, త్రాగుడు వ్యసనం కూడ ఉందన్నమాట ఈ పరిస్థితిలో తనేం చేయగలదు ! ఏమి తోచటం లేదు అలా గోడవైపు చూస్తు అటు తిరిగి పడుక్కుని ఉంది

మోహనరావు గదిలోకి వచ్చి లైటు వేసేడు తాపిగా తన పేంటు, చొక్కా, బనేను తీసి రంగు లుంగీ కట్టుకున్నాడు గదంతా విస్కీ వాసనతో నిండిపోతూంది లైటు ఆర్పేసి మంచం మీదకు వాలేదు అయిదు నిముషాలు గడిచేయి నీరజ దేవుడికి దండం పెట్టుకుంది మనస్సులో తనను భర్త ఆ రాత్రి లేపకుండ ఉండాలి కాని దేముడికి ఆమె విజ్ఞప్తి వినిపించినట్లులేదు మోహనరావు గట్టిగా ఆమె భుజాన్ని పట్టుకుని తనవైపుకు తిప్పుకున్నాడు అతడి ముఖం చేరువవగానే గుప్పుమని విస్కీవాసన నీరజ ముఖానికి ఛెళ్ళున కొట్టింది

గభాలున లేచి కూర్చుంది ఆ నీలి బెడ్‌లైట్ కాంతిలో లీలా మాత్రంగా ముఖాలు గోచరిస్తున్నాయి

"ఏం లేచి పోయేవు— ఈ మొగుడు బాగోలేడా ?"

"మీరు తప్పత్రాగి వచ్చినట్లున్నారు "

"కరెక్టు— నేను త్రాగేవచ్చేను త్రాగులేనా గాని నాకు మంచి హుషారు పుట్టదు ఇవాళమాడు నీకే తెలుస్తుంది "

"ఛీ ఛీ ఏమా పాడు మాటలు చూడండి— నాకు పాడు కల్లు వాసన గిట్టదు— చాల కంపు కొడ్తూంది "

' వెర్రిదానా ! అది కల్లుకాదే— ఫారిన్ విస్కీ దానిపేరు 'వైట్ హార్స్' కాకినాడ రేవులోంచి విదేశీ పడవలలోంచి దొంగతనంగ కొట్టుకొచ్చిన సరుకు చాల కష్టంమీద దొరికింది బాటిల్ ఎంతో తెలుసా వన్ హండ్రడ్ ఫార్టీరుపీసు చక్కని ఫారిన్ విస్కీ త్రాగివస్తే కల్లు అంటున్నావా ! ఛీఛీ దాని పరువు తీసేసేవు మంచి మూడులో ఉన్నాను మరి ఆలస్యం చేయకు— ఇలారా "

"అంత మంచి మూడు వచ్చినప్పుడు కాకినాడలోనే ఉండిపోలేకపోయేరు— మీ ఫ్రెండు ఉందిగ "

మోహనరావు నిషా కాస్త దిగిపోయింది నీరజను పరీక్షగ చూసేడు ఇప్పుడు జవాబు చెప్పి పరిస్థితిని దిగజార్చటం ఇష్టంలేక పోయింది

"మూడు డార్లింగ్— నిషా దిగిపోకుండానేరా వాసనంటావు అది అలవాటైతే నువ్వూ పుచ్చుకుంటానంటావు ముఖ్యంగ ఆడది విస్కీ మరిగిందంటే మరి విడిచిపెట్టదు అది లేకపోతే మంచమే ఎక్కదు మందులో అంత మహత్యముంది," చటుక్కున వంగి నీరజ చేతివి అందుకుని బలంగా తనమీదకు లాక్కున్నాడు

నీరజ పెనుగులాడుతుంటే బలంగా తన చేతుల్లో బంధించేడు నీరజ మోహనరావుని అసహ్యించుకుంటూనే గత్యంతరంలేక లొంగిపోయింది మోహనరావు విజయోత్సాహంతో నవ్వుకున్నాడు

ఆ మరునాడు తనను తానే అసహ్యించుకుంటు లేచింది నీరజ మోహనరావు వైపు చూచింది గాఢంగ నిద్రపోతున్నాడు పెరట్లోకి వెళ్తుంటే అత్తగారు ఎదురైంది సుబ్బాయమ్మ వ్యంగ్య పూరితమైన నవ్వు నవ్వింది ఆ చిరునవ్వు నీరజ హృదయాన్ని మరింత రగిల్చింది

అది మొదలు నీరజ భర్తను ప్రేమగ చూసుకోలేకపోయింది కాని తన ఏహ్యతను తనలోనే ఉంచుకుంది ఆ సాయంత్రం భర్తతో మళ్ళీ స్వేచ్ఛగ మాట్లాడేందుకు అవకాశం కల్గింది









అత్త సుబ్బాయమ్మ గుడిలో ఎవరో హరికథ చెప్తున్నారంటే వెళ్తానంది ఆరు గంటల నుండి ఎనిమిది గంటల వరకే కోడల్ని తన వెంటరమ్మంది ఇంట్లో వంట చెయ్యాలి కద ఇంతకీ హరికథ తన కేమీ నచ్చదు అందుకే రానంది నీరజ రాత్రి కొడుకు తప్ప త్రాగి గదిలోకి వచ్చేడు కొడుక్కీ, కోడలుకి ఏదో రభస జరిగుంటుంది అందుకే ప్రొద్దున్న కొడుకు ఆఫీసుకు పోయేవరకు కొడుకు కోడలు ఎడముఖం, పెడముఖం పెట్టుకున్నారని గమనించింది మరి కోడల్ని తన వెంటరమ్మని వత్తిడి చేయకుండ వెళ్ళిపోయింది

ఆవిడ వెళ్ళిపోయిన పావుగంటకు బాంకు నుండి మోహనరావు ఇంటికి వచ్చేడు చేతులు, కాళ్ళు ముఖం కడుక్కొని బట్టలు మార్చి లుంగీ కట్టుకుని

సూపర్ మ్యూజికల్స్ (మదరాసు)వారు ఇటీవల విజయవాడలోని తుమ్మలపల్లి క్షేత్రయ్య కళా క్షేత్రంలో యేర్పాటుచేసిన సినీ సంగీత విభావరిలో గానంచేస్తున్న ప్రముఖ సినీ నేపధ్యగాయకుడు శ్రీ సిరాపురం నాగేశ్వరరావు, డాక్టర్ కోనాడ అశోక్‌లని చిత్రంలో చూడవచ్చు



## జీవిత సమరం

వసారాలో వాలు కుర్చీలో కూర్చున్నాడు నీరజ కాఫీ తెచ్చిచ్చింది నీరజ ముఖంలోకి చిరునవ్వుతో చూస్తూ కప్పను అందుకున్నాడు

మోహనరావు అందమైనవాడు ఆ చిరునవ్వు మరీ సమ్మోహనంగ ఉంటుంది అది తట్టుకోలేక ప్రక్కకు త్రిప్పుకుంది

"నీరజ! ఇంకా కోపం పోలేదా? చూడు సిగరెట్టు త్రాగడం ఎలాంటిదో, విస్కీ పుచ్చుకోవడం కూడ అట్లాంటిదే ఈ రోజుల్లో"

"అదిసరే గాని నేను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పలేదు"

"ఏమిటది— ఆ నిషాలో నేను చాల విషయాలను మర్చిపోయేను"

"ఇప్పుడు నిషాలేదు కదా, ఇప్పుడు చెప్పండి? నేను అత్తగారు, ఆనాడు సినిమాకి వెళ్ళినప్పుడు నా మంచంమీద పడుక్కున్న ఆడది ఎవరు?"

"నువ్వు నాకు జవాబు చెప్పు— అసలు నీకీ అనుమానం ఎలా కల్గింది?"

'అనుమానంమేమిటండి ఆధారాలు దొరుకుతే'

"ఏమిటో అవి"

"నిన్న ప్రొద్దున పెద్దగది శుభ్రం చేస్తుంటే మంచానికి గోడకు మధ్య సందులో పగిలిన గాజు ముక్కలు ఎర్రనివి నాలుగు, వాడిపోయిన సంపంగి పూల చెండు దొరికేయి అవి ఎవరివి?"

"అంతకోపంగ చూడకు — అవి నీవే అయ్యుండాలి లేకపోతే మన పడక గదిలోకి ఎలా వస్తాయి"

"నాకు ఎర్రగాజులు, సంపగి పూలంటే ఇష్టముండవు మీకు తెల్సు నేనెప్పుడు వాటిని పెట్టుకోలేదు—ఎవర్తా ముండ?"

మోహనరావు విరగబడి నవ్వేడు

"నిన్ను గవర్నమెంటు సి ఐ డి ఇనస్పెక్టరుగ తీసుకోవల్సింది బాగా పనికొస్తావు ఆ ఉద్యోగానికి"

"మాట తప్పించకండి-నిజం చెప్పండి"

"నిజం తెల్సుకుని ఏమిటి చేస్తావు? నన్ను వదలిపెట్టి పోతావా?"

"నేను గతిలేని దాన్నని మీకు తెల్సు – అందుకేగా మీకా ధైర్యం"

"మొగవెధవకి ధైర్యం లేకపోతే మొగుడెలా గవుతాడే"

"అదిసరే—జవాబు చెప్పండి"

"చెప్పకపోతే ఏం చేస్తావు?"

"అనుమానంతో ఏడుస్తాను"

"నిజం చెప్పినా మరింత ఏడుస్తావ్"

"ఈ ఏడుపులో అంత అగ్ని, కోత ఉండవు'

"ఏడుపులో రకాలున్నాయన్నమాట"

"చెప్పరా?"

"నువ్వు రిక్వెస్టు చేస్తే చెప్తాగాని దబాయించి అడుగుతే వణికిపోయి పిరికి వెధవలా అన్నీ చెప్పి నీ క్షమాపణ అడుగుతానని అనుకోకు"

అతను నవ్వుతూనే ధోరణి మార్చడం కనిపెట్టింది నీరజ అతడితో పోట్లాడడం నీరజ ఉద్దేశంకాదు అతడి నిజస్వరూపం ఏ విధంగానైనా తెల్సుకోవాలని తలచింది

"సరే రిక్వెస్టు చేస్తున్నాను – చెప్పండి"

"నీకు తెలిసే అడుగుతున్నావు"

నీరజ నివ్వెరపోయింది—"అదేమిటి నా కెల తెల్సు?"

"నువ్వే నిన్నను అన్నావుగ కాకినాడలో న ఫ్రెండున్నాదని"

"అయితే నేను విన్నదంతా నిజమన్నమాట'

"అంతా కాకపోయిన కొంత నిజముంటుంది నేను అప్పుడప్పుడు త్రాగుతుంటాను పార్టీలకు వెళ్ళినప్పుడు, లేకపోతే త్రాగే ఫ్రెండు కూడినప్పుడు ఆ ఫ్రెండు అప్పుడప్పుడు గర్ల్ ఫ్రెండు కావచ్చు అప్పుడు మూడు బాగా కుదిరి మరింత త్రాగుతాను ఇంతకీ నీకీ వార్త మోసిన ముండలెవరు?"

"ముండలుకారు-పునిస్త్రీవాళ్ళ గోదావరిలో స్నానానికి వెళ్ళినప్పుడు నన్ను చూసి అమ్మలక్కలు అనుకోడం విన్నా"

"నాకు తెల్సు—అందులో ముఖ్యంగ వెనుక వీధి రాజ్యం ఉండుంటుంది దాని మొగుడు చాతకాని వెధవ అందుకే అది అప్పుడప్పుడు కాకినాడ, రాజమండ్రి బంధువులింటికని పోతూంటుంది సరదా తీర్చుకుందికి ఈ పేటలో చాలమందికి తెల్సు దాని సరసాలు నేను కన్నుగీటితే వస్తుందనుకో – కాని దాని సన్నటి కర్ర శరీరం నాకు నచ్చదు అందుకే దాని వగలు నా దగ్గర పనికి రాలేదు అందుకే దానికి నా మీద అంత

# GOPI

## KITCHEN MACHINE



భారత దేశంలో
ఏకైక ఆహార
తయారీ సాధనం



## ఇందువలన తతిమ్మా మిక్స్చర్లు గ్రైడర్లు 19 శతమానం పరికరాల్లా తయారయ్యాయంటే మొమ్మాటికి నిజం

### ఎన్ని సంవత్సరాలు గడచినా శ్రమరహితమైన సేవ నివ్వగలదు

**గోపీ** పరిపూర్ణ పనరులుగల ఏకైక వంట యంత్రం
ఇందుకు కారణం నేడు లభించే యంత్రములందు
9 ప్రత్యేక జాడీలను జోడింపుగల ఆహార తయారీ
విధానమందు ఇదొక్కటే ఈ తెగకు చెందినది
అందువలన మీ కాఫీ వెల్లుల్లిపాయల వాసనరాదు
మీ ఇడ్లీలు కాఫీ వాసనవచ్చుటకు సాధ్యం లేదు
మీరు పదునైన బ్లేడుల కోసం వెతికే శ్రమ
ఇందువలన తప్పుతుంది
దిని కార్యక్షమతను నేరుగా ఉచితంగా చూచి పరీక్షించ
డానికి మీ సమీపంలోగల మా డీలర్లను అడగండి

- 60 నిమిషాల కాలం నిర్విరామంగా పనిచేస్తుంది
- 450 వాట్ శక్తిగల మోటార్
- రుబ్బుటకు నూరుటకు 1.5 లీటర్ సామర్థ్యంగల పాత్రలు
- ఐ ఎస్ ఐ నియంత్రణ సంఖ్య 4250 1967కు అనుగుణంగా ధృవీకరించబడింది
- 9 జోడింపులు ప్రతియొక్క తయారీ ప్రత్యేకంగా ఒక్కొక్కటి

జీవితకాలమంతా ఉచిత సేవ ఒక సంవత్సరం గ్యారంటీ కాగా
జీవితకాలమంతయూ ఉచిత సేవ
ఆంధ్ర ప్రదేశ్ మరియు కర్నాటక రాజ్యములందు అన్ని
ప్రముఖ డీలర్లవద్ద లభించును

**గోపీ** అన్న పేరు మేలిమి రకానికి ద్యోతకం
ఇది విశ్వమంతటా వ్యాపకం

ఆంధ్ర ప్రదేశానికి ఏకైక పంపిణీదారులు
**మౌర్య సేల్స్**
6 2 992/3 రహజపార్క్ అపార్టుమెంట్ ఎదురు
ఖైరతాబాద్ హైదరాబాద్ 500 004

దేశమంతటా వ్యాపించియున్న సేవా బృందం జీవితకాలమంతయూ ఉచిత సేవ చేయగలదు

ట్రాన్స్ ఏషియన్ ఎక్స్పోజిషన్ 1982 వారిచే స్వర్ణ పతకం, బిజినెస్ లింక్స్ 1982 బెంగళూరు వారిచే ప్రథమ బహుమతిని పొందియున్నది
ఆంధ్ర ప్రదేశ్ మరియు కర్నాటక రాజ్యములందు అన్ని ప్రముఖ డీలర్లవద్ద లభించును.











MS-0163

ఉక్రోషం నాకు ఏ ఆడదైన నిండుగా విల్ బ్యూటీఫుల్ అండ్ ఫుల్ కర్వ్సులో ఉండాలి అప్పుడే ఇష్టం ''

''ఛీ ! ఛీ ఏమా రంకు మాటలండీ — మీకు అలా భార్య ముందు మాట్లాడడానికి అసహ్యమేయడంలేదు ?''

''ఇది మరీ బాగుంది ! నువ్వన్నీ తెల్సుకోవాలని అడిగేవు మరీ మరీ రిక్వెస్టు చేసేవు పోనీ కదా అని అబ్బ మాడకుండ మొగవాడిలా చెప్తుంటే భార్య ముందర చెప్పేస్తున్నానని ఈసడించుకుంటావా ? ఏమైన నీకు సబబుగ ఉందా — చెప్పు నా మాటలు నీకు నచ్చకపోతే ఆ చేతిగాజుల ముక్కలు కనిపించినప్పుడు చూసి చూడనట్టు ఊరుకోవల్సింది— ఏం ?''

''మీరు మాటల్లో చాల నేర్పరులు ఇంతకీ ఆ కాకినాడ ఫ్రెండు పేరు చెప్పనేలేదు ''

''నాకు కాకినాడలో ముగ్గురు ఫ్రెండ్సున్నారు ఒకర్తి అక్కడికి వెళ్తే విందు చేస్తుంది ఒకర్తి ధైర్యంగ ఇక్కడికి వస్తుంది, ఆ ఊరులో భయపడ్తుంది మరొకర్తె ఏనాంలోను, కాకినాడలోను భయపడ్తుంది కావలుస్తే పెద్దాపురంగాని, పిఠాపురంగాని వస్తుంది వాళ్ళు ముగ్గురు బజారు సరుకుకారు అంత ప్రయివేటు వ్యవహారమే అన్నట్టు ఈ మధ్యన ఇక్కడకు వచ్చిందే ఆ టైపిస్టు పేరు భాగ్యం ''

''అది మీ భాగ్యం, నా దౌర్భాగ్యం,'' అని కోపంతో అక్కడనుండి వెళ్ళిపోయింది పెరట్లోకి — తీరుబాటుగ నూతి గట్టున ఖార్చుని ఏడవడానికి— ఆలోచించడానికి

## జీవిత సమరం

''నీరజ ! తలుపేసుకో — నేను వీధిలోకి వెళుతున్నాను,'' అని సిగిరెట్టు విలాసంగ ముట్టించి వీధిలోకి పోయాడు

అట్లాంటి బరితెగించిన భర్తను ఏంచేయడానికి నీరజకు తోచలేదు ముందు మనసారా యేడుద్దామనుకుంది కాని ఏడ్చి తను సాధించిందేమి ఉండదని ఆ పని చేయలేదు పోనీ ఆ భర్తను వదలి అన్న వద్దకు పోదామనుకుంది అంతలోనే భయంకల్గింది నీరజకు తెల్సు తన వదిన ఓ వారంరోజులు ఇంట్లో ఉండనిచ్చి గెంటి వేస్తుంది ఆమె నోటి ధాటీని తను తట్టుకోలేదు పోనీ ఎక్కడైనా ఉద్యోగం సంపాదించిపోతే తన ఇంటర్ చదువుకు ఎవరు ఉద్యోగం ఇస్తారు ? అన్నీ ఆలోచనలే దేనికి జవాబు దొరకడంలేదు

మళ్ళీ మనస్సు మరోలాచెప్పడం మొదలెట్టింది బహుశా మోహనరావు తన రొమాన్సును ఒక్కటంగా చాటుకున్నాడేమో— తనలాంటి హీరో మరి లేడని కాని ఒకటి మాత్రం నిజం మోహనరావు వ్యసనపరుడు

### 8

ఓ పదిహేను రోజులు గడిచిపోయేయి మోహనరావు ఏ జంకు లేకుండా ఇంట్లోనే అప్పుడప్పుడు త్రాగడం చేసేవాడు శనివారాలు వస్తే కాకినాడకు పోయి అక్కడ రాత్రి ఉండిపోయి మరునాడు ఆదివారం భోజనం వేళకు వచ్చేవాడు నీరజ మరో దిక్కులేక జీవితంతో రాజీ పడడం మొదలెట్టింది మొండివాడు రాజుకన్న బలవంతుడని మోహనరావు తెల్సుకుని అలాగే ప్రవర్తించేవాడు అతడికి పూర్తి మద్దతునిచ్చేది ఆ తల్లి కొడుకు చెడిపోతున్నా పట్టించుకునేది కాదు అతడి ఆనందమే తన ఆనందంగా భావించేది కోడలికి అత్తగారిసహాయం లేకపోయింది

''అత్తయ్యా ! మీరుకాస్త గట్టిగ చెప్పండి మీ అబ్బాయి త్రాగుతున్నారు అప్పుడు మనం సినిమాకి వెళ్ళినప్పుడు ఎవర్తినో ఇంటికి కూడా తెచ్చేరు ''

''చూడు కోడలుపిల్లా — మొగాళ్ళు మనం చెప్తే మానేయరు— వాళ్ళ జల్సాలు వాళ్ళవి ఇంతకీ వాడు నాకు ఒక్కగానొక్క బిడ్డ ముగ్గురు మొగపిల్లలు వాడి ముందు పుట్టి సంవత్సరం లోపునే చనిపోయేరు వాడెలాగో నిల్చేడు నా ముద్దూ ముచ్చటా వాడే వాడి ఆనందాన్ని నే నెన్నడూ కాదనలేను నువ్వు ఆడదానివి చూసి చూడనట్టుగ ఉండు అప్పుడే నీ సంసారం నిలుస్తుంది ఇంతకీ వాడు నీకేమి అన్యాయం చేయలేదుగ నిన్ను ఆదరిస్తున్నాడుగా మరి నీకొచ్చిన లోటేమిటి ?''

అత్తగారి ఫిలాసఫీ నీరజకు నచ్చలేదు ఏదో ఒకనాడు తనతోబాటు అత్తగారు ఏడవక తప్పదు అన్న నిర్ధారణకు నీరజ వచ్చింది మరికొన్ని రోజులు గడిచేయి

ఒకనాడు మోహనరావు విచారంగా ఇంటికి చేరేడు ఆ తల్లి చాల ఆందోళన చెందింది

''ఏమయిందిరా నాయనా అలా ఉన్నావు ?

''ఏమీలేదే కాస్త డబ్బు కావాలి ''

''కాస్తంటే ?''

''ఓ నాలుగువేలు కావాలి ''







"మరి ఆఫీసులో లోను తీసుకోలేకపోయేవు?"

"అన్ని అయేయి—మరేలప్ప బాంకులోపుట్టదు అన్ని కోతలు పోను చేతికి వచ్చేది సగానికి సగం పైగా—"

"ఏమిటిరా పైగా?"

"చెప్తే నువు తిడ్తావు"

"నాయనా! నిన్నెప్పుడైన నిందించేనా చెప్పు?"

"పేకాటలో చాలోడిపోయేను పైగ స్నేహితుల దగ్గర అప్పులు చేసేను మా లీడరు నరసింహం తన దగ్గరున్న డబ్బుల్లో ఓ వెయ్యి రూపాయలు మూడు నెలల క్రిందట సర్దేడు ఇప్పుడు ఆ డబ్బు వాడికి అవుసరమైంది నన్ను ఒత్తిడి చేస్తున్నాడు ఏం చేయడం?"

"నా దగ్గర డబ్బు ఏమి లేదురా మహా ఉంటే ఓ రెండు వందలుంటాయి"

"వందలేమి సరిపోతాయమ్మ— వేలు కావాలి"

"కోపగించుకోకు గాని పెండ్లి ఖర్చులుపోను మిగతా ఆరువేలు నీకే ఇచ్చేను కదురా— ఆ డబ్బు ఏం చేసేవు?"

"ఏం చేసానా ఆ నాటికి వడ్డీతోసహా పేరుకుని పోయిన అప్పుల్ని తీర్చేను మరి నా ఖర్చులు నాకున్నాయిగ నీకు తెలియందేముంది"

"ఆ ముండలకి నగనట్ర కొనిస్తున్నావేమిటిరా? అలా అయితే ఎంత డబ్బు చాలదు సుమా"

"నగనట్రా కాకపోయిన కనీసం బట్టలైనా కొనివ్వాలికదా ఇంతకీ నీకా వివరాలన్ని ఎందుకు నాకు డబ్బుకావాలి అంతే"

"ఎందుకురా చికాకు నా మాట విను — నీ జల్సాలకు, త్రాగుడుకి నిన్నేమనను — నీ ఇష్టం కాని ఆ దిక్కుమాలిన పేకాట మానేయరా నువ్వు అమాయకుడివి నువ్వు గెలవలేవు వాళ్ళంతా నిన్ను మోసం చేస్తున్నారని నా అనుమానం"

"అమ్మా! నాకు మరీ కోపం తెప్పిస్తున్నావు నేను నా అలవాట్లను ఒదులుకోలేను ఇంతకీ ఎందుకు వదులుకోవలి నాకు వాటివల్ల చాల ఆనందం లభిస్తుంటేను చూడమ్మా! నీవు మాటి మాటికి నేను చెడిపోతున్నానంటే నేను ఇల్లు వదలి పారిపోతాను— జాగ్రత్త!"

పుత్రుడు ఆ విధంగ బెదిరించేసరికి ఆ సుబ్బాయమ్మ వణకిపోయింది భయంతో కంటి వెంట నీరు చిమ్మింది

"నాయన! అంత మాటనకురా నీ ఇష్టం— నీ ఆనందానికి నువ్వు ఏమిచేసినా నేనేమి అనను — ఒట్టు కాని నన్ను వదలి పోకురా నిన్ను చూసుకుంటూనే కదరా నేను బ్రతికున్నాను"

"సరేలే— మరి ఏడుపు మొదలెట్టకు ముందు ఈ సంగతి ఆలోచించు డబ్బు ఎలా దొరుకుతుందో చెప్పు"

"ఓరే— నేనేం చెప్పగలనురా పెండ్లయి రెండేండ్లయినా పూర్తి కాలేదు — మళ్ళీ అప్పుల పాలయేవు మనకా ఆస్తిపాస్తులేమి మిగలలేదు అన్నీ ఏనాడో హరించుకునే పోయేయి అమ్మడానికి మరేమి మిగలలేదు కదా నా బంగారమా అదీ ఎక్కడకు చేరిందో అక్కడకు చేరింది కదా"

"బంగారమంతా నేనే తగలెట్టేనంటే నాకు కోపం వస్తుంది బంగారం నువ్వే ఖర్చు చేసేసేవు నీ సరదాలకి—నాకు మాత్రం ఓ అయిదు తులాలు గొలుసిచ్చేవు—అంతేనా?"

"నోరు మూసుకోరా—గుడ్డొచ్చి తల్లిని వెక్కిరించిందట—అలా ఉంది నీ వరస—నోరుమూసుకో," హఠాత్తుగ సుబ్బాయమ్మకు కోపం వచ్చింది

ఈ మాటలన్ని వంటింట్లోంచి, కిటికీ తలుపు వేసున్న ఆ తలుపు దగ్గరచేరి శ్రద్ధగ వింటున్న నీరజ అనుకుంది—

"దొందుకు దొందే—ఈ మహాతల్లి వయస్సులో ఇష్టమొచ్చినట్లు వ్యవహరించి ఓ వెలుగు వెలిగించినట్లుంది ఆ లొసుగు ఈ కొడుక్కి చిన్నప్పుడు తెలిసి ఆమెను నొక్కిపెట్టి ఉంచేడు జీవితాంతము ఆ తండ్రి ఏనాడో చచ్చి ఉంటాడు అందుకే వీళ్ళిద్దరు ఆడింది ఆట, పాడింది పాట ఛీ! ఛీ!! ఎంత నీచమైన కుటుంబం వీళ్ళది నా ఖర్మ ఈ మురికిగుంటలో పడ్డాను"

"సారీ తల్లీ! ఏదో మార్గం చూడు," ఆ మాటలో సుబ్బాయమ్మ శాంతించింది

"ఒరే నీరజకు వాళ్ళ ఊరు వెదురుపాడులో ఓ ఇల్లుంది వాళ్ళ నాన్న చచ్చిపోయేదుకదా ఆ ఇల్లు అమ్మేసి తన సగభాగం తనని తెచ్చుకోమందాం ఎంత అధమాధంగ అంచనా వేసినా పదహారువేలు పలుకుతుంది దానివంతు ఎనిమిదివేలు తెచ్చుకుంటే నీ కష్టాలు తీరుతాయి ఏమంటావు?"

ఆ మాటలు వింటుంటే నీరజకు భయం పట్టుకుని కాళ్ళు వణకజొచ్చాయి ఈ గండం ఎలా గడపడమో ఆలోచనలో పడింది

"అమ్మా! నీ బుర్రలో యెన్నో గొప్ప ఆలోచనలున్నాయి నీది సైంటిస్టు మేధస్సు ఒకసారి నీరజను పిలువు దాన్ని మెత్తగ అనునయించి ఒప్పిద్దాం"

ఆ మాటలు వింటూనే నీరజ గబగబ పెరట్లోకి పోయి నూతివద్ద బట్టలు తడువుతు కూర్చుంది నిముషం తరువాత సుబ్బాయమ్మ పెరట్లోకి వచ్చింది

"నీరజ! ఆ బట్టలు నేను తడువుకోను— నీకెందుకమ్మ ఆ బాధ?" ఎంతో ప్రేమతో అంది అంత ప్రేమతోను నీరజ జవాబిచ్చింది

"అత్తయ్య! నాకిప్పుడేమి పనిలేదుగ — మీకెందుకా శ్రమ కల్గించడం అని నేనే చేస్తున్నాను"

"ఇలా గదిలోకి ఓసారి వస్తావా—అబ్బాయి నీతో ఏదో మాట్లాడాలంటున్నాడు"

"పది నిమిషాలలో ఈ బట్టలు ఆరవేసి వస్తాను"

"ఆ పని ఏమంత తొందరని? వాటిని అలానే వదిలేసి ఇంట్లోకి రా అబ్బాయి మళ్ళీ వీధిలోకి పోతాడు"

## "ఆకులు రాల్చిన చెట్టు!"

ఆకులు రాల్చిన
చెట్టు మోడులాగ
అప్పుడప్పుడు వాడి కనిపించినా
చిగిర్చి మళ్ళీ క్రొత్త శోభతో
ప్రకాశిస్తుంది ధర్మం!

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి






బులుసు వేంకటరమణయ్య

# విద్యాబోధన

ధర్మా ధర్మ పరిజ్ఞానానికి విద్య ఎంతో అవసరమని అందరికీ తెలుసును నిరక్షరాస్యత రూపుమాసి పోవడానికి నిర్బంధ విద్యా విధానం అవసరమని ప్రభుత్వమూ గ్రహించింది ప్రజలు సహకరించనిదే ఏ చట్టమూ సమర్థవంతంగా పనిచెయ్యదని అందరికీ తెలుసును అందువల్లనే పాఠశాలలు పిల్లలను ఆకర్షించడానికి ఇప్పుడు వారికి బడిలో మధ్యాహ్న భోజన సదుపాయం కూడా ప్రారంభించబడింది దీనివలన తగిన ఫలితాలు ఉండవచ్చునని ఆశించవచ్చును

పూర్వం బడులలో విషయాలన్నీ అప్పటి ప్రభుత్వ భాష అయిన ఆంగ్లంలోనే బోధింపబడేవి, మాతృభాషా బోధనకు కొద్ది పాటి సమయమే ఇవ్వబడేది ఆ విద్యావిధానం అందరినీ ఆకర్షించలేదు మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత క్రమంగా మాతృభాషకు ప్రాధాన్యంవచ్చి అన్ని విషయాలు మాతృభాషలోనే బోధించ బడడంవల్ల చదువుకొనేవారి సంఖ్య పెరిగి విద్య ఎక్కువగా వ్యాప్తిలోకి వచ్చింది

ప్రారంభదశ మొదలుకొని కొన్నేండ్లపాటు—అంటే పాఠశాల చదువు ముగించేవరకూ మాతృభాషలో విద్యను బోధించడం అవసరమే అప్పుడు బాలబాలికలు సులభంగా విషయాలను గ్రహించ గలుగుతారు దానితోపాటు ఆంగ్లభాషను కూడా చదవవలసి ఉన్నది ఏమంటే కాలేజీ తరగతులలో అన్నివిషయాలూ ఆంగ్లంలో బోధించబడతాయి కళాశాలల్లోకూడా మాతృభాషలోనే విషయాలను బోధించాలని కొందరి అభిప్రాయం అలా బోధించిన కొన్నిచోట్ల ఆశించిన ఫలితాలు లభించినట్లులేదు ఆంగ్లభాష తెలియకపోతే విజ్ఞానశాస్త్ర విషయాలు తెలియడం కష్టం

చీనా, జపాన్, రష్యా మున్నగు దేశాలలో కాలేజీ చదువులు ఆంగ్లభాషలోనే జరుగుతున్నాయా? వారి వారి భాషలలో జరగలేదా? అని ఎవరైనా అడగవచ్చు ఆ దేశాలు అభివృద్ధి చెందిన దేశాలు సాంకేతిక శాస్త్ర విద్యల్లో పరిపూర్ణాలు మనది వర్ధమానదేశం అభివృద్ధి చెందిన దేశంకాదు అందువల్ల యావత్ప్రపంచంలో అర్థమయే ఆంగ్లభాష కావలసినదే! మనదేశం కూడా అన్నిటిలోనూ స్వయంసమృద్ధమయితే—అప్పుడు మనం ఇతరులపై ఆధారపడవలసిన అవసరం ఉండదు అప్పటివరకూ మనం ఆంగ్లాన్ని విడవకూడదు ఈ విషయం గ్రహించినవారు ఇప్పట్లో ఆంగ్ల భాషను వ్యతిరేకించరు 

## జీవిత సమరం

చేసేదేమిలేక చేతులు కడుక్కుని అత్తగారి వెనకాతల ఇంట్లోకి వచ్చింది తువ్వాలుతో చేతులు తుడుచుకుంటు గదిలోకి వచ్చింది మోహనరావు ముఖమంతా నవ్వు పులుముకొని ఎంతో అనురాగం వ్యక్తపరుస్తు నీరజను కూర్చోమన్నాడు ఎదురుగ ఉన్న కుర్చీలో

అప్పుడు నీరజ అనుకుంది తన జవాబు వింటే ఆ నవ్వు ముఖం జేవురిస్తుందని, ఆ అనురాగం అనులాపంగ మారుతుందని

"ఏమటండి పిలవేరుట?" అంత ముద్దుగాను అడిగింది నీరజ చిరునవ్వుతో

ఆ చిరునవ్వు చూడగానే ఆ తల్లి, కొడుకులకు కొండంత ధైర్యం కల్గింది మోహనరావు తల్లి వైపు చూచి —

"నువ్వు చెప్పమ్మా సంగతేమిటో," అన్నాడు సుబ్బాయమ్మకు కొడుకు చెప్తేనే బాగుంటుందనుకుంది కాని కొడుకు తనని ఇరకాటంలో పెట్టేడు సరే చూద్దామన్న ధోరణిలో నీరజను అడిగింది

"చూడమ్మాయి — మీకు వెదురుపాడులో స్వంత ఇల్లొకటి ఉండాలికదు"

"అవునండి"

"మరి మీ నాన్నగారు చనిపోయేరుకద—నువ్వుగాని, నీ అన్నగాని ఆ ఇంటిలో ఉండరుకదా ఆ ఇంటిని అమ్మేస్తే ఏం?"

"ఆ ఇల్లు ఏనాడో అమ్మకం అయిపోయిందండి"

"ఆ!" తల్లీ, కొడుకు ఒక్కసారిగ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చేరు

"ఎంతకమ్మేరు? ఎవరమ్మేరు," మోహనరావే రంగంలోకి వచ్చేడు

"చూడండి ఆ ఇల్లు పిత్రార్జితంది మా నాన్నగారు తన తరువాత తన కొడుక్కిచ్చేరు నా పెండ్లికి మా నాన్నగారు ఆ ఇంటిమీద అప్పుచేసేరు ఆ అప్పుమీద వడ్డీ పెరిగిపోతుందని దినవారాలైయేక మా అన్నయ్య అప్పిచ్చిన షావుకారికి అమ్మేసేడు అప్పుడు అప్పును, దానిమీద వడ్డీని మినహాయించి ఆ షావుకారు మా అన్నయ్యకు ఎనిమిదివేలిచ్చేడు మా అన్నయ్య కాస్త ఖర్చుదారుడే వాడికి టాటా నగర్‌లో అప్పులున్నాయట ఆ డబ్బు తీసుకుని వెళ్ళిపోయేడు"

మోహనరావుకి మెల్లగ కోపం విస్తరించుకుంటూంది

"మరి నీ వాటా డబ్బు నీకివ్వద్దు"

"నా వాటా డబ్బు మా నాన్నగారే ఆ ఇంటిమీద అప్పుగా తెచ్చి నా పెండ్లి చేసేరు మిగిలిన సగం మా అన్నయ్య వంతుకొచ్చింది"

"ముష్టి తొమ్మిది వేలు కట్నమిచ్చేరు ఏ లాంఛనాలు పెట్టలేదు దానికోసం ఇంటిమీద అప్పు చేసేడా? ఇంత దరిద్రపు సంబంధం అనుకోలేదు," అని సుబ్బాయమ్మ వాల విసుక్కుంది

మోహనరావు కోపమింకా తగ్గలేదు

"నీరజ! అదేమి కుదరదు మీ అన్నయ్యకు వెంటనే వ్రాయి— అతడు తీసుకుని వెళ్ళిన ఎనిమిది వేలలో సగం నీవంతుకు వస్తుందని, వెంటనే పంపమని"

"మా అన్నయ్య నా క్షేమ సమాచారాలు కనుక్కునేందుకు ఇంత వరకు ఉత్తరం ముక్కయినా రాయలేదు అటువంటి వాడు డబ్బు పంపుతాడా? మా వదిన మహాకానిది ఆమె పంపనిస్తుందా?"

"చూడు కోడలుపిల్లా నా సంగతి నీకు తెలియదు — నేనంత కన్నా కానిదానిని నోరు మూసుకుని మేము చెప్పినట్లు వ్రాయి"

"క్షమించండి అత్తయ్యా— మా అన్నయ్య ఏనాడో ఆ డబ్బు ఖర్చుచేసి ఉంటాడు నాకు వాడికి ఇన్నాళ్ళులేని బాంధవ్యం ఉత్తరం వల్ల కల్గదు ఏ ప్రయోజనం ఉండదు వాడు నాకు డబ్బు పంపడు,"

తన పథకం పారనందుకు కోపం పట్టలేక మోహనరావు నీరజ చెంప మీద కొట్టేడు చెయ్యిచాచి

నీరజ చాల ఆశ్చర్యపోయింది కనుగుడ్ల నీరు చిమ్మగా నిశ్చేష్టురాలై భర్తను అలా చూస్తుండి పోయింది

"నా ఖర్మకు దొరికేవుకదే—నీవల్ల నాకెటువంటి సహాయంలేదు ఏ డబ్బున్న కోతిని చేసుకున్న నా గతి ఇలా కాలకపోను ముష్టిసంబంధం చేసేవు కదే," అని తల్లిమీద కూడ విరుచుకోపడ్డాడు ఆ సుపుత్రుడు మోహనరావు

"నాకేం తెల్సురా వాళ్ళింత బీదముండావాళ్ళని ఆ కామేశం వీళ్ళగురించి మహాగొప్పగా చెప్పి మనల్ని వప్పించేడు ఒక్కర్తే కూతురు — ముద్దుముచ్చట తీరుస్తారనుకున్నాం గాని ఇలా పెళ్ళవగానే దాని తండ్రి చచ్చి ఊరుకుంటాడనుకోలేదు అన్నివిధాల మనల్ని మోసంచేసేరు వీళ్ళు," అని ఆ తల్లి కొడుకు పక్షంగా మాట్లాడి కొడుకుని ఊరట పర్చడానికి ప్రయత్నించింది కాని వాడికివేమి పట్టలేదు విసరుగ, కోపంగా తల్లిని పెండ్లాన్ని చూచి వీధిలోకి పోయేడు (ఇంకా వుంది)

# పరిహాస పరీక్ష

పి. గణపతిశాస్త్రి



పొద్దున్న లేచినది మొదలుకుని సాయంకాలం దాకా త్రిజటస్వాధ్యాయి వేదం వల్లె వేస్తూనే తన గృహవ్యవహారాలన్ని చక్కబెట్టుకుంటూంటాడు అసలు అతని పేరు త్రిజటుడు అదే పనిగా పొద్దస్తమానము వేదాధ్యయనం కొనసాగిస్తూండడం వల్ల అతనికి త్రిజటస్వాధ్యాయి అన్న పేరేర్పడి స్థిరపడింది

త్రిజటుడు అయోధ్యానగరానికి సమీపంలోని ఒక కుటీరంలో నివసిస్తున్నాడు అతనికి ఆ పూరిల్లు, చిన్న పెరడు, ఒక కర్రి ఆవు, దూడ తప్ప వేరే ఆస్తి పాస్తులేవీ లేవు త్రిజటునికి అప్పుడే షష్టిపూర్తి సమీపిస్తున్నది దానికి తోడు ఆరుగురు పిల్లలున్నారు వారిలో మొదటి నలుగురు ఆడపిల్లలు చివరి వారిద్దరు మగవారు అయినా చాలా చిన్నవారు అందుచేత సంతానంలో ఎవ్వరు అతని చేతికి అందిరాలేదు

అతని భార్య అపర్ణ పెనిమిటికన్న ఇంచుమించుగా ఇరవై ఏళ్ళ చిన్న

"ఈ సంసార సాగరం అంతా ఈది అవ్వలి ఒడ్డు చేరుకోవడమెలాగో!" అని ఆ ఇల్లాలు ఎల్లవేళల మధనపడుతూంటుంది "సముద్రానికి అవతలి గట్టెక్క ? ఈదుకుపోతూ ఉండడమే మన కర్తవ్యం!" అని ఆమె నోదారుస్తూంటాడు ఆ బహుకుటుంబి

త్రిజటుడు వర్చస్వి పసి నిమ్మపండు వంటి చక్కని శరీరచ్ఛాయ అంతగా వయస్సు పైబడినా అతని జవ సత్త్వాలింకా తిరుగుముఖం పట్టలేదు

సదా వేదం వల్లె వేస్తూండడం వల్ల, విపరీతమయిన కాయకష్టంతో చెమట ఓడ్చి శ్రమించడం ఎల్ల అతని కంతటి శరీరపాటవం కలిగిందని పరిచితులయిన అయోధ్యానగరవాసులు అనుకుంటూంటారు

అది చాలా వరకు యధార్థమే త్రిజటస్వాధ్యాయి తెల్లవారుజామునే లేచి తన జపతపాలన్ని ముగించుకుంటాడు ఆ తరువాత కొంతసేపు వేదాధ్యయనం కొనసాగించి, ఒక గంపలో చిన్న గునపము, కొడవలి, గండ్రగొడ్డలి అమర్చుకుంటాడు ఆ పైన ఆయా పొలాల్లో ప్రవేశించి, కోతలయిన పిమ్మట కర్షకులు నేలమీద విడిచి వేసిన వేర్వేరు ధాన్యాల కంకులు, గింజలు గంపలో భద్రపరుచుకుంటాడు ఆ పైన అయోధ్య సమీపంలో విస్తరించిన చిట్టడివిలో ప్రవేశించి, కందమూలాలు, దుంపలు, కాయలు, పళ్ళు సేకరించుకుంటాడు ఇంకా పెరటిలో కాయగూరలు, ఫలాలు, పండించుకుంటాడు పొలాల్లో రాలిపడిన ధాన్యాదుల సేకరణకే ఉంఛవృత్తి అన్న పేరేర్పడింది అదే వృత్తితో చాలాకాలం నించి తన మనుగడకొనసాగించుకుంటున్నాడు త్రిజటస్వాధ్యాయి

చిన్నప్పటినించి కలిగినదానితో సంతృప్తిపడడం స్వాధ్యాయి కలవాటయింది అంతేగాని లేనిపోని పేరాసలేవి అతని అంతర్యంలో మొలకెత్తలేదు కనకనే అత్యవసరమయితే తప్ప ఇతరుల నర్థించడం త్రిజటుని కంతగా రుచించదు అతని కెంతసేపు తన వేదాధ్యయనమేమో, కుటుంబ పోషణానికి ఉంఛవృత్తితో ధాన్య సేకరణమేమో! పెరటిలో కాయగూరల పంటలేమో! అంతే

అయితే కొద్దో, గొప్పో వేదం చదివినవాడు కనక ఇంకా ఎక్కువగా ధన ధాన్యాలార్జించుకోవచ్చునని, కాని త్రిజటుడు బొత్తిగా అమాయకుడని, ప్రపంచ జ్ఞానం లేనివాడని ఇరుగు పొరుగులు కొందరు అతనిమీద జాలిపడుతూంటారు

ఆ వేళ పొద్దున్న యధాప్రకారంగా తన గంపలో కొడవలితో, గండ్రగొడ్డలితో, గునపంతో

చిట్టడవికి బయలుదేరాడు త్రిజటుడు. ఒక పసివాణ్ణి ఎత్తుకుని, ఇంకొకణ్ణి నెమ్మదిగా నడిపించుకుంటూ. అదే సమయంలో అతని కెదురుగా వచ్చి నిలిచింది అపర్ణ. "కాస్త ఆ గంప అక్కడ ఉంచండి! నా మనవి చిత్తగించి ఆ శ్రీరామచంద్రుల నొక్కసారి సందర్శించండి!"

తానేదయినా పని సంకల్పిస్తే భార్య అలాగ అతి వినయంతో ప్రసంగిస్తుందని త్రిజటునికెరికే! అందుచేత చిన్నగా బొమముడి విరిచి అడిగాడు.

– "ఎందుకని?"

"అయ్యో! అయోధ్య అంతా అట్టుడికినట్టుడికి అల్లకల్లోల మయిపోతున్నదే! అయినా మీరీ మాట వినలేదా?"

"ఏ మాటా? నాకేమీ తెలియనే తెలియదే!"

పట్టలేని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు త్రిజటుడు.

"ఆ సీతారామలక్ష్మణులు ముగ్గురు అరణ్య ప్రయాణానికి సన్నాహాలారంభిస్తున్నారట!"

"అలాగా! ఎందుచేత?"

భర్తకా వ్యవహారమేమీ తెలియనే తెలియదని అపర్ణ క్షణంలో పసిగట్టి వేసింది. అతని అమాయకత్వానికి లోలోపలే నవ్వుకుని నెమ్మదిగా మొదలు పెట్టింది.

"ఎందుచేతంటే ఏమని చెప్పేది? ఆ చిన్నరాణీ కైకమ్మగారికి దశరథ మహారాజు పూర్వమెప్పుడో రెండు వరాలను ప్రసాదించారట! అవి రెండు ఇప్పుడే ఇచ్చి తీరాలని ఆ చిన్నారి రాణీ భీష్మించుకుని కూర్చున్నదట! ఆ వరాల్లో మొదటిదాని ప్రకారం దాశరథి పద్నాలుగేళ్ళపాటు అరణ్యంలో నివసించాలి. రెండోదాని ప్రకారం కైకమ్మ ముద్దులకొడుకు భరతునికి వెంటనే పట్టాభిషేకం జరిపించాలి. ఆడినమాట తప్పలేక మహారాజు శ్రీరామచంద్రుల నరణ్యవాసానికి పంపించివేస్తున్నారట! ఆపైన ఆ జానకీదేవి, లక్ష్మణస్వామి తాముకూడా అరణ్యంలోనే నివశిస్తామని ఆయన వెంటపడి వెళ్ళిపోతున్నారట!"

ఉసూరుమని నిట్టూర్చాడు త్రిజటుడు.

"అయ్యో! ఎంతపని జరిగింది? ఎప్పుడే విధంగా ఎటువంటి ఘోరాపద విరుచుకుపడగలదో ఎవ్వరికి తెలియదు గదా! తీరా పట్టాభిషేకం ప్రారంభం కాబోతూంటే ఆ శ్రీరాములవారిమీద ఎంతటి పెను ప్రళయం విరుచుకుపడింది!"

అదే నిమిషంలో అందుకున్నది.

"అవును! మీరన్నది అక్షరాలా యదార్థమే! అలాగే ఎప్పుడేవిధంగా అదృష్టం కలిసివస్తుందో కూడా ఎవ్వరు ఊహించుకోలేరు! ఆ సీతా రామ లక్ష్మణులు అడిగినా, అడక్కపోయినా తమ సంపత్తి అంతా అర్హులయిన వారందరికి కోకొల్లలుగా అనుగ్రహిస్తున్నారట! మీరుకూడా చిన్నప్పుడు కొద్దోగొప్పో వేదం చదువుకున్నవారేగదా! కాస్త నా మాట కాదనక ఆ శ్రీరాములవారిని ఒక్కమారు చూచిరండి!"

అయినా త్రిజటుడు ఇల్లాలిమాట బొత్తిగా చెవికెక్కనియ్యలేదు! మళ్ళీ రవంత గద్గదికతో అపర్ణ ప్రాధేయపడింది!

"పొద్దుటి నుంచి ఈ పసిపిల్లలిద్దరు



ప్రముఖ రచయిత, కవి, పండితుడు కీ శే పిలకా గణపతిశాస్త్రిగారు జనవరి 2వ తేదీ రాత్రి తమ 72వ ఏట మదరాసులో కన్నుమూశారు. శ్రీ శాస్త్రిగారు రాసిన కథలలో చివరిది ఈ 'పరిహాస పరీక్ష'.

ఈ కథని 'తమిళనాడు ప్రభుత్వ ఆరోగ్యశాఖామాత్యులు శ్రీ హెచ్ వి హాండే గారికి శుభాకాంక్షలతో' ఆయన అంకిత మిచ్చారు.

ఆకళ్ళతో నకనకలాడుతున్నారు! అన్నాలు పెట్టమని రాగాలారంభిస్తున్నారు! ఇంట్లో పిడికెడు ఓయ్యం నూకలు కూడా లేవు! ఇలాగ ఈ లేమితో మనమింక ఎన్నాళ్ళని ఈ యమయాతన భరించగలం చెప్పండి? రవంత నా మనవి చిత్తగించండి!"

దుఃఖావేశంలో అపర్ణ గొంతు తడబడింది. అంతలోనే త్రిజటుడు తన ఆంతర్యం వెల్లడించాడు.

"మహనీయులయిన అంతటిమహారాజులే కట్టుబట్టలతో కారడవులపాలయితె, నేనే మొహం పెట్టుకుని వారినర్థించగలను చెప్పు! నాకుబొత్తిగా మనస్కరించడంలేదు! వెళ్ళనుగాక, వెళ్ళను! అంతే!"

"అలాగనకండి! మీరు అర్థించవలసిన అవసరమేమీలేదు. ఆ శ్రీరామచంద్రులే వేత్తలతోబాటు అనేకులను పిలిపిస్తున్నారట! తమ సువర్ణాభరణాలు, ముత్యాల హారాలు విలువయిన వస్తు వాహనాలు విరివిగా తమంతట తామే దానధర్మాల రూపంలో పంచిపెడుతున్నారట! అటువంటప్పుడు మీకెందుకీ తటపటాయింపు? కొంచెం నామాట ఆలకించండి! పసిపిల్లలమీద కనికరించండి!"

త్రిజటుడు రవంతసేపాలోచించి, ఇల్లాలి మాట కెదురు చెప్పలేక అలాగే అని అంగీకరించాడు.

అయితే రాజభవనంలో ప్రవేశించి, దాశరథిని సందర్శించాలంటే రవంత శుభ్రమయిన దుస్తులు ధరించాలి. త్రిజటునికి చిరుగులు లేని కాస్త మంచి ధోవతి, ఉత్తరీయము కూడా లేవు! అయినా ఆ చింకి ఉత్తరీయమే ఒళ్ళంతా కప్పుకున్నాడు. చిరుగుల ధోవతి తిరిగి తిరిగి కట్టుకుని ఎలాగో అలాగ సరిపెట్టుకున్నాడు.

వెంటనే కొంచెం పొడుగయిన ఊతకర్ర సాయంతో నెమ్మదిగా రాచనగిరులో ప్రవేశించాడు. అంతకుమునుపు అతనికి అయోధ్య అంతా సీతారామలక్ష్మణుల వనగమన వార్తలతో ఘొరుమని మారుమోగుతున్నట్టు పొడ కట్టింది! కొందరు వారిని ముగ్గురిని సందర్శించాలన్న తహతహలతో రాజవీధులలోను, మేడల అంతస్తులమీద బారులుదీర్చి నిలుచున్నారు.

అంతకు మునుపెన్నడు త్రిజటుడు మహారాజభవనంలో అడుగు పెట్టలేదు. ఆ భవంతిలో నాలుగు ద్వారాలు దాటిపోతేగాని శ్రీరాముని సందర్శనం సాధ్యపడదు. అయితే తేజస్వి త్రిజటుని వైపు చూచిన ద్వారపాలకులెవ్వరు అతనికి అడ్డుపడలేదు. పైగా స్వయంగా తామే దారి చూపించారు.

అయిదవ ద్వారానికి కొంచెం సమీపంలో కొందరు పెద్దలతో, పిన్నలతో ఎంతో కలిసికట్టుగా సంభాషిస్తున్న శ్రీరాముడు చెరగని చిరునవ్వుతో సాక్షాత్కరించాడు!

మరునిముషంలోనే త్రిజటుని రెప్పపాటు నిలిచిపోయింది! కళ్ళప్పగించి చూస్తూ అలాగే నిలుచుండిపోయాడు! మరికొన్ని క్షణాలలోనే దాశరథి ఆతనిని సమీపించాడు. త్రిజటుడు పట్టలేని ఆశ్చర్యంతో క్షణకాలం స్తంభించి చిరుగుల ఉత్తరీయంతో తిరిగి శరీరం అంతా సమాచ్ఛాదించుకున్నాడు. దాశరథి మధురస్వరంతో ప్రశ్నించాడు.

"త్రిజటస్వాధ్యాయి అంటే తామేకదా! మిమ్మల్ని గురించి నేనింతకుమునుపు చాలా చాలా విన్నాను."

అంతటి మహారాజే తనతో అంతటి ఆదరంతో ప్రసంగించగానే త్రిజటుని శరీరం నిలువునా జలదరించింది. కళ్ళనుమ్మట నీళ్ళపర్యంతం అయింది. గొంతు తడబడింది. ఎంతో అణకువతో శిరస్సుమీద దోసిలికట్టి విన్నవించాడు.

"స్వామీ, నేను బహుకుటుంబిని. నిరుపేదను! వేదం చదువుకున్నాను. ఉంఛవృత్తితో, అతికష్టంమీద నా మనుగడ కొనసాగించు—"

"నేనంతా విన్నాను. మీ కుటుంబం సంగతి కూడా కొంత నేనెరుగుదును! మీరింక చెప్పక్కర లేదు!"

అతని దీనపరిస్థితి గమనించిన దాశరథి కళ్ళు చెమ్మగిల్లాయి. మాట రవంత తడబడింది.

"మీరు కొంత ముందుగా ఇక్కడికి వచ్చి ఉంటే ఎంతయినా బాగుండేది! నేనిప్పుడు అరణ్యానికి బయలుదేరబోతున్నాను. అయినా మించిపోయిందేమీలేదు! రండి! నా వెంటరండి!"

శ్రీరాముడు వెంటనే అసని చేతికర్ర అందిపుచ్చుకుని, చెయ్యి పట్టుకుని, నెమ్మది నెమ్మదిగా సరయూనది తీరానికి నడిపించుకుపోయాడు. మార్గమధ్యంలో మరింత ఆదరంతో ప్రశ్నించి, త్రిజటుని కుటుంబ పరిస్థితి అంతా లోతుగా ఆకట్టుకున్నాడు.

అంతలోనే వారుభయులు సరయూ తీరానికి చేరుకున్నారు. శ్రీరాముని పెదవిమీద చిరునవ్వు పూర్తిగా విచ్చుకున్నది. దాశరథి ఆ విధంగా తనతోబాటు సరయూ తీరానికి చేరుకోవడానికేమి కారణమో త్రిజటుని కెంతగా ఆలోచించినా అంతుచిక్కలేదు! మరికొన్ని క్షణాలలోనే ఆ రహస్యం కాస్తా బయట







# ప రి హా స  ప రీ క్ష

పడింది శ్రీరాముడు త్రిజటుని చేతికర్ర తిరిగి అతని కందించాడు

"అదిగో, ఏటికవతలి వైపున కనుచూపు మేరలో పెద్దపెద్ద ఆల మందలు కానవస్తున్నాయి గమనించారా ?"

నవ్వుతూ ప్రశ్నించాడు దాశరథి

"నా కనుచూపు ఇంత వరకు రవంతయినా మందగించలేదు స్వామీ! ఆవుల మందలన్ని స్పష్టంగా కనిపిస్తున్నాయి!"

"అయితే మీ చేతికర్ర యావచ్ఛక్తి వినియోగించి, ఆ ఆల మందలోనికి విసిరివెయ్యాలి మీ కర్ర పడినంత మేరకు, అక్కడ ఉన్న మందలన్ని మీవే! ఆ గోసంపత్తి అంతా నాదే! అదంతా క్షణ కాలంలో మీకు స్వాయత్తమవుతుంది అంతే కాదు! ఆ ధేనువుల పోషణ కవసరమయిన భూములు, పచ్చిక బయళ్లు, గోపాలకులతోబాటు గోశాలలు అన్నీ కూడా మీవే అవుతాయి! అయితే అంతా మీ భుజ శక్తిమీద, అదృష్టంమీద ఆధారపడుతుంది మీ బలిమి అంతా కూడ దీసుకుని కర్ర విసిరి వెయ్యండి!"

శ్రీరామ సందర్శనమే సాధించుకున్నా, ఇన్నేళ్లు పైబడినా ఇంకా నాకీ పరీక్ష ఏమిటో! నేనీ చేతి కర్ర ఎంత మేరదాకా విసిరి వెయగలనో! అసలిది ఏటికి అవ్వలికయినా వెడుతుందో! వెళ్లదో! అంతా ఆ వేదమాతృదేవత దయ!

ఉసూరుమని నిట్టూర్చాడు త్రిజటుడు కాని పైకి మాత్రం గుండె నిబ్బరమే వ్యక్తీకరించాడు

"స్వామీ! నాకప్పుడే షష్టిపూర్తి సమీపిస్తున్నది అయినా శరీరంలో జవసత్త్వాలే మాత్రం సడల లేదు! ఆ వేద మాతృదేవత అనుగ్రహ కటాక్షం రవంత నామీద ప్రసరిస్తే, ఎంతటి దుష్కరకృత్యమయినా క్షణంలో నిర్వర్తించగలను!"

మరు నిమషంలోనే త్రిజటుడు ఆ చేతికర్ర గట్టిగా అదిమి పట్టుకుని, తన యావచ్ఛక్తి వినియోగించి గిరగిర తిప్పి ఆ ఆవుల మందల మధ్యలో ఒక కోడెద్దు కాలిదగ్గరికి విసిరివేశాడు ఆ కర్ర అంత మేరకు దూసుకు పోగలదని త్రిజటుడు

గాని, దాశరథి గాని ఊహించి ఉండలేదు! శ్రీరాముడు అదే మాట త్రిజటునితో అన్నాడు "నేను కూడా అంతటి మేర వరకు విసిరి వెయ్యగలనని అనుకోలేను మహారాజా! అంతా ఆ చల్లని తల్లి అపార కృప! అంతే!"

అంతలోనే దాశరథి అతనిని గాటంగా గుండె కదుముకుని వేడుకున్నాడు

"ఈవేళ నా వల్ల పెద్ద అపచారం జరిగి పోయింది! నన్ను మీరు మనసారా మన్నించక తప్పదు!"

"ఎందుకని ? దీనిలో మీ అపచారమేమో నాకే మాత్రము అవగాహన కావడం లేదే!"

నిలువునా నిస్త్రపోయి నిలుచున్నాడు

## పొగవలన వృద్ధాప్యం!

విపరీతంగా పొగ తాగేవారికి వృద్ధాప్యం చిన్నతనంలోనే రాగలదని జపాను డాక్టర్లు హెచ్చరిస్తున్నారు వృద్ధాప్యం సంక్రమించటంలో పొగ తాగటానికి, మెదడులో ఏర్పడగల మార్పులకుగల సంబంధాలను పరిశీలించటానికి ఒక సర్వేచేశారు ఈ సర్వేలో మొత్తం 111 మంది పాల్గొన్నారు వీరి వయసులు 20 నుండి 80 వరకు ఉన్నాయి వీరి సగటు వయసు 56 మెదడులో రక్త ప్రసరణ తగ్గటం వలన వృద్ధాప్యం సంక్రమిస్తుంది పొగ తాగనివారి కంటే పొగ తాగేవారిలో రక్త ప్రసరణ తక్కువగా ఉన్నట్లు ఈ పరిశోధనల్లో తేలింది ఎక్కువగా పొగ తాగేవారిలో కొలెస్టరాల్ ఎక్కువగా ఉంటున్నది పైగా, రక్తనాళాలు గట్టిపడటాన్ని నిరోధించగల ప్రొటీన్లు సైతం తక్కువగా ఉంటున్నాయి రక్తప్రసరణ తగ్గటం వలన తెలివితేటలు తగ్గటం, వృద్ధాప్యం మీదపడటం జరుగుతుందని డాక్టర్లు తెలియచేశారు

త్రిజటుడు శ్రీరాముడు అంతలోనే అతని జిజ్ఞాస తొలగించాడు

"మీరీ చేతికర్ర విసిరినా, విసరకపోయినా, మొట్టమొదట నా గో సంపద అంతా మీకే సమర్పిద్దామని సంకల్పించుకున్నాను తీరా సరయూ తీరానికి వచ్చిన తరవాత మీ శరీర పటవ మెంతటితో పరీక్షిద్దామన్న కుతూహలం కలిగింది ఆపైన కేవలం పరిహాసం కోసమే మీకీ పరీక్ష ఏర్పరిచి, చాలా శ్రమ కలిగించాను మన్నించవలసిందని తిరిగి తిరిగి వేడుకుంటున్నాను నాగోసంపత్తి మాత్రమే కాదు ఇంకా మీరేమి కోరుకున్నా అన్నీ మీ కర్పించగలను సెలవియ్యండి!"

మరింతగాఆశ్చర్యపోయాడు త్రిజటస్వాధ్యాయి

"స్వామీ! మీరు అపార కృపాసాగరులని నేనింతకు మునుపాలకించాను ప్రత్యక్షంగా దానికీవేళ తార్కాణం గోచరింది! పట్టలేని ఆనందంతో పరవశించిపోతున్నా నీ వేళ! నా కింకా ఏమీ అక్కరలేదు! అయితే ఇంతటి అమృతమూర్తులు మీరు జానకీదేవితో, తమ్ముడు లక్ష్మణస్వామితో కలిసి అరణ్య నివాసానికి తరలిపోతున్నారని విని విపరీత వేదనతో ఆరాటపడుతున్నాను"

ఆ ప్రసంగం విన్న దాశరథి పెదవిమీద దరహాసితం మనోహరమయి వికసించింది అంతే! అంతలోనే త్రిజటుడు రెండు చేతులు పైకెత్తి దాశరథి నాశీర్వదించాడు

"అయినా, వేదమాత ఆ పరమేశ్వరి కేవలము పరిహాసం కోసమే మీకీ అరణ్య నివాస పరీక్ష ఏర్పరించిందేమో! ఎవరు చెప్పగలరు ? ఏది ఏమయినా ఆ కృపామయి మీ కెల్లప్పుడు శుభ పరంపర అనుగ్రహించుగాక!"

ఆపైన, అనేక విధాల బతిమాలుకుని ప్రాధేయపడి తననా విధంగా శ్రీరాముని సందర్శనానికి పంపించిన అపర్ణకా శుభవార్త అందించాలన్న ఆత్రతతో త్రిజటుడు దోసిలికట్టి శ్రీరాముని వీడ్కొన్నాడు పరుగువంటి నడకతో తొందర తొందరగా తన కుటీరానికి సాగిపోయాడు అంతకు మునుపే ఆ నోట ఆ నోట ఆ శుభ వర్తమానం విన్న ఆ ఇళ్లాలు ఆతనిని ఆనందపారవశ్యంతో అభినందించింది! ★

## తల్లిపాలలాంటిది మరొకటి లేదిక...2





# నీరు వేడిచెయ్యవలసిన అవసరం లేదు, సీసాని మరగబెట్టవలసిన శ్రమ లేదు, వేడిగా చల్లగా ఉందేమోననే బాదరబందీ లేదు!

ప్రకృతి యుగయుగాల నుంచి సహజమైన స్వాభావికమైన తీరులో అప్పుడే పుట్టిన పాప యొక్క పోషణ నెలా చేస్తూ పోతోందో మరి!

ప్రకృతి, వేలకి వేల, లక్షల ఏళ్ళబట్టీ ప్రయోగాల వెంట ప్రయోగాలు చేస్తూ చేస్తూ చివరికి శరీర నిర్మాణంకోసం ప్రోటీన్లు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లూ కొవ్వు పదార్థాలూ ఆరోగ్యాన్ని కాపాడే విటమినూ వీటి యొక్క సరియైన సంతులిత మైన దాన్ని తయారుచేసింది అందుకే తల్లిపాలు పాపకొక ఆదర్శ ఆహారం అయింది

### కలుషితం అయ్యే ప్రమాదం లేదు

మీ పాప స్తన్యపానం చేసినప్పుడు అవి ఏ రకం గానూ కలుషితం అయ్యే ప్రమాదమిక ఉండదు, ఎందుకంటే దాన్లో కలుషిత మవడం గాని, సీసాని శుభ్రం చేయవలసి రావడంగాని ఉష్ణోగ్రతని చూడవలసి రావడం గాని చేసే ప్రశ్నే లేదు గనక ఇక తల్లి పాలంటారా అవి అమృత తుల్యమైనవి!

అంతేగాకుండా ప్రకృతి దాన్లో "రోగ నిరోధక ద్రవ్యాలను" గూడా ప్రసాదించింది, దాంతో మీ పాప ఆమాశయం, పేగుల్లోని వ్యాధులు, యితర వ్యాధుల నుంచి రక్షణ కలుగుతుంది మరి తల్లి పాలలో యింకా ఎన్నెన్నో ఉన్నాయి—స్కర్వీ వ్యాధిని నిరోధించే విటమిన్ సీ ఉంది

### ప్రపంచమంతా ప్రచలితం

ఇప్పుడు రోజుకి రోజూ ప్రపంచమంతటా ఎక్కువ మంది తల్లులు అంటే పశ్చిమ దేశాల్లో సహితం తల్లులు తమ పాలే యివ్వడం మొదలెట్టారు ఎందుకంటే, తల్లి పాలలోని పోషణ తత్వాల మహత్తర లక్షణాల్ని మళ్ళా వాళ్ళు అవగాహన చేసుకోవడం మొదలెట్టారు

### తప్పక పోతే

మరి మీరే గనక యిక ఏ కారణం వల్లనైనా తప్పకపోతే మీ పాపకు మీ పాలు యివ్వలేకపోతే—అంటే మీ ఆరోగ్యం సరిగా లేకనో లేదా మీలో, సరిపడినన్ని పాలు పడకో, అలా జరిగి నప్పుడేం చెయ్యాలి మరి?

అటువంటి సందర్భంలో మీరు ఎంతో జాగ్రత్తగా ఉండవలసి వస్తుంది, ఎంతో ఆలోచించిన మీదట, ఎటువంటి ఎటువంటి ఆహారం యివ్వాలంటే, ఆ యిచ్చేది తల్లి పాల తర్వాత అన్నింటికన్న ఉత్తమ మైనదిగా ఎంచుకునేదాన్ని

### స్ప్రే డయిడ్ అమూల్‌స్ప్రే

అమూల్‌స్ప్రే పుష్టినిచ్చే దృష్టిలో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు దాంతోపాటే తేలికగా అరగలిగే కార్బోహైడ్రేట్లు సరియైన సంతులిత రూపంలో అత్యావశ్యకమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలూ ఉన్నాయి ఇది అంతకుముందే మరగ బెట్టిన నీటిలో టక్కున కరిగి పోతుంది మొదటిగానే పేస్ట్‌లా తయారుచేయవలసిన అవసరం ఉండదు

### పొదుపు

అమూల్‌స్ప్రే దబ్బాలలో దొరికే శిశు ఆహారాలన్నిటికన్న పొదుపైనది ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన—దీనిలోని సభ్యులు "శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు

### జాగ్రత్త పడటం

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ సీసానీ ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి పాప ఆహారాన్ని తయారుచేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి పాప సరియైన పోషణకోసం దబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమె ఖచ్చితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి

ఉచితం! అమూల్ బేబీ పుస్తకంలో ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి అవి గర్భధారణ ప్రసవానికి ముందర గా గర్భ ప్రసవము తల్లిపాలు ఇతర ఆహారములు మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దినచర్య పిల్లవాని అభివృద్ధి చిహ్నాలను అరికట్టుట, ప్రథమ చికిత్స, సాధారణ రోగములు అప్పుడప్పుడు వచ్చేవి పిల్లవాని సంరక్షణ జ్ఞాపకముంచుకోవలసిన విషయములు ఈ పుస్తకం తెలుగు ఇంగ్లీషు, హిందీ తమిళం, మలయాళం, మరాఠీ గుజరాతీ, బెంగాలీ భాషల్లో దొరుకుతుంది దానికోసం బాక్స్ 10124 బొంబాయి 400001 అడ్రసుకు మీ పేరూ పూర్తి అడ్రసు యిస్తూ రూ. 1.25 స్టాంపుల్ని జతపర్చండి

అమూల్‌స్ప్రే తయారుచేసే వారి తరపున, మీ పాప ఆరోగ్యం కోసం సద్భావంతో యిస్తూన్న సందేశం యిది.

**అమూల్‌స్ప్రే**

భారతదేశపు ప్రముఖ సహకార పాల సంఘం వారి ఉత్పాదన.



అమ్మకం చేయించువారు
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్ పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్



ASP/AS-2/83

# కొత్తగొంతులు

టి.యల్. కాంతారావు

''ఇది తలంపులే కనుమోడ్చిన
తంద్రాలస నిశీధి
ఇది జగతీ నిర్వికల్ప నిశ్శబ్ద మహాసమాధి
ఖగోళాన వెలిగించిన కాంతి కాగడాలు లేవు
శూన్య నభోంతరాలలో చుక్కల
ప్రేక్షకులు లేరు —
మానవ మేధోంతర విజ్ఞానదీప మారిపోయె
కళలన్నీ కరిగిపోయి చరిత్రయే మాసిపోయె
ఇకలేదు ఉషః ప్రసక్తి ఇది అనంత
చరమ రాత్రి
తెరజారిన నాటక రంగస్థలమీ స్తబ్దధాత్రి''
— మహాస్వప్న

అగ్నిశిఖలు మంచుజడులు కమ్మిశెట్టి వేంకటేశ్వరరావుగారి మొదటి కావ్యం దిగంబర కవిత పుట్టుకతో వేంకటేశ్వరరావుగారు మహాస్వప్నగా కవితా ప్రపంచంలో స్థిరపడ్డారు కవిత్వ సంప్రదాయాలను, కవి సమయాలను ఒంట పట్టించుకున్న కవి మహాస్వప్న మాత్రాచ్ఛందాని, వచన కవితను సమర్థవంతంగా నడిపించగలిగిన శిల్ప చమత్కృతి మహాస్వప్న కున్నది అన్నుప్రాసల్ని, అంత్య ప్రాసల్ని కవితాంతర్భాగంగా ఉపయోగించగలిగిన నేర్పు కూర్పు మహాస్వప్న ప్రత్యేకత ఆడంబరం లేని, అర్థస్ఫోరక శబ్ద శక్తి మహాస్వప్నది

కవిత్వంలో మహాస్వప్న ఒక ఇజానికి కట్టుబడిన కవి కాదు విశాల పరిధిలో మానవతే అతని నిబద్ధత అగ్నిశిఖలు మంచుజడులు కావ్యంలో ఏ ఇజమూ ధ్వనించలేదు కావ్యం మొత్తాన్ని ఇరవయ్యో శతాబ్దపు మానవ దుఃఖ మేఘం కమ్మేసింది నిరాశ, వేదన, దుఃఖం, వైఫల్యం మొదలైన లక్షణాలు ఈ కావ్యంలో ప్రతి అక్షరంలోనూ ప్రతిధ్వనిస్తున్నాయి అగ్నిశిఖలు, మంచుజడులలోని పదబంధాలు చాలా భాగం భావకవిసమయాలు 'శుష్క హస్తాలు' శూన్యపాత్రికలు, ప్రభాతాంగణము, అంధతమో నిశీధి, ఫెళఫెళార్భటులు, మరణ వాద్యాలు మొదలైనవి భావకవిత్వ యుగంలో వినిపించిన మాటలు

నవగీతం ఖండిక మహాస్వప్న కవిత్వ పరమార్థానికి గమ్యం జీవితంలో వైఫల్యం పొందిన ప్రతి ఒక్కడికోసం అగ్నిశిఖలు మంచుజడులలో అశ్రుగీతం ఆలపించాడు మహాస్వప్న వికసించవలసిన విరులు రాలిపోతున్నందుకు, పరుగులు పెట్టవలసిన సెలఏర్లు ఇంకిపోతున్నందుకు, నిండుగా జీవించవలసిన బతుకుల నిరాశతో పిపాసతో కళ్ళు వ్రాలి తనువు తూలి పడిపోతున్నందుకు బాధామయ వేదనా గీతికల్ని ఆలపించాడు మహాస్వప్న

''యుగయుగాలుగా మధించిన
మానవ మేధస్సులో ఆవిర్భవించిన
హాలాహలం పీయూషం ఏకమైన వేళ
దానవత్వం రోసి, మానవత్వం మాసి
దైవత్వమందుకోలేక
పైశాచికాకృతివహించెనా నేటిమానవుడు''

అని ఈ శతాబ్దపు నాగరికతను ప్రశ్నిస్తున్నాడు మహాస్వప్నకు మొదటి కావ్యపరిధిలో భవిష్యత్తుమీద ఎట్లాంటి భ్రమలు లేని పూర్తి నిరాశ కనిపించింది సమాజానికి సూర్యోదయం కాదని ఇది దీర్ఘరాత్రి అని, గమ్యం ఎరుగనిదే ఈ ప్రయాణమని గట్టిగా నమ్మినట్టున్నారు ఆయన రాత్రి కవితా సంకలనంలో రహస్యాల్ని ప్రవచిస్తోంది రాత్రి అనే ఖండికలో ఈ సమాజ స్వరూపాన్ని పూర్తిగా ప్రదర్శించి చివరిలో ''ఇక లేదు ఉషః ప్రసక్తి ఇది అనంత చరమరాత్రి, ఇది శ్మశాన శాంతి ఆవహించిన రహస్య రాత్రి'' అంటాడు ఇక్కడ కూడా భవిష్యత్ శూన్యమే కనబడుతోంది దిగంబర కవిగా మార్పు చెందిన పిమ్మట— ఉన్న వ్యవస్థ దానంతటదిగా నశించి పోదు, దానిని అంతమొందించటానికి క్రియాశీలత్వం అవసరం అనే భావం మహాస్వప్నకు కలిగింది దిగంబర కవిత్వ ప్రారంభాన్ని గూర్చి మహాస్వప్న ఉద్దేశం ఇది ''ఒక మహత్తరమైన భావావేశంతో గిరుల్ని, గీతల్ని, అవధుల్ని, ఔన్నత్యాన్ని అధిగమించిన విశ్వజనీన దృక్పథంతో దిక్కుల్ని మోగించాలనుకున్న ఉత్కంఠ దిగంబర కవితోద్యమ ప్రారంభంలో స్పష్టంగా గోచరిస్తుంది'' మహాస్వప్న ఏ ఇజానికి కట్టబడి ఉండకపోవటమంటే ముఖ్యంగా రాజకీయ సిద్ధాంతాలకు అతీతంగా ఉండటం అని అర్థం చేసుకుంటే — అతను దిగంబర కవుల్లో ఒకడవటానికి కారణం తెలుస్తుంది ఆదిలో దిగంబర కవులకు రాజకీయోద్దేశం లేదన్నది ఇప్పటికే స్పష్టమైన విషయం రాజకీయమైన అవగాహన, ఉద్దేశం లేకపోయినా ఈ వ్యవస్థ సమూలంగా మారాలనే తపన మాత్రం అందరికీ సమానమే

''ఆరని దాహపు నాల్కల్లో
భూకంపాల ఆకలి ఆవులింతల్లో
కామాగ్ని పర్వతాలు పగిలి ఎగజిమ్ముతున్న
లావాల్లో
పోటెత్తిన సముద్రాల తరంగాలు
ఉవ్వెత్తున రేగి
చెలియలి కట్టల్ని తెగద్రెంచుకుంటు



న్నప్పుడు
అసంపూర్ణజ్ఞానుల అహంభావ సిద్ధాంతాల
అజ్ఞాన ప్రవాహాల్లో
ప్రమాదాల జలావర్తాల్లో
జనత ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై
పోతున్నప్పుడు
కీర్తికాముకుల, నియంతల, అహంతల
దౌర్జన్యబాహువుల దురాక్రమణలో
దేశదేశాల సుఖవ్యాధి పుండ్లతో
పీడపురుగులు నిండిన మేడిపండ్లలో
భూమి వెలయాలై, పతితయై,
భ్రష్టయై పుచ్చి గబ్బుకొడుతున్నప్పుడు
నేను పుడుతున్నాను దిగంబరకవిని''

అని అనటంలో ఈ శతాబ్దపు జనజీవితం ఏవిధంగా ఉన్నదీ చూడటమేకాక ఈ జీవిత విధానాన్ని, వ్యవస్థా గమనాన్ని మార్చాలనే వాంఛ కూడా అర్థం అవుతోంది

మహాస్వప్న కవిత్వం అగ్నిశిఖలు మంచుజడుల నుంచి దిగంబర కవిత్వానికి ప్రయాణించే టప్పటికి అంతకు ముందులేని వేగాన్ని అందుకుంది షాక్ ట్రీట్‌మెంట్ దిగంబర కవితా లక్షణం కాబట్టి అందుకు అనుగుణమైన శైలి, గమనవేగం వచ్చేశాయి దిగంబర కవిత రెండో సంపుటి నాటికే మహాస్వప్నకు తదితర దిగంబర కవి మిత్రులకు అభిప్రాయభేదాలు రాసాగాయి రాజకీయ ప్రాబల్యం, మార్క్సిజ ప్రభావం మిగిలిన కవులపై పడటంతో ఒక ఇజానికి కట్టుబడని మహాస్వప్నకు భేదాభిప్రాయం కలగటం ఆశ్చర్యకరమైన విషయం కాదు మిగిలిన దిగంబర కవితా సంపుటాలు వెలువడే టప్పటికి మహాస్వప్న వ్యక్తిగత పరిస్థితులు కాని, మనస్థితిగాని ఏది కారణమైనా వారి నుండి విడిపోయాడు మహాస్వప్న మాత్రం జవాబులు రాని ప్రశ్నలతో, సందేహాలతో దరిదాపుగా ఒక దశాబ్దం నుంచీ కవితా రంగానికి దూరంగా ఉండిపోయాడు భవిష్యత్తుపై మహాస్వప్నకు ఆశ ఉన్నది ''నేను ఊహించిన, ఆశించిన కవిత, భవిష్యత్తులో ఏ మహాకవి నిర్మల హృదయం లోంచో జలపాతమై పొంగి మానవతను ఆర్ద్రం చేస్తుందనే విశ్వాసం నాకుంది'' అంటాడు మహాస్వప్న

''మిమ్మల్ని కాపాడుతున్న
ఈ చీకటి రాత్రి కోట బద్దలు
కొడతాను నేను
ఈ నాగరికతకు మానభంగం చేస్తాను నేను
ప్రతి పుట్టను పగలగొట్టి
విష భుజంగాలను పట్టి కోరలు
తీస్తాను నేను
ఈ ఘోరారణ్యంలో కారుచిచ్చు రగిలిస్తా
ఈ నాగరికత రావణ లంకాదహనం చేస్తా
పుడుతున్నా పుడుతున్నా
కడుపు రగిలి పుడమి పగిలి పుడుతున్నా
నవ ప్రపంచ వీధుల్లో నగ్నంగా
వెడుతున్నా''

అన్న మహాస్వప్న అట్లా వెళ్ళిపోవటమేనా? ★

(గత సంచిక తరువాయి)

# అద్దంలో రూపు

ధారావాహిక

టి. ఎస్. ఎ. కృష్ణమూర్తి

ఎంతో ఆలోచించి, వివిధ కోణాలలోంచి నేను చూసి వుండిన వాస్తవ ప్రపంచాన్ని మననం చేసుకుంటూ నాలుగైదు స్కెచ్‌లు తయారుచేశాను ఎగ్జిబిషన్ కోసం

అందమైన ఇంటి ముందు ఆనంద, ఉత్సాహాలతో ఆడుకుంటున్న అప్పుడే విచ్చిన పూవుల లాంటి పిల్లల్నీ, అదే ఇంటి అరుగుమీద వయసు ఉడిగిపోయి కడదోయబడ్డ పండుటాకులాంటి ఓ ముసలి వ్యక్తినీ ఓ స్కెచ్‌లో గీశాను

మానవుడి చేతులలో డబ్బుకోసం నలిగిపోతున్న స్త్రీ తాలూకు చిత్రానికి ఇంకో స్కెచ్

తినుబండారాల దుకాణంకేసి ఆకలి కళ్ళతో ఆశగా చూసే ఎండిపోయిన పువ్వులాంటి కుర్రవాడి చిత్రానికి ఇంకో స్కెచ్

ఇలాంటి స్కెచ్‌లు ఒకదాని తరువాత ఒక్కటి ఎన్ని గీసినా ఒక్కదానికీ పెయింటింగ్ మొదలు పెట్టడానికి నాకు మనస్కరించలేదు ప్రతీదీ 'ఇది పోటీకి పంపడానిక్కి అర్హమైనదా?'అనే అనుమానంలో నన్ను పడవేసినదే నిజానికి ఏదోఒక లోపం అందులో లేకపోతే ఆ అనుమానం రాకూడదు చిత్రకారుడికి

'ప్చ్, కాజాను కలుసుకోగానే చెప్పేయాలి నాలో అంత స్టాండర్డు లేదని!'' అనుకునేశాను చివరికి ఆనాడు పోటీకి చిత్రాన్ని పంపవలసిన ఆఖరి తేదీ అట్టే దూరంలో లేదు కూడా

* * *

అయితే అదేరోజు సాయంకాలం ఓ సంఘటన జరిగింది

సన్నగానూ భారీగానూ కాకుండా మధ్యరకంగా పడుతోన్న వర్షాన్ని చూస్తూ వరండాలో కూర్చుని వున్నాను అలాంటి వర్షం పడే సాయంకాలాలంటే నాకు చాల ఇష్టం

గొడుగైనా లేకుండా వర్షంలో తడుస్తూనే బ్రాజాపాండా అనే ఓ ఒరియా మిత్రుడు వచ్చాడు నా ఇంటికి ఆ సమయంలో ఆయన రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా ఉద్యోగి

గత స్మృతులను నెమరువేసుకుంటూ, మనసులో తారట్లాడుతున్న విషాద రేఖలవల్ల పరధ్యానంగా కూర్చుని వుండిన నేను గబగబా లేచి ఆయన్ని ఇంట్లోకి తీసుకువెళ్ళి తల తుడచుకోవడానికి ఓ టవలు ఇచ్చి ''ఏమిటి వర్షంలో తడుస్తూనే వచ్చేశారు రెయిన్‌కోటయినా, గొడుగైనా వేసుకోకుండా!'' అన్నాను భోలానాథ్ మహారాణా ఫ్లాస్కులో పోసి ఉంచి వెళ్ళిన వేడి టీని రెండు కప్పులలో పోస్తూ

బ్రాజాపాండా తలతుడుచుకునే ప్రయత్నమైనా చేయకుండా నిరుత్సాహంగా తల విదిలించి అన్నాడు ఒరియాలో ఆయన మాటల సారాంశం ఇది ''ఏమి జీవితాలో రాజా, మానవ జీవితాలు?! మరీ క్షణికములైన ఈ జీవితాలకు ఇన్ని జాగ్రత్తలు ఎందుకో?''

ఆయన అంత నీరసంగా, నిరుత్సాహంగా ఎప్పుడూ కన్పించలేదు నాకు అందువలన ఆశ్చర్యపోతూ ''ఎనీథింగ్ హాపెండ్?'' అని ప్రశ్నించాను



ఆగ్రాలో కామేష్ ఇంద్రజాలమా ?

ఆయన ఒరియాలో వేదాంత ధోరణిలో బాధగా చెప్పుకుపోయాడు.

"ఏమిటి రాజా ఈ ప్రపంచం ? ప్రపంచంలో పరస్పర వైషమ్యాలూ, ద్వేషాలూ, పగలూ తప్ప మరోటి కన్పించడం లేదు. ఎక్కడ చూసినా కుళ్ళు, కుతంత్రాలు. చిన్న చిన్న విషయాలకు సైతం పోట్లాటలూ, యుద్ధాలూ, హత్యలూ సహజం అయిపోతున్నాయి. అసలు మనుషుల మధ్య ప్రేమానురాగాలూ, స్నేహ భావాలూ నశించి పోతున్నాయి, రోజు రోజుకీ! స్వల్ప విషయాలకు సైతం మనుషులు ఒకర్ని ఒకరు కుళ్ళబొడుచుకునే స్థితికి దిగజారిపోతున్నారు. మానవ వ్యవస్థే దిగజారిపోతోంది. నైతిక విలువలు నశించి పోతున్నాయి."

"ఏమిటి జరిగింది ? ఎందుకింత డిస్పరేట్ అయిపోతున్నారు ?" అని చాల క్యూరియస్‌గా అడిగాను. ఆయన చెప్పిన విషయాలు విన్నాక నా మనసు కూడా కల్లోలానికి, సంఘర్షణకూ గురయింది.

ప్రాజాపాండా ఉన్న వీధిలోనే ఓ చివర్నవున్న ఇరుగు పొరుగు వాళ్ళయిన రెండు కుటుంబాల మధ్య ఏవో కలతలు వచ్చాయట. చాల చిన్న కలతలు ... అసలు పట్టించుకోవాల్సిన అవసరం లేనివి. అవి మొదట ఆడవాళ్ళ మధ్య ప్రారంభం అయి చిలికి చిలికి గాలివానలా తయారయి మగవాళ్ళ వరకూ వెళ్ళాయట. ఆ రోజు మధ్యాహ్నం అందరూ భోజనాలు ముగించి లేచే సమయాన ఒక ఇంటిలోని యువకుడు కాలేజీలోని తన మిత్రులను కొంతమందిని తీసుకువచ్చి అందరితో కలిసి ఎదురింటిలోని ఓ యువకుడ్ని చావబాదాడట. చితు చితుగా చావుదెబ్బలు తింటున్న ఆ యువకుడి అన్నయ్య ఆ సమయానికి ఇంటికి వచ్చి పదిమంది మధ్య నలిగిపోతున్న తన తమ్ముడ్నిచూసి ఉద్రేకంతో ఇంటిలోకి వెళ్ళి ఓ కొడవలి తీసుకువచ్చి ఇద్దరి



## అడ్డదారులు

తలలు పూర్తిగా తెగిపోయేలా, మరొకడి తల సగం తెగేలా నరికేశాడట.

తలలు తెగిన వాళ్ళిద్దరూ భయంకరంగా రోడ్డంతా గంతులేసీ, క్రిందపడి దొర్లి ప్రాణాలు వదిలేశారట. సగం తల తెగిన వ్యక్తి హాస్పిటల్‌లో కొన ఊపిరితో వున్నాడట. నరికిన వ్యక్తి పోలీసు స్టేషనుకు వెళ్ళి సరండర్ అయిపోయాడట.

హంతకుడుగా మారిన ఆ వ్యక్తికి భార్యా, పిల్లలూ ఉండడమే కాదు. ఆ కుటుంబం మొత్తం అతనిమీదే ఆధారపడి వుందట. హతులలో ఒకడు ఓ ధనవంతునికి లేకలేక పుట్టిన సంతానం. రెండవ వాడు ముసలివాళ్ళూ, నిరుపేదలూ అయిన ఓ దంపతులకు ఆశాకిరణం. కొనవూపిరితో వున్నవాడు క్రొత్తగా పెళ్ళిచేసుకుని ఓ స్త్రీ జీవితాన్ని పంచుకున్న వ్యక్తి.

ప్రాజాపాండా ఆ భయంకర సంఘటనను గూర్చి విపులంగా చెప్పిన తరువాత కొంతసేపు పతనమైపోతున్న సమాజపు విలువలను గూర్చి బాధపడి వెళ్ళిపోయాడు వర్షంలో తడుచుకుంటూనే.

ప్రాజాపాండా వెళ్ళిపోయిన తరువాత కూడా నా కళ్ళముందు అతను చెప్పిన సంఘటనలే మెదల సాగాయి. ఆలోచనలో నిమగ్నమైపోతూ కూర్చున్న నా మనో ఫలకంమీద ఎన్నో దృశ్యాలు కదలిపోసాగాయి.

అన్నలను చంపిన తమ్ముళ్ళు, తమ్ముళ్ళను చంపిన అన్నలు, మిత్రులను చంపినవాళ్ళు, ఒంటరిగా దొరికిన ఆడవాళ్ళను అమానుషంగా రేప్‌చేసి చంపిన దుర్మార్గులూ, నగలకోసం, డబ్బుకోసం, చివరికి పదిరూపాయల కోసం కూడా హత్యలకు పాల్పడిన వాళ్ళూ, ఆస్తికోసం పసికందుల్ని చంపినవాళ్ళూ, కామంతో కళ్ళు మూసుకుపోయి కట్టుకున్న భర్తలనూ, కన్న బిడ్డలనూ చంపుకున్నవాళ్ళూ... ఇలా ఎందరో నా మనోఫలకంమీద కదిలిపోయారు.

ఆలోచనలు లేకుండా ఆవేశాలలో, ద్వేషంలో హత్యలు చేయడం ఎన్ని అనర్థాలకు దారితీస్తుందో, ఒక హత్య ఎన్ని జీవితాలు నాశనం అవడానికి దోహదం చేస్తుందో హత్యచేసే క్షణాలలోనూ, అంతకు ముందు ఆవేశంలోనూ హంతకుడి లేక హంతకుల బుర్రలకు ఏమాత్రమూ తట్టవు. హత్యానంతరము హంతకునిలో తప్పక కలిగే పశ్చాత్తాపము వలన ఎవరికీ యే ప్రయోజనమూ వుండదు.

ఆ రోజు భోలానాథ్ మహారాణా ఏదో పని వుందని చెప్పి వెళ్ళిపోయాడు సాయంకాలమే. అందువలన డైనింగ్ టేబిల్‌మీద, అతను అమర్చి వెళ్ళిన పాత్రలలోంచి నేనే వడ్డించుకుని అన్యమనస్కంగా భోజనం అయిందనిపించి లేచేశాను. ఫ్లాస్కులో మిగిలివున్న వేడి టీకప్పు త్రాగి ఓ సిగరెట్ వెలిగించుకుని నేను చిత్రాలు గీసుకునే గదిలోకి వెళ్ళాను.

పది నిముషాల తరువాత ఓ క్రొత్త చిత్రానికి స్కెచ్ గీయసాగాను. స్కెచ్ పూర్తయేసరికే రాత్రి పన్నెండు గంటలు దాటింది.

స్కెచ్‌లో మూడు భాగాలు ఏర్పడ్డాయి. చిత్రానికి ఎడంచేతి వైపు క్రింద భాగం కార్నర్‌లో ఓ చిన్న దృశ్యం... అందులో ఇద్దరు మనుషులు ఎదురెదురుగా నడుచుకుంటూ వెళ్తున్నారు ఓ రాచమార్గాన. అది మొదటి దృశ్యం చిత్రంలో.

ఆ దృశ్యానికి కాస్త పైగా ఇంకో చిన్న దృశ్యం... అయితే అది మొదటి దృశ్యం కన్నా కాస్త పెద్దది. అందులో ఎదురుపడ్డ ఆ ఇద్దరు వ్యక్తులూ ఏ కారణంచేతో భయంకరంగా పోట్లాడు కుంటున్నారు కత్తులు చేతపుచ్చుకుని. ఇది రెండవ దృశ్యం చిత్రంలో.

మూడవ దృశ్యం చిత్రమంతా ఆక్రమించుకున్నది ఆ రెండు దృశ్యాలనూ కూడా కవర్ చేస్తూ చుట్టుకుని. ఆ దృశ్యంలో పోరాడిన ఇద్దరు వ్యక్తులూ రాజమార్గానికి చెరో ప్రక్కన పడిపోయి భయంకరంగా మరణించి వున్నారు. మొదటి వ్యక్తి వివాహితుడు అయివుండాలి... అతని శవం ప్రక్కన మంగళసూత్రాలు ధరించి, పెద్ద పెద్ద కళ్ళు కలిగియున్న ఓ యువతి ఒడిలో పసికందును ఉంచుకుని విలపిస్తోంది. రెండవ వ్యక్తి ప్రక్కన ఇద్దరు శతవృద్ధులు... అతని తల్లిదండ్రులు కాలోలు విలపిస్తున్నారు.

### అన్వేషణ

ఒక్క సారైనా పూలగాలి
ఒళ్ళంతా నిమరకపోతే—

ఒక్క మారైనా మనసు
వేదనలో కమలక పోతే—

ఒట్టి జీవితం ఏం చేసుకోనూ ?
అందుకే—

అడవిలోకైనా సరే పోవాలనుంది
అనుభూతుల దారుల నన్వేషిస్తూ—

- ఆదూరి సత్యవతీదేవి

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.

Colgate DENTAL CREAM

Colgate

STOPS B

కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది..
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది

**ఎలాగో చూడండి:**


మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి


కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది


ఫలితం ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి దంతక్షయాన్ని ఎదుర్కోండి

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK&E B82 86 TL

స్కెచ్ పూర్తవగానే నాకు చాల సంతృప్తి కలిగింది ముఖమంతా పట్టిన చెమట బిందువులను తుడుచుకుని, చేతి గడియారం చూసి నవ్వుకున్నాను

ఆ తరువాత మిగిలిన రాత్రికూడా నేను సరిగ్గా నిద్రపోలేదు ఆ స్కెచ్‌ను ఎలాంటి రంగులతో నింపాల్సిందీ, ఎక్కడ ఏ రంగు ఎలా వేసి చిత్రానికి ఎలా జీవం పోయాల్సిందీ ఆలోచిస్తూ చాల ఎక్సయిటెడ్‌గా గడిపాను ఆలోచనలతో అర్ధ నిద్రతోనే తెల్లవారింది

ఎక్సయిట్‌మెంటును అణచుకోలేక కంపెనీకి శెలవు పెట్టేసి మూడు రోజులపాటు శ్రమపడి ఆ చిత్రాన్ని పూర్తిచేశాను చిత్రం పూర్తయే వరకూ నన్నావహించిన భావోద్రేకం, ఏమాత్రమూ తగ్గలేదు, నిద్ర, ఆకలి మొదలైనవి పూర్తిగా మరచిపోయానని చెప్పవచ్చు

చిత్రం అనుకున్నదానికన్నా చాల అద్భుతంగానే తయారయింది అది చిత్రం కాదు సజీవ రూపకల్పన అని నాకే అన్పించింది రంగులు చాల చక్కగా కుదరడంవల్ల సహజత్వం ఉట్టిపడింది

చిత్రంలో చనిపోయిన ఇద్దరూ రక్తపు మడుగులలో భయంకరంగా, ఘోరంగా దయనీయమైన విధంగా పడివున్నారు ఒక శవం ప్రక్కనున్న ముసలివాళ్ళ గాజు కళ్ళలో విపరీతమైన చిత్తక్షోభ, దుఃఖం సుస్పష్టంగా కన్పింపచేయగలిగాను ఆ ముసలివాళ్ళ కళ్ళలోని భావమూ, ఎండిపోయిన వారి గాజు కళ్ళలోంచీ జాలువారుతున్న కన్నీటి చుక్కలూ చిత్రకారుడనైన నా కళ్ళలోనే కన్నీరు తిరిగేలా చేశాయి చిత్రం పూర్తయిన మరుక్షణం లోనే !

మరో శవం ప్రక్కనున్న యువతి చాల అందంగా, లేతగా వుంది చిత్రంలో ఆమె ఒడిలోని పసికందూ, ఆమె మెడలో ధగధగా మెరుస్తున్న మంగళసూత్రాలూ, ఆమె కళ్ళలోని దుఃఖంతో కూడిన భయభ్రాంతులూ, విరక్తి ఎంతటి హృదయం లేని కఠినాత్ముడినైనా కరిగించేలా వున్నాయి

చిత్రానికి 'అకారణ క్రోధో వైవస్యతో రాజా!' అనే పేరు పెట్టాను సంస్కృతంలో ఆ అక్షరాలను ఛర్మైన్ రంగుతో చిత్రం క్రింద భాగంలో పెయింట్ చేసి చిత్రాన్ని పూర్తిగా ముగించాను 'అకారణమైన క్రోధమన్నది యమధర్మరాజు వంటిది' అని ఆ పేరు భావం

# అడ్డదారులు

బ్రాజాపాండా ఇంటికి వెళ్ళి అతన్ని నా స్కూటర్ మీద తీసుకు వచ్చి ఆ చిత్రాన్ని మొట్ట మొదట అతనికే చూపించాను

చిత్రాన్ని చూసిన తరువాత ఐదునిముషాల పాటు ఏమీ మాట్లాడలేక పోయాడు అతను చివరికి అతని కళ్ళ నుండీ రెండు అశ్రుకణాలు జాలువారాయి

"రాజాజీ ! మీరు చాల గొప్ప కళాకారులు, మీరు చాల గొప్ప కళాకారులు !!" అన్న మాటలు వెలువడ్డాయి ఆయన నోటిగుండా ఒరియా భాషలో

ఆ క్షణాలలోనే ఆ చిత్రాన్ని పోటీకి పంపాలని స్థిరంగా నిశ్చయించుకునేశాను బ్రాజాపాండా వెళ్ళి పోయాక కాజాకు ఫోన్ చేశాను

ఒక గంటలోపే మోటరుసైకిల్ మీద వచ్చేశాడు కాజా నా చిత్రాన్ని చూడగానే ఆనందం పట్టలేక నన్ను కౌగలించుకునేశాడు

విషయం తెలియగానే మా అసోషియేషన్ సభ్యులందరూ ఆ సాయంకాలమే మా ఇంటికి వచ్చి చిత్రాన్ని చూసి నన్ను అప్రిషియేట్ చేశారు మొత్తానికి నేను అనుకున్న దానికన్నా ఎక్కువ ఆకర్షించింది ఆ చిత్రం అందరినీ

మా అసోషియేషన్ తరఫున ఆ చిత్రాన్ని పోటీకి పంపే ఏర్పాట్లు జరిగాయి నేను శెలవు పెట్టగల పరిస్థితులు లేకపోవడం వల్ల చిత్రాన్ని తీసుకుని ఇద్దరు అసోషియేషన్ సభ్యులు స్వయంగా హైదరాబాదుకు బయల్దేరి వెళ్ళారు కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లో

కంపెనీలో కొన్ని అత్యవసరమైన పనులు వుండి పోవడం వల్ల నేను చిత్ర ప్రదర్శనకు కూడా వెళ్ళ లేకపోయాను

* * *

చిత్రాన్ని గూర్చి పదేపదే చెప్పి పాఠకుల్ని విసిగించడం భావ్యంకాదని తెలుసు అందుకే రెండే వాక్యాలు వ్రాస్తాను

ప్రదర్శనలో ద్వితీయ బహుమతి పొందింది నా చిత్రం 'అకారణ క్రోధో వైవస్వతో రాజా !'

చిత్రకారుడుగా మంచి పేరు వచ్చింది నాకు నా ఫోటో, నా వివరాలూ అనేక పత్రికలలో ప్రచురింప బడ్డాయి

నిజానికి నా ఈ విజయం వెనుకనున్న నా మిత్రుల ప్రోత్సాహాన్ని నేను మరచిపోలేను ఎట్టి పరిస్థితులలోనూ అలాగే బ్రాజాపాండా ఆవేదనను కూడా!

* * *

మైడియర్ రాజా !

రాధ పెళ్ళి గుర్తు వుందా ?

ఎంతో బాధతో నిరుత్సాహంతో విజయవాడకు వెళ్ళిపోతూ అనాడు "మంచి పొజిషన్‌లో వుంటే తప్ప వీరి మధ్యకు రాను !" అన్నావు గుర్తుందా?

ఇప్పుడు నీవు మంచి పొజిషన్‌లో ఉన్నావు ! నీవు వీరి మధ్యకు రావాల్సిన అవసరమూ అవకాశమూ వస్తోంది

వచ్చేనెల ఆరవ తేదీన దినేష్‌గాడి పెళ్ళి జరగబోతోంది త్వరలో నీకు ఆహ్వానం అందితీరుతుం దనుకుంటాను తప్పక రా ! నిన్ను చూడాలని నాకు చాల కోరికగా ఉంది

నీవు ఎప్పుడు వచ్చేదీ తెలిపితే కాచుకుంటాను

ఇక్కడ మనవాళ్ళందరూ క్షేమం మా అమ్మగారు నీకు తన ఆశీర్వాదములు తెలుపుతున్నారు

నీ
డేవిడ్

ఈ ఉత్తరం అందిన తరువాత నేను చాల తీవ్రంగా ఆలోచించాల్సివచ్చింది గతాన్ని గూర్చి, భవిష్యత్‌ను గూర్చి

లలితను నేను మరచిపోయాననీ, తనను ప్రేమించడం లేదనీ అనుకోలేను నేను అలా అనుకోవడం ఆత్మవంచన అవుతుంది కూడా ! 'ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్ ది బెస్ట్ ఇంప్రెషన్' అన్నాడు ఒక ఆంగ్ల రచయిత 'ఫస్ట్ లవ్ ఈజ్ ది బెస్ట్ లవ్ ! అన్నారు మరెవరో ఈ రెండూ నా జీవితానికి బాగా అన్వయిస్తాయని చెప్పగలను

అందుకే అంత అవమానం పొంది వచ్చాక కూడా లలితను నా హృదయంలోంచీ తొలగించుకోలేక పోయాను ఒరిస్సాలో నన్ను ప్రేమించడానికి సిద్ధపడి, అందమైన సంస్కారవంతులైన, బాగా చదువుకున్న వాళ్ళెందరో ముందుకు వచ్చారు కానీ నేను వారిలో ఎవర్నీ లలితను చూసిన భావనతో చూడలేకపోయాను ఎటువంటి పరిస్థితులలోనూ

అయితే లలితమీద కోపం లేకపోలేదు నాలో అందుకే తను జ్ఞాపకం వచ్చినప్పుడెల్లా ఆమెను






## ఇవేమన పద్యాలు

అయిదు రూపాయలు ధర్మం కావాలా?
అయిదు నిముషాలాగు - మా అయిదుగురు
గుమస్తాల దగ్గర వసూలు చేసి ఇస్తాను!

బాపు

తనదుసొమ్ము జూడ దానమియ్యగవచ్చు
నవని దొడ్డగాద దెవవిక్తైన
నదురు బెదురులేక నన్యుల సొమ్ముల
దానమియ్యరాదు ధరనువేమ

మరచిపోయి, ఆమె ఆలోచనలు నా మనసులోంచి తొలగించే ప్రయత్నాలు చేస్తూ వచ్చాను మరి తనను గూర్చిన ఆలోచనలు అధికం అయినప్పుడు విస్కీ తప్పతాగి ఒళ్లు తెలియకుండా నిద్రపోయిన రాత్రులు ఎన్నో లెక్కలేనన్ని

'ఐ లవ్ హర్ బట్ ఐ కెనాట్ లివ్ విత్ హర్' అని ఎన్నో సార్లు వ్రాసుకున్నాను నా డైరీలో ఎందుకంటే ఆమెకు గావాల్సింది నేను కాదు నేను సంపాదించుకోగల హోదా, డబ్బు, దర్పం ఇవి అందుకే ఆమెను ఎంతగా ప్రేమించినా ద్వేషించ కుండానూ ఉండలేక పోతున్నాను అయితే ఆమెను ప్రేమించకుండా ఉండలేనన్నది అక్షరాలా నిజం

దినేష్‌గాడి పెళ్ళికి, వారందరి మధ్యకూ ముఖ్యంగా లలిత సాన్నిధ్యంలోనికి వెళ్ళడమా? మానడమా? 'అవుటాఫ్ సైట్ అవుటాఫ్ మైండ్' అన్నట్లు ఇంతకాలం దూరదూరంగా వుండిపోయి ఇప్పుడు మళ్ళీ తన దగ్గరకు వెళ్తే ఏం జరగబో తుందో?

ఇలాంటి ఆలోచనలతో రెండు రోజులు సతమతం అయి చివరికి దినేష్ పెళ్ళికి వెళ్ళాలనే నిశ్చయించుకున్నాను ఆలోగా దినేష్ పెళ్ళి పత్రిక అందింది తప్పక రావల్సిందిగా మరీ మరీ కోరుతూ వాడు వ్రాసిన ఉత్తరంతోపాటు

మరో రెండ్రోజులు గడిచిన తరువాత లలిత వ్రాసిన ఉత్తరం కూడా అందింది నన్ను చూడ కుండా ఇంకా ఎక్కువ కాలం ఉండలేననీ తప్పక దినేష్ పెళ్ళికి రావాల్సిందనీ వ్రాసింది తను ఎందులో

'వస్తున్నాను లలితా నీ సాన్నిధ్యానికి అయితే ఈ ప్రయాణంలో నాలో అద్భుతమైన ఊహాలూ, మధురమైన కోరికలూ ఇంచుక అయినా లేవు' అనుకున్నాను కసిగా, బాధగా

* * *

రెండవ తేదీ రాత్రి పంద్రెండు గంటలకు కోరమాండల్ ఎక్స్‌ప్రెస్ ఎక్కి మూడవ తేదీ మధ్యాహ్నం పంద్రెండు గంటలకు బెజవాడలో దిగేశాను అక్కడి మిత్రులనూ, పరిచయస్థులనూ అందరినీ కలుసుకుని మాట్లాడి ఆ రోజు రాత్రి పదిగంటలకు తిరుమలా ఎక్స్‌ప్రెస్ ఎక్కాను

మరునాడు ఉదయాన్నే రైలు దిగేసరికి నన్ను రిసీవ్ చేసుకోవడాన్కి రామ్మూర్తి, విజయ్, రంగ స్వామి, లలిత, రాధ సిద్ధంగా వున్నారు స్టేషన్‌లో నేను ముందే నా ప్రోగ్రాం వివరంగా వ్రాసి వుండడం వలన వాళ్ళందరికీ నేను తిరుమలలో దిగుతానని తెలుసు

నా కళ్ళు డేవిడ్ కోసం వెతికాయి వాడు రాలేదు స్టేషనుకు

'ఒరేయి డేవిడ్, నిన్ను నేను చాల ప్రేమి స్తానురా ఎందుకంటే నీవు చాల ఉన్నతమైన వ్యక్తివి!' అనుకున్నాను 'ఏ ఫ్రెండ్ వన్ హూ కంవ్స్ ఇన్ వెన్ ది హోల్ వరల్డ్ హేస్ గాన్ అవుట్!' అన్న ఆంగ్ల వాక్యాల్ని మననం చేసు కుంటూ

డేవిడ్‌గాడికి కూడా తెలుసు నేను తిరుమలలో దిగుతానని అయితే వాళ్ళందరూ నన్ను రిసీవ్ చేసుకోవడాన్కి వస్తున్నట్లు తెలుసు కాబోలు తను ఆగిపోయాడు

నన్ను అందరూ ఆహ్వానించారు వారి వారి ఇండ్లకు అయితే నేను ఉండదలచుకున్న నాలుగు రోజులూ డేవిడ్ ఇంట్లోనే వుండిపోతానని చెప్పేశాను

''సరే, మొదట డేవిడ్ ఇంటికి వెళ్దాము అక్కడ్నుండీ మా ఇంటికి వెళ్ళి మధ్యాహ్నం భోజనం చేసిన తరువాత డేవిడ్ ఇంటికే వెల్దువు కానీ!'' అంటూ భోజనానికి ఆహ్వానం అందించింది లలిత

''నీ ఇష్టం!'' అన్నాను

స్టేషను వెలుపలికి రాగానే పాతదీ, క్రొత్తదీ కాని మధ్యరకం అంబాసిడర్ కారు డిక్కీ తలుపు తెరిచాడు విజయ్ ''ఈమధ్యనే కొన్నాను చవుకగా దొరికితే!'' అంటూ

నా సూట్‌కేసూ, మరో పార్సెలూ డిక్కీలో పడవేసి ముందు తలుపు తెరచి స్టీరింగ్ సీట్ వెనుక కూర్చున్నాను ''నీ కారు కండిషన్ ఎలా ఉందో చూస్తాను!'' అంటూ

అందరూ కూర్చున్నాక విజయ్ అందించిన తాళం చెవులతో కారు స్టార్టుచేసి ముందుకు పోనిచ్చాను అన్ కమింగ్ ట్రాఫిక్‌నూ, మనుషు లనూ ఒడుపుగా తప్పుకుంటూ చకచకా గేర్లు మార్చి కారు వేగాన్ని పెంచాను

''ఎప్పుడు నేర్చుకున్నావురా డ్రయివింగ్? వాకన్నా బాగా నడిపిస్తున్నావే?'' ఆశ్చర్యపోతూ అడిగాడు విజయ్

''మా కంపెనీకి ఒక ఫియెట్ కారూ, ఒక అంబాసిడర్ కారూ, ఒక మెటాడార్ వ్యానూ వున్నాయి ఇవికాక కంపెనీ డైరక్టర్లలో ముగ్గురికి పెద్దకార్లు పాంటియాక్, చెవర్లెట్, బెంజ్







వున్నాయి నేను ప్రతి కారూ తీసుకుంటూనే ఉంటాను ఏదో ఒక పనిమీద తరచుగా భువనేశ్వర్ లోని ఎఫిషియంట్ డ్రయివర్లలో చాలమందికంటే నేను బాగా నడపగలను ఏ కారయినా !'' అన్నాను గర్వంగా

''నీకు కారు ఇవ్వలేదా మీ కంపెనీవాళ్ళు ?'' అడిగాడు రామ్మూర్తి

''బజాజ్ చేతక్ ఇచ్చారు సర్క్రొత్తది అడిగితే కారే ఇవ్వగలరు కానీ నాకు అంత అవసరం ఏముంది ? అంతగా అవసరం అయినప్పుడు ఏ కారు తీసుకున్నా అభ్యంతర పెట్టేవారు ఎవరు ?'' అన్నాను

ఏ మలుపు ఏ గేరులో ఎలా తిప్పాలో ఫర్ఫెక్టుగా అలాగే త్రిప్పుతూ, సింగిల్ హ్యాండుతో నీట్‌గా డ్రైవ్ చేస్తూ డేవిడ్ ఇల్లున్న కాలనీవైపు కార్ను వేగంగా పోనిస్తున్న నన్నే లలిత పరీక్షగా చూస్తూండడాన్ని రియర్‌వ్యూ మిర్రర్‌లోంచి ఓరగా గమనించి మనసులోనే నవ్వుకున్నాను

డేవిడ్ ఇంటిముందు కారు ఆపి దిగగానే డేవిడ్ అతని తల్లీ ఇద్దరూ ఇంట్లోంచి వచ్చి మమ్మల్ని సాదరంగా ఆహ్వానించారు

లోపలికి వెళ్ళగానే సూట్‌కేస్ తెరచి ఫిలిప్స్ ఎలక్ట్రిక్ రేజర్‌సెట్ అందుకుని షేవ్ చేసుకున్నాను రెండు నిముషాలలో తరువాత చల్లటి నీళ్ళలో బాగా స్నానం చేసి ట్వెయిన్ జర్నీ తాలూకు అలసట పోగొట్టుకుని డేవిడ్ వాళ్ళ అమ్మగారు అందించిన టిఫిన్, కాఫీ తీసుకున్నాను అందరితో పాటు

తరువాత సూట్‌కేసు ప్రక్కనున్న పార్సెల్ విప్పదీసి అందులోని ఇంపోర్టెడ్ ఎలక్ట్రిక్ గిటార్ డేవిడ్‌కు అందించాను ''లాస్ట్ టైం కలకత్తా వెళ్ళినప్పుడు కలకత్తా అంతా గాలించి నీ కోసం కొన్నానురా ! వెరీ సుపీరియర్ క్వాలిటీ !'' అంటూ

డేవిడ్ దాన్ని అందుకుని సంతోషంగా పరిశీలించ సాగాడు

''రాధా ! నీ పెళ్ళికి వచ్చినప్పుడు హ్యారీలో ప్రజన్‌టేషన్ ఏమీ తేలేకపోయాను అందుకే నీ కోసం ఇది కొన్నాను, భువనేశ్వర్‌లో !'' అంటూ సూట్‌కేస్‌లోంచి ఖరీదైన ఇంపోర్టెడ్ కెమెరా తీసి

# అడ్డదారులు

రాధ చేతికి అందించాను

''థాంక్యూ రాజా ! థాంక్యూ వెరీమచ్ మావారు మంచి కెమెరా కొనాలని చాలరోజులుగా అంటూనే వున్నారు అయితే మంచిది ఈ ఊర్లో దొరకమూ లేదు, మేము బయట ఊర్లకుపోయిందీ లేదు !'' అంది ఆనందంగా

డేవిడ్ కళ్ళలోని తృప్తీ, రాధ కళ్ళలోని కృతజ్ఞతా భావం నాకు ఆనందాన్ని కలిగించినా మనసులో కొద్దిగా బాధకూడా కలిగింది

'లలితా ! నీకు నేను ఏమీ ఇవ్వలేని పరిస్థితిని ఎందుకు కలిగించావు నాకు ?' అని అనుకున్నాను మనసులో

''ఇక వెళ్దామా ?'' అంది లలిత

''ఓయస్ ! ఒక్క నిముషం '' అంటూ సూట్‌కేస్ తెరచి ఓ జత బట్టలు తీసుకుని డేవిడ్ బెడ్‌రూంలోకి వెళ్ళి తొడుక్కుని వచ్చి షూ తొడుక్కున్నాను

''నా కారు తీసుకు వెళ్ళండి !'' అన్నాడు విజయ్

''అబ్బే ఎందుకురా, కాస్త నడిస్తేకానీ ప్రయాణపు బడలిక తగ్గదు నాకు నీవు రాధనూ, రంగస్వామినీ, రామ్మూర్తినీ డ్రాప్‌చేసి వెళ్ళు నేమూ, లలితా నడిచే వెళ్తాము !'' అన్నాను మనసులో 'ఒరేయి ఇప్పుడు కనపరుస్తున్న ఆప్యాయతలో కనీసం పాతిక భాగం అయినా రాధ పెళ్ళిలో చూపలేకపోయారు కదరా' అనుకున్నాను

''డేవిడ్ ! నీ పనులు ఎన్నివున్నా ముగించుకుని రెడీగా వుండు సాయంకాలము మనం అలా వెళ్ళిపోదాము నీతో మాట్లాడాల్సినది ఎంతోవుంది!''

అని డేవిడ్‌తో చెప్పి లలితతో పాటు బయల్దేరాను

విజయ్‌వాళ్ళు కార్లో వెళ్ళిపోయాక లలితా, నేమూ నడచుకుంటూ బయల్దేరాము లలిత మొహంలో ఉత్సాహాన్ని గమనించ గలిగాను అయితే నా మనసులో ఏ భావమూలేదు అంతర్గతంగా లలితమీద వున్న కోపం వలన కావచ్చు

కొద్ది దూరం నడిచాక లలిత నా ఎడంచేతిని తన కుడిచేతిలోనికి తీసుకుని నడవసాగింది

రాధ పెళ్ళికి వచ్చినప్పుడు ఇలాంటి సన్నివేశాన్నే ఊహించుకుంటూ పరిగెత్తుకు వచ్చాను నేను కానీ నిరాశా, నిస్పృహాలతో వెనక్కి వెళ్ళిపోవాల్సి వచ్చింది అప్పుడు

ఈ పర్యాయం ఏ ఊహాలూ లేకుండా వచ్చాను ఇక్కడికి కానీ అద్భుతంగా వుంది నాకు లభిస్తున్న ఆదరణ అయితే ఈ ఆదరణను సరిగ్గా నింపుకో లేక పోతోంది నా మనసు ఎందుకో అంతరంగంలో కారణం తెలియని సంఘర్షణ కూడా లేకపోలేదు కొద్దిగా

లలిత నన్ను తమ ఇంటికి చేయిపట్టుకుని నడిపించుకు వెళ్తోంది బహుశా పార్కుకు లేక మరెక్కడికైనా కూడా తీసుకు వెళ్తుందేమో ? తన ఒడిలో తలపెట్టుకుని పడుకున్నా ఆమెకిప్పుడు అభ్యంతరం వుండదు బహుశా ! దినేష్ పెళ్ళికి కూడా ఇలాగే చెట్టా పట్టాలేసుకు వెళ్ళవచ్చు

అప్పుడు నాలో లేనిదేమిటి ? ఇప్పుడున్నదేమిటి ??

పెద్దలు మిగిల్చింది కాక స్వంతంగా సంపాదిస్తున్న డబ్బు, హోదా, ఆర్టిస్టుగా సమాజంలో గుర్తింపు !

మనిషికీ, మనసుకూ కూడా కావాల్సినవి ఇవేనా ?

ఆనాడూ, ఈనాడూ కూడా నాలో ఉన్నదీ, ఎప్పటికీ నాతోనే ఉండిపోయేది ఒక్కటుందనీ, అది 'నిజాయితీగా, సజావుగా, అసలు సిసలు మనిషిలా బ్రతకాలనే కోరిక' అనీ వీళ్ళు గుర్తించరు వీరికి అలాంటివి అవసరం లేదు 'సింగినాదం' అని కొట్టి పారేస్తారు కూడా

ఇలాంటి ఆలోచనలలో మునిగిపోయిన నేను లలిత కరస్పర్శలో ఎలాంటి అనుభూతినీ పొందలేక పోయాను ఆమె ఉత్సాహంగా చెప్తున్న కబుర్లకు యదాలాపంగా ఊకొట్టడం తప్ప వినడంలో ఆనందాన్ని అనుభవించలేపోయాను

లలిత వాళ్ళ ఇల్లున్న వీధి దగ్గర పడగానే లలిత నా చేయి వదిలేసింది ''రాజా, నీవో జడ పదార్థం అయిపోతున్నావు !'' అంటూ —

(ఇంకా వుంది)



# సినిమా విశేషాలు

-జి. వి. జి.



"మీరు తీయబోయే సిన్మా ఎన్ని రోజులాడుతుందో చెప్పాలా ? అది చెయ్యి చూసి కాదు, సినిమా చూసి చెప్పగలను"

## "మాంగల్య మహిమ"

"బాబూభాయ్ మిస్త్రీ ట్రిక్ ఫొటోగ్రఫీ మా చిత్రంలో హైలైట్. టి. జయశ్రీ నాగ నృత్యం మరో ఆకర్షణ," అని నిర్మాత ఎ. కనకదుర్గ తెలియజేశారు. ఈమె ఎస్. ఎ. పి. ప్రొడక్షన్స్ పతాకంలో నిర్మించే పై చిత్రానికి ఆశీష్‌కుమార్ దర్శకత్వం వహిస్తారు. శ్రీచందర్ మాటలు, ఆరుద్ర పాటలు రాశారు. రవీంద్రజైన్, బి. మాధవరావు సంగీత దర్శకులు. సమర్పణ : అందె కస్తూరీబాయి.

## "అమాయక చక్రవర్తి" చిత్రంలో కొత్త దర్శకుడు జనార్ధన్ ప్రతిభ !

"అతి క్లిష్టమైన ఇతివృత్తమైనా నా మీద నమ్మకంతో డైరెక్షన్‌ను నాకు అప్పగించిన విజయ బాపినీడుగారికి ముందుగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆయన రూపొందించిన చిత్రాలన్నిటిలో ఆయన ముద్ర ఆద్యంతం కనిపిస్తూనే ఉంటుంది. ఐతే, ఈ చిత్రం విషయంలో మాత్రం ఆయన నాకు పూర్తి స్వేచ్ఛను ఇచ్చారు. పైగా, కన్నడంలో పుట్టన్నగారి లాంటి గొప్ప దర్శకుడు మలచిన ఒక విజయవంతమైన చిత్రం దీనికి మాతృక. అంచేత, ఆద్యంతం ఎంతో దీక్షతో నేను కృషి చేశాను. ఈ చిత్రాన్ని సమర్పించే కె. శివశంకర్‌గారు, నిర్మాత మాగంటి రవీంద్రనాథ్ చౌదరిగార్లు నా మీద ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేయకుండా చిత్రీకరించాననే తృప్తి నాకు మిగిలింది. ఈ చిత్రంలో 'డాక్టర్ ఆనంద్' లాంటి గంభీరమైన పాత్రను చందమోహన్ అద్వితీయంగా పోషించారు. అలాగే మరో బరువైన పాత్రను హీరోయిన్ విజయశాంతి విస్మయం గొలిపే రీతిలో నటించింది. ఇంకా మాతన్‌ప్రసాద్, రాజేష్, గొల్లపూడి మారుతీరావు, రాళ్ళపల్లి, కాశీవిశ్వనాథ్, గోకిన రామారావు, నళినీకాంత్, చిట్టిబాబు, కృష్ణవేణి, అనిత, సత్యకళ, జయమాలిని వగైరా నటీనటులతోపాటు సాంకేతిక నిపుణులందరూ నాతో ఎంతగానో సహకరించి, 'అమాయక చక్రవర్తి' చిత్రాన్ని ఒక చెప్పుకోదగ్గ చిత్రంగా తీర్చిదిద్దడంలో నాకెంతగానో తోడ్పడ్డారు," అంటూ, లలిసీ చిత్ర వారి "అమాయక చక్రవర్తి" చిత్ర దర్శకుడు జనార్దన్ ఈ చిత్రంలోని పాటలను పాత్రికేయుల కోసం ఇటీవల ప్రదర్శించారు. ఆ పాత్రల చిత్రీకరణను చూశాక "జనార్దన్‌లో ఉత్తమ దర్శకునికి ఉండవలసిన లక్షణాలు ఎన్నో ఉన్నాయి. నేను పూర్తి పిక్చర్‌ను చూశాను. ప్రతి ఫ్రేములోనూ ఆయన ప్రతిభ కనిపిస్తుంది," అన్న హీరో చంద్రమోహన్ 'కితాబు' అక్షరాలా నిజమనిపించింది. ఈ చిత్రం ఫిబ్రవరి విడుదల. జనార్దన్ తొలి సారిగా దర్శకత్వం చేబట్టిన అర్జున్ ఆర్ట్స్ "మామ్మగారి మనవలు" చిత్రం తుదిమెరుగులు దిద్దుకుంటోంది.

"బందిపోటు రుద్రమ్మ"లో విజయలలిత













జయప్రద

# సినిమా

## భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ మరో చిత్రం

తాతినేని ప్రసాద్ డైరెక్ట్ చేసే చిత్రానికి ముందుగా మరో చిత్రాన్ని కోడి రామకృష్ణ డైరెక్షన్‌లో ప్లాన్ చేశాం అన్నారు మనిషికో చరిత్ర చిత్ర నిర్మాత ఎస్ గోపాల్‌రెడ్డి. ఈ కొత్త చిత్రంలో సంభాషణలకర్త గొల్లపూడి మారుతీరావుతో పాటు సుహాసిని సుమన్ విజయశాంతి భానుచందర్ అన్నపూర్ణ ఆదిగాగల వారుంటారు లక్ష్మణ్ ఛాయాగ్రాహకుడు. కె. సత్యం సంకలనకర్త.



## పులి – బెబ్బులిలో పచ్చబొట్టు

సాయం సమయం  చల్లగాలి వీస్తోంది చెట్లమీద పకులు కిలకిలారావాలు చేస్తున్నాయి కుమార్ (కృష్ణంరాజు) సీత (జయప్రద) ఒక చోట కూర్చున్నారు ఆ ఆనందోద్రేకంలో ఏం మాటాడాలో తోచని సీత కుమార్ ! నేను కోరుకునేది ఏమిటో తెలుసా ? ఎప్పుడూ ఈ చెయ్యి నాకు తోడుగా ఉండాలని — అంటూ అతని చేతిని మృదువుగా స్పృశించింది

ఒకసారి అందుకున్న చేతిని వదిలే అలవాటు ఈ చేతికి ఎప్పుడూ లేదు అన్నాడు కుమార్

అరమోడ్పు కన్నులతో అది నా అదృష్టం అంటూ అతని చేతిని దగ్గరగా తీసుకున్న సీత ఆకస్మాత్తుగా అతని చేతిమీది పచ్చబొట్టును చూసి, "అవునూ — మీ పేరు రాజాకుమార్ కదా? 'గోపీ కృష్ణ అనుందేమిటి ?" అంది విస్మయంతో

ఇది నా ప్రాణ స్నేహితుడి పేరు సీతా ! నాకు దూరమైనా — వాడిపేరు నా చేతిమీద వాడి జ్ఞాపకం నా గుండెలమీద జీవితాంతం చెరిపోకుండా ఉంటాయి సీతా ! అంటూ కుమార్ బలంగా నిశ్వాస వదిలాడు

సీత ముఖ ద్యుతులు మారాయి

కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో ఆర్ వి గురుపాదం సమర్పించే కమల ఎనీ ఆర్ట్స్ పులి — బెబ్బులి చిత్రం ఫిబ్రవరి విడుదల

## కిరాయి కోటిగాడు కార్యదీక్షాపరుడు!

కోటిగాడు (కృష్ణ) అమాంతంగా ఓ రౌడీ ఎదుట ఉరికాడు నా పేరు కోటిగాడు ఊరు తెనాలి ఉద్యోగం — కిరాయి పుచ్చుకొని కాళ్ళూ చేతులూ విరగొట్టడం ... వివరాలు చాలుగా ? ... చూడూ ! నీకూ, గేదెల గంగరాజుకీ ఏదో గొడవ

'ఈ దేశంలో ఒక రోజు'లో అవంతి, జ్యోతి







అడవి సింహాలు లో కృష్ణ కృష్ణంరాజు

లున్నాయంటగా ? నువ్వు కులాసాగా ఉంటే—ఆడికి నిద్ర పట్టడం లేదంట అందుకని — నీ కొక చెయ్యి తీసెయ్యమని నాకు కిరాయి ఇచ్చాడు బేరం ఒప్పుకొని డ్యూటీమీద వచ్చాను నీ మీద నా క్కోపం లేదు ఇయ్యాల నీ చెయ్యి తీసేసి రేపు ఆసుపత్రికొచ్చి నిన్ను పరామర్శిస్తాను కూడా ప్రస్తుతానికి నా డ్యూటీ నేను చెయ్యాలి కదా ? కాస్త కోఆపరేషన్ ఇవ్వు గురూ ! అంటూ కత్తి తీశాడు ఇంతలో ఆ రౌడీ అనుచరులు కొందరు రావడం చూసి ఆగండాగండి ! మీరు రెడీ అయిపోతున్నారెందుకూ? మిమ్మల్ని కొట్టడానికి నా కెవ్వరూ కిరాయివ్వ లేదే ! మరీ అంత సరదాగా ఉంటే మిమ్మల్ని కూడా డమాల్‌మనిపించేస్తాను. ఆ కిరాయేదో మీ దగ్గరే వసూలు చేసుకుంటాను. ఇష్టమేనా ? ఓ—కే ! అంటూ కోటిగాడు కత్తి ఝుళిపించాడు

హఠాత్తుగా ఆ రౌడీల వెనుకనుంచి "రౌడీగారూ, రౌడీగారూ ! కొట్టనూ—కొట్టడనూ అంటే మీ ముందుకొస్తాను, అంటూ గరుడాచలం (అల్లు రామలింగయ్య) గజగజ వణికిపోతూ ముందుకు వచ్చి ఆహాహా ! రౌడీగారూ! మీ వృత్తిలో మీకున్న కర్యదీక్ష పట్టుదల చూశాను రౌడీలు చాలామంది ఉండొచ్చు కానీ రౌడీయిజం కోసం ప్రాణాలర్పించే రౌడీలు నూటికి ఒక్కరుంటారు ఇంకా ఈ భూమ్మీద నాలుగు పాదాలూ రౌడీయిజం నడుస్తూంది అంటే — తమబోట్ల కారణం అన్నాడు.

కోటిగాడు గర్జించాడు ఆయ్ ! నీ సొల్లు కబుర్లు మాని అసలు విషయం చెప్పు !

గరుడాచలం కాస్త తమాయించుకొని, 'మాది — దగ్గర్లో ఉన్న పొట్లపల్లి బాబూ ! మా ఊళ్ళో ఒక వెధవ కల్లు తాగిన కోతిలాగ తెగ అల్లరి పెట్టేస్తున్నాడు తమరొచ్చి— అంటూ నీళ్ళు నమిలాడు

వాడ్ని సరిచేయాలంటావ్ సరే కిరాయి ఎంతో చెప్పు వాడి వివరాలు చెప్పు !

అవన్నీ మా ఊరొచ్చాక చెప్తా బాబూ ! ఇదిగో — ఇవి దారి ఖర్చులకు ఉంచుకొని రేపు బయల్దేరి మా ఊరొచ్చేసేయ్ రేపు అష్టమి — మంచిది నాయనా ! అంటూ కొంత డబ్బిచ్చాడు గరుడాచలం

అలాగే వస్తాన్లే నువ్వెళు !

పరమానందంతో గరుడాచలం బయటకు పరుగుతీసి హహ్హహ్హ ! వీడ్ని జాగ్రత్తగా దువ్వితే ఆ మిలిటరీవోడ్ని కాకుండా మా బావ భరతం కూడా పట్టించెయ్యొచ్చు ! అని గొణుక్కుంటూ మీసాలు దువ్వుకున్నాడు

ఎ కోదండరామిరెడ్డి దర్శకత్వంలో ఎస్ రామలింగేశ్వరరావు నిర్మించిన రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "కిరాయి కోటిగాడు" చిత్రం ఫిబ్రవరి విడుదల. సమర్పణ : నందిగం దేవీప్రసాద్.

'నాంపల్లి నాగు'లో మోహన్‌బాబు



పూల పరువాలు–
సన్న జాజులు, సంపెంగలు,
గులాబీలు... పలురకాల పువ్వుల్లోని
అందాలన్నిటిని సంతరించుకున్నయి
సరికొత్త విమల్ చీరలు.
ఆహ్లాదం కలిగించే
ఈ రంగుల వైభవాన్ని, మరిపించే
అందాలని చూడండి విమల్ చీరల్లో.
ఈ సీజనుకై సరిక్రొత్త శ్రేణి.

స్త్రీ మనోభావాలకు అందమైన
భాషలు ఎన్నెన్నో.
అందులో విమల్ ఒకటి.




100% పాలియెస్టర్ చీరలు

Mudra/RTI/1019 TEL

## చిరంజీవి రాజ్‌బాబు

"నవ్వు ! నవ్వించు !" ఇది రాజ్‌బాబు స్లోగన్.

తాను నవ్వకపోయినా – అందర్నీ "సమాజం" చిత్రం నుంచి నవ్విస్తూ వచ్చాడు. "నవ యువ చైతన్యం" చిత్రంలో నటిస్తూ, అందర్నీ దుఃఖ సాగరంలో ముంచి వెళ్లాడు.

తన ప్రతి పుట్టిన రోజు పండుగ సందర్భాన పదుగురిని సన్మానించేవాడు. "పి. డబ్ల్యు. డి. లో గుమాస్తాగానో, లేక మెడికల్ రెప్రెజెంటెటివ్‌గానో ఉండాల్సిన నేను ఈ సినిమా రంగంలో ప్రవేశించడం బట్టి చూస్తే, నేను పుట్టింది నాకోసం కాదని తెలిసిపోయింది. కాబట్టి, పదిమందికీ ఉపయోగ పడాలి గనుక – ఆ రోజు వారిని గౌరవించడం నాకు తృప్తి... పుట్టిన రోజు పండుగలు చేసుకునేది –



'నవ యువ చైతన్యం'లో రాజబాబు

ఈ రోజే పుట్టాం; వయసింకా రాలేదు; జీవితం ఇంకా తెలీలేదు; తెలుసుకోవాల్సింది చాలా ఉంది – అని తెలుసుకోవడమే ఈ పుట్టినరోజు పండుగలోని పరమార్థం," అనేవాడు.

మద్రాసు నుంచి హైదరాబాద్‌కు మకాం మార్చేముందు రాజ్‌బాబు ఉస్మాన్‌రోడ్‌లో ఆటోరిక్షాలో వస్తూ నన్ను చూసి, "మానవుడు ఎంత దుర్బలుడో తెలుసుకోడానికి నా జీవితమంతా పట్టింది. జీవితం ఏమిటో తెలిసిపోయింతర్వాత మానవుడు బతకడం కష్టం. అలాగే – వయసు పెరుగుతూన్నకొద్దీ బతికేది భయం... నేనెన్నో ఊహాలోకాలు సృష్టించుకున్నాను. వాటిలో ఏ లోకానికైనా త్వరలోనే వెళ్లిపోతాను," అన్నాడు.

ఆ లోకంలోనైనా అతని ఆత్మకు శాంతి లభించుగాక !

పుణ్యమూర్తుల రాజ్‌బాబు పుణ్యమూర్తి.

## సినిమా

### ఆమోదు చేయబడిన చిత్రాల పేర్లు

శ్రీ విఘ్నేశ్వరా ఎస్ ఆర్ట్ క్రియేషన్స్ 'ఛాలెంజి వేటగాళ్ళు' చిత్రకల్పన ఫిలిమ్స్ చిన్నల్లుడు, ప్రగతి చిత్ర కంబైన్స్ లైలా,'' ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ తాడు — బొంగరం,'' 'తారాజువ్వలు శ్రీరామగౌరి ఇంటర్నేషనల్ ఆహుతి శ్రీ విఘ్నేశ్వరా ఎస్ ఆర్ట్ క్రియేషన్స్ భర్త్యాభర్తల అనుబంధం' ఎల్ జి. పి. ఎంటర్‌ప్రైజెస్ పట్నం దొంగలు' శ్రీ కనక మహాలక్ష్మి క్రియేషన్స్ సజీవ మూర్తులు,'' శ్రీ క్రాంతి చిత్ర శివుడు హేమమాలిని ఫిలిమ్స్ శివరాత్రి మహాత్మ్యం గాయత్రి పిక్చర్స్ 'వెలుగు రేఖలు శ్రీ సాయిరాం ప్రొడక్షన్స్ విష్ణుపూజా మహిమ ప్రియా ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ చామంతిపూలు హనుమాన్ పిక్చర్స్ ధర్మకర్త అరుణోదయా ఫిలిమ్స్ ఇంటర్నేషనల్ రుక్మిణీ కల్యాణం జయలక్ష్మి ఆర్ట్స్ ఇంటర్నేషనల్ వామనావతారం కౌసల్య పిక్చర్స్ వేగుచుక్క

### "ఎందుకీ ఉద్రిక్తత"

''మహిళాభ్యుదయానికి సంబంధించిన అనేక అంశాలుగల చిత్రం రెండవ షెడ్యూల్ కూడా భాగ్యనగర్ స్టూడియోలో ఫిబ్రవరిలో మొదలవుతుంది, అన్నారు ఆర్ పట్టు ఈయన స్క్రీన్ ప్లే దర్శకత్వంలో ఆ స్టూడియో మేనేజర్‌గా పనిచేసిన మహమ్మద్ కాశిం నిర్మించే నూతన కళా చిత్రవారి పై చిత్రంలో శ్రీధర్ సాయిచంద్ జయంతి రోహిణి పద్మనాభం, కాకరాల, హరిబాబు మాస్టర్ హరి మాస్టర్ రాము సూర్యకాంతం జానకి నవ నటి శ్రీజ్యోతి పాల్గొంటున్నారు నిర్మాత కథకు ఎస్ ఆర్ నంది సంభాషణలకర్త వేటూరి ఎ నారాయణరెడ్డి గీతాలు సత్యం స్వరబద్ధం చేశారు డి రాజగోపాల్ ఛాయ కృష్ణమూర్తి శిల్పం, కందస్వామి కూర్పు మోహన్ నిర్వహణతో ఎ సుశీలా నర్సింగరావు సమర్పిస్తారీ చిత్రాన్ని



'అభిలాష'లో రాజ్యలక్ష్మి, చిరంజీవి, రాధిక

### "మానవులారా మన్నించండి"

### చిత్రానికి ఎ. సర్టిఫికేట్

'పౌరాణిక-సాంఘిక కలయికగా చాలా ఆసక్తి జనకమైన కథ ఒక ప్రధాన పాత్రను మాలవ్ ప్రసాద్ విశిష్టంగా పోషించారు అన్నారు ఊర్మిళా ఫిలిమ్స్‌వారి పై చిత్రానికి కథ స్క్రీన్ ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించిన పింజల భాస్కరరావు శ్రీధర్ ప్రసాద్‌బాబు, త్యాగరాజు వంకాయల స్వర్గీయ ముక్కామల జ్యోతిలక్ష్మి జయమాలిని విజేత, రాజేశ్వరి విజయలక్ష్మి సత్యచిత్ర పాల్గొన్నారు దాసం గోపాలకృష్ణ సంభాషణలు, పి శంకర్ సంగీతం ఎస్ ఆర్ మూర్తి ఛాయ, రంగారావు శిల్పం కందస్వామి కూర్పు, కమలాకర్ ప్రొడక్షన్ నిర్వహించారు సెన్సార్‌వారు ఏ సర్టిఫికేట్ ఇచ్చారు మార్చి మొదటివారంలో విడుదల అన్నారు నిర్మాత డాక్టర్ ఎస్ బాబూరావు

### రాఘవ చిత్రానికి

### కొమ్మినేని కృష్ణమూర్తి దర్శకత్వం

త్వరలో నేను స్టార్ట్ చేసే చిత్రంలో సుమన్ గొల్లపూడి భానుచందర్‌లను ఇంతవరకు అనుకున్నాం కొమ్మినేని కృష్ణమూర్తి డైరెక్టరు అన్నారు నిర్మాత కె రాఘవ ఈయన ఈ ఏడే మరో రెండు చిత్రాలను కూడా నిర్మించదలిచారు తదుపరి తెలుగు చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకుడు హిందీలో ఇంట్లో రామయ్య — వీధిలో కృష్ణయ్య చిత్రాన్ని తీస్తారు

### ముగ్గురు 'కుమార్'ల చిత్రం

క్రాంతి అనంతరం మనోజ్‌కుమార్ తలపెట్టిన భారీ హిందీ చిత్రంలో అతనితోపాటు దిలీప్‌కుమార్ రాజ్‌కుమార్‌లు కూడా ప్రధాన పాత్రలు ధరిస్తారు



"అమాయక చక్రవర్తి"లో
గొల్లపూడి, అనిత

# సినిమా

## 'భారతమ్మ ముద్దుబిడ్డలు' తొలిదృశ్యం

కొత్తదనానికి ఉత్తేజంగా ఉత్తమ భావాలకు నీరాజనంగా మనిషి మనిషిగా బ్రతుకే మహోన్నత మార్పుకోసం యువతరాన్ని గొంతెత్తి ఎలుగెత్తాలన్న చిన్న ప్రయత్నమే ఫెబీనా ఆర్ట్ క్రియేషన్స్ తొలి చిత్రం భారతమ్మ ముద్దుబిడ్డలు

ఆ ఆశతోనే వాస్తవజీవన దృశ్యాలలో కళాత్మకముగా ప్రతిబింబిస్తూ ఉల్లాసంగా ఉత్తేజంగా కదిలిస్తున్న ఆలోచన కలిగించే ఈ చిత్రం ఫిబ్రవరి 7వ తేదిన లెనిన్ మహాశయునిపై తొలిదృశ్యము విజయవాడలోని సర్వోదయ నాట్య మండలి వద్ద చిత్రీకరించబడినది బేబి ఫెబీనా లక్ష్మి కెమెరా స్విచ్ వేయగా శ్రీ సత్యనారాయణ (సాయికృష్ణ ఫిల్మ్స్) తొలి క్లాప్ ఇచ్చారు మరెందరో ఆత్మీయుల అభినందనలు యూనిట్‌ని ఉత్తేజపరిచాయి

నేటి వాస్తవ జీవితములోని ఆనందానికి విలాసానికి స్వార్థానికి వమ్మతకు సమతకు ప్రతిబింబాలయిన పాత్రలున్న ఈ చిత్రంలోని నాలుగు పాటలు రికార్డింగ్ పూర్తి అయింది కథ రచయిత నిర్మాత ఫెబీనా నాగేశ్వరరావు స్క్రీన్‌ప్లే దర్శకత్వం వీరా గాయకులుగా రామకృష్ణ ఆనంద్ రమణలతో కామెడీ గని బుద్ధదేవ్ ఎన్ కె రాజా, సాయిబాబులు తొలిసారి పరిచయము అవుతున్నారు

ఈ చిత్రంలో సంగీత పుష్పకుమారి జయవిజయ నూతనప్రసాద్ ప్రసాద్‌బాబు లక్ష్మీకాంత్, సత్యేంద్రకుమార్ రాళ్ళపల్లి నారాయణమూర్తి ఎస్ ఎ పాత్రుడులకు పైదోడుగా దేవిశ్రీ పద్మ విజయరాజి భవాని అమరలత చందన అనురాధ చైతన్య(చిదంబరం) చక్రవర్తి చక్రపాణి రాధకృష్ణమూర్తి శ్రీరామమూర్తి ఎ ఎన్ వి ప్రసాద్ శివ శంకర్ (చిన్న) జనార్దన్ ఎస్ కుమార్ మరియు ఫెబీనా నాగేశ్వరరావు మరెందరో రంగస్థల నటీనటులు (ప్రజా నాట్యమండలి) తెరకి పరిచయం అవుతున్నారు

కెమెరా బి బాబు సంగీత దర్శకుడు కె ఎస్ మూర్తి, మాటలు రచయిత మాస్టరుజీ కళ లీలాకృష్ణ ఎడిటింగ్ కె నాగేశ్వరరావు డాన్స్ సురేష్ ఆనంద్ ప్రస్ రిలేషన్స్ జగన్ డి ధర్మారావు దుస్తులు నమ్మయ్య ఫెబీనా టైలర్స్ స్టంట్స్ లంక వెంకటేశ్వరరావు ప్రొడక్షన్ మేనేజరు నారాయణమూర్తి నిర్మాణ సహకారం వీరమాచనేని బాలరావుచౌదరి, పి జి మోహనరావు, ఎ ఎల్ మనోహరి నల్లపాటి మధుసూదన్‌రావు ఎస్ మగుణ నిర్వహణ కె అంజిబాబు






# సినిమా

## కృష్ణ హీరోగా కె ఎస్ ఆర్ దాస్ చిత్రం

జనవరి 28 న డిస్కో సాంగ్‌ను కృష్ణ జయమాలినితో పిక్చరైజ్ చేశాం అన్నారు డైరెక్టర్ కె ఎస్ ఆర్ దాస్ షంషేర్‌శంకర్ అనంతరం మక్కళ్ తిలకం మూవీస్ అధినేత పి పద్మనాభం నిర్మించే ద్వితీయ చిత్రానికి డి ఎ నరసరాజు సంభాషణలకర్త సత్యం సంగీత దర్శకుడు ఎస్ ఎస్ లాల్ ఛాయాగ్రాహకుడు వెంకటేశ్వర రావు సంకలనకర్త



'ముందడుగు'లో శ్రీదేవి

## దుర్గా నాగేశ్వరరావు దర్శకత్వంలో గణేశ్ మూవీస్ చిత్రం

జనవరి 16 నుంచి ఫిబ్రవరి 5 వరకు విజయవాడలో షూటింగ్ పూర్తయింది అన్నారు దుర్గా నాగేశ్వరరావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో గణేశ్ మూవీస్ అధినేతలు వి వెంకటేశ్వర రావు, వి ధర్మారావు నిర్మించే తొలిచిత్రానికి జనవరి 10న మద్రాసులో అంకురార్పణ జరిగింది పూర్ణిమ ప్రదీప్, బాలాజీ, సాక్షి రంగారావు రావి కొండల రావు రాళ్ళపల్లి సుత్తి వేలు, విజేత జానకి ఫణి పాత్రధారులు, భీ శెట్టి లక్ష్మణరావు కథ, మాటలు రాశారు బాబూరావు ఛాయాగ్రాహకుడు ★

# మీ స్నానమునందు ఒక క్రొత్తదనము నిచ్చు

## సబ్బు - ప్రేమ్




సుకుమారమైన మీ చర్మ సౌందర్యమునకు ప్రేమ్.
దీని పరిమళము స్వచ్ఛమైన నురగ మీ శరీరమును
ఆహ్లాదింపజేయును

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చు సబ్బు-ప్రేమ్.





జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

Imageads-M-1564

సీరియల్

# అందానికి అవతలివైపు

కేవిశ్వ

## 13

''సుందరీ కాలేజ్ వార్షికోత్సవాలలో నువ్వు పాల్గొనాలి నృత్య ప్రదర్శనలో ముఖ్య పాత్ర ధరించాలి ఏం ?'' ఫైనార్ట్స్ ఇన్‌ఛార్జ్ మేడమ్ సునీత అంది

''మేడమ్ నా కసలు డాన్సు రాదుగా ''

''ఎవరికి మాత్రం వొచ్చని ? వారం రోజుల రిహార్సల్స్‌తో స్టేజీమీద చక్కగా చేసెయ్యొచ్చు – ఏం ?''

''కాని – పరీక్షలు మేడం ''

''వారం రోజులే రిహార్సల్స్ ! రోజూ సాయంత్రం గంటసేపు అంతేగా సిక్స్‌ఓక్లాక్ ట్రిప్‌లో ఇంటికెళ్ళిపోవచ్చు ''

ఒప్పుకోక తప్పలేదు సుందరికి

నృత్య ప్రదర్శనలో పాల్గొనమనీ, అందునా ముఖ్య పాత్ర వెయ్యమనీ తనను ఇంతగా ప్రత్యేకించి బలవంతం చేసి అడగటం సుందరికి లోలోపల గర్వంగా కూడా అనిపించింది

ఆ రోజు సాయంత్రం నుంచే రిహార్సల్స్ మొదలయ్యాయి

కాళ్ళూ చేతులూ ఉన్నవి – కేవలం నడవటానికీ మామూలుగా కదలటానికీ మాత్రమేనా ? వాటిని ఒక క్రమంలో లయగా భంగిమ ప్రదర్శిస్తూ కదిలిస్తే – అద్భుతంగా ఉంటుందని తెలిసింది సుందరికి

కాలేజీ వార్షికోత్సవం రోజు రానేవచ్చింది

గ్రీన్ రూంలో సుందరికి సాయంగా ఉన్నారు వీణా, పల్లవీ

''ఈ వేషంలో నువ్వు పరమాద్భుతంగా ఉన్నావు '' అంది పల్లవి ఆ మాట నోటితో చెప్పలేదు వీణ కళ్ళింతలు చేసుకుని సుందరిని తదేకంగా చూసుకుంటోంది

''అన్నట్టు – ఈ పరికి మా అన్నయ్య ఆడియన్సులో ఉంటాడు –'' అంది పల్లవి ''ఇన్విటేషన్ నేనే ఇచ్చాను –''

విమెన్స్ కాలేజీ కాబట్టి ఇన్విటేషన్ లేకుండా పురుషుల్ని రానివ్వరు

మీటింగ్ ముగిసింది

తెర లేవబోతుండగా, కర్టెన్ ఇవతల సుందరి కాళ్ళు కొద్దిగా కంపించాయి ఒక్క క్షణం మనసంతా శూన్యంగా అయిపోయింది



(గత సంచిక తరువాయి)

సుందరి స్టేజీమీదికి అడుగులు వేస్తూ వెళ్ళేసరికి ప్రేక్షకుల కళ్ళలో కోటి మెరుపులు మెరిశాయి

''ఎవరండీ ఈ అమ్మాయి ఇంత స్మార్ట్‌గా ఉంది '' అన్నాడు ముఖ్య అతిథి ప్రిన్సిపాల్‌తో

''మా బియెస్సీ ఫస్టియర్ స్టూడెంట్ పేరు సుందరి చాలా బ్రిలియంట్ స్టూడెంట్ కాలేజీ బ్యూటీ అంటుంటార్లెండి '' ఈ చివరి మాట కేవలం ప్రిన్సిపాల్‌గారి కల్పన సుందరి అందాన్ని ముఖ్య అతిథి పొగిడేసరికి తమూ ఏదైనా చేర్చాలని ఆమెకు అనిపించింది

రెండో వరసలో కూర్చున్న లెక్చెరర్లు కొందరికి ఈ మాట స్పష్టంగా వినబడింది వాళ్ళూ వాళ్ళూ అనుకోవటంతో సుందరిని 'కాలేజీ బ్యూటీ' అని ప్రిన్సిపాల్‌గారు అన్నట్టు అక్కడున్న స్టూడెంట్లందరికీ నిమిషాలమీద తెలిసిపోయింది

ఆహ్వానితుల వరసలో కూచున్న సుమంత్ స్టేజీయే ప్రపంచం అన్నంత దీక్షగా చూస్తున్నాడు

అతని కళ్ళకు నాట్యం చేస్తున్న సుందరి– దిగివచ్చిన దేవకాంతలా అనిపిస్తోంది ఆమె ఒక్కొక్క కదలికా అతనిలో వేయి కదలికల్ని కలిగిస్తున్నది

తెర వాలిపోవటంతో హోరుగా చప్పట్ల మోత వినవచ్చింది

సుమంత్ చప్పట్లు కొట్టలేదు ఇంకా స్టేజీ వేపే చూస్తున్నాడు వేరే కార్యక్రమం ఏదో మొదలవబోతూండగా అతను సీటులోంచి లేచి గ్రీన్ రూంకేసి వెళ్ళబోయాడు అక్కడంతా అమ్మాయిలే ఉండటంచేత 'లోపలికి వెళ్ళనివ్వరేమో కూడా' అనుకుంటూ కొంచెం దూరంగా వెళ్ళి ఒక చెట్టు కింద నిలబడి సిగరెట్టు తీసి వెలిగించాడు

అతని గుండెలలో సుందరి అడుగులు ఇంకా కదులుతున్నాయి కళ్ళు తిప్పుతూ, చిరునవ్వు నవ్వుతూ సుందరి చేసిన అభినయం అతని కళ్ళ నిండా ఇంకా ప్రత్యక్ష మౌతూనే ఉంది

సుందరి నాట్యం ముగించి రాగానే స్టేజీ ప్రక్కనున్న వారంతా ఆమెను ఒక్కుమ్మడిగా చుట్టుముట్టి అభినందనల్లో ముంచెత్తేశారు

''రా–ఫొటోలు తీసుకోవాలి వెంటనే –'' అని తీసుకెళ్ళింది పల్లవి

వీణతోనూ పల్లవితోనూ గ్రూపుగానూ విడివిడిగానూ ఫొటోలు దిగింది సుందరి

---

**జరిగిన కథ–2** సుందరి చాలా అందంగా వుంటుంది ఆ పిల్ల కళ్ళు ఇంకా బావుంటాయని చూసినవాళ్ళంతా అనుకొంటుంటారు సుందరికి ఇంట్లో జరిగే తతంగం, బయటి వాతావరణం తెలిసీతెలియనట్లుగా వుండి ఎన్నో ప్రశ్నలకు దారితీస్తాయి ఇంట్లో ఏవో గొడవలు జరుగుతాయి ఆ తర్వాత తల్లిదండ్రులతోపాటు గుంటూరు నుంచి ఆ వూరుకు వచ్చేస్తుంది సుందరి అక్కడ తండ్రి ఎలిమెంటరీ స్కూల్లో చేరుస్తాడు ఆ స్కూల్ నుంచి హైస్కూల్లో, అక్కడ్నుంచి కాలేజీలోకి వస్తుంది సుందరి చాలా పట్టుదలతో చదువుతుంటుంది

---

## 14

థియేటర్‌లో కూచుని ఉంది సుందరి, సుమంత్‌తోబాటు

''సుందరీ–మీవాళ్ళేమీ అనరా ?''

''ఎందుకూ ? నీతో ఇలా సినిమాకొచ్చినందుకా ? ఎందుకు అనుకోవటం ?''

''అడిగే వొచ్చావా ?''

''అడిగికాదు, చెప్పి–''

''అవును–ఆ రెంటికీ చాలా భేదం ఉంది–''

''మా నాన్న అంటాడూ – ఏ పనిగానీ ఆయన్నూ అమ్మనూ అడిగి చెయ్యక్కర్లేదుట కాని చేసేవన్నీ చెప్తే చాలట వీలైతే ముందే చెప్తే మరీ మంచిదిట ''

''నువ్వు అదృష్టవంతురాలివి సుందరీ ''

స్లైడ్సు వేశారు న్యూస్‌రీల్ మొదలయింది

సుమంత్ దృష్టి అంతా స్క్రీన్‌మీద లేదు అప్పుడప్పుడూ సుందరివేపు మళ్ళుతోంది

సుందరితో ఏవేవో కబుర్లూ ఊసులూ చెప్పుకోవాలని అతనికి ఉంది అందరిలోనూ కాక ఏకాంతంగా సుందరితో గడపాలని ఉంది అందుకే సినిమా ప్రపోజ్ చేశాడు అభ్యంతరం చెప్పకుండా వచ్చింది సుందరి

''సుందరీ ఉక్కగా లేదూ ''

''భలేవాడివే ఏసీ థియేటర్‌లో ఉక్కేమిటి? మరీ వారగా కూచున్నాం అలా మధ్య వరసలో కెళ్దామా ?''

సినిమా మొదలవుతోంది

''వొద్దులే బాగానే వుంది ''

''అరె ఇది కలర్ సినిమా అన్న మాట సినిమా స్కోప్ కూడాను '' అంది సుందరి, కళ్ళు ఇంకా పెద్దవిచేసి తెర అంతటినీ చూస్తూ, ఆ తరువాత సినిమా చూడటంలో పూర్తిగా లీనమైపోయింది

''సుందరీ వొకటడుగుతాను చెప్తావా? ''

''ఏంటి ?''

''నేను నేను ఎట్లాంటి వాణ్ని ? ''

''ఓ '' అంది సుందరి, సుమంత్ ధోరణిలో ప్రత్యేకతను అప్పుడే గుర్తించింది ''ఇంకా ఏం అడుగుతావూ ?'' అంది సన్నగా నవ్వుతూ

''ఏం లేదు, అడగను– చెప్తాను నువ్వంటే నాకు ఇష్టం ''

తెరమీద డ్యూయెట్టు మొదలైంది

"నాక్కూడా నువ్వంటే ఇష్టమే–" అంది సుందరి "అయితే?"

"అయితే" అంటూ తల అడ్డం తిప్పుతూ "అంతే– ఇష్టం" అన్నాడు సుమంత్

అతని ధోరణి చూస్తూ అప్రయత్నంగానే నవ్వింది సుందరి

## 15

పరీక్షలైపోయాక సెలవు దినాలు కొంచెం కష్టంగా గడిచాయి సుందరికి అయినా ఒకటి రెండు విశేషాలు జరగకపోలేదు

ఒక రోజున విశాఖపట్నం నుంచి తండ్రి తరపు చుట్టం ఒకాయన వచ్చాడు పేరు సుందరేశ్వరరావు ఆయన కాస్త విలక్షణమైన మనిషే

మాసిన బట్టల్లో ఉన్నప్పటికీ, ఆయనలోని వ్యవహార్తతనం కొట్టొచ్చినట్టు తెలుస్తోంది

కౌసల్యతోనూ కామేశ్వరరావుతోనూ ఆయన మాట్లాడే తీరుబట్టి అనధికారంగా ఆయన ఒక పెళ్ళిళ్ళ పేరయ్య అని తెలిసిపోయింది సుందరికి

చల్లకొచ్చి ముంత దాచిన బాపతుగా కాకుండా విషయంలోకి స్పష్టంగానూ సూటిగానూ దిగాడాయన, బొంబాయిలో ఏడువందల ఉద్యోగంలో ఏ దురలవాట్లూ లేని అందమైన మరియూ మాంచి ఫామిలీ బ్యాక్‌గ్రౌండున్న అబ్బాయున్నాడుట

తల్లి చెప్పగా కాఫీలు తీసుకుని వెళ్ళి సుందరేశ్వరరావుకి నమస్కారం పెట్టి కాఫీ ఇచ్చింది సుందరి

కాఫీ చప్పరించి, సుందరికేసి చూసి మెరుపు కొట్టినట్టు క్షణంసేపు అలాగే ఉండిపోయి — "అయ్యా బొంబాయబ్బాయంటే తమకి ఇష్టం లేనట్టుగా ఉంది పోనియ్యండి కౌసల్య కూతురు చక్కగా ఉంటుందని విన్నానుగాని, మరీ ఇంత కుందనపు బొమ్మని అమ్మాయ్ ఇక నువ్వు లోపలికెళ్ళు– ఏమాటకామాటే నా కళ్ళకే మంచివేం కావు మరి బాబాయ్ మరో అబ్బాయున్నాడు వోస్లిసన్ వాళ్ళకేడే కొడుకు వూరుకుంటే లోచని వుద్యోగం చేస్తున్నాడు అదయినా నాలుగంకెల జీతం నాగపూర్‌లో వుంటున్నాడు"

మరో రెండు గంటలు అలా కూచుని ఇంకో రెండు మూడు సంబంధాల విషయం ప్రస్తావించి, ఆడపిల్లల పెళ్ళి విషయంలో ఉండవలసిన ముందు చూపు గురించి హెచ్చరికలు చెప్పి, మళ్ళీ కలుస్తాననీ, ఈలోగా సుందరివి రెండు మాంచి ఫుటోలు రెడీ చేయించమనీ (ఎలా తీస్తేనేం లెండి — సుందరి సుందరే!) పురమాయించి నిష్క్రమించాడు సుందరేశ్వరరావు

"సుందరీ– నీకా– పెళ్ళా? అప్పుడే!" — అంది సుందరి, అద్దంలో సుందరితో

అద్దంలో సుందరి నవ్వబోయి అంతలో నవ్వు మానుకుని సీరియస్‌గా చూసింది

"అవును– నేనింకా చిన్నపిల్లనేం కానుగా—' అనుకుంది సుందరి

ఆ రాత్రి కామేశ్వరరావూ కౌసల్యా సుందరితో పెళ్ళి విషయం ప్రస్తావించారు ఆ విషయం మొదటగా పెద్దల నోటంట విన్న ఆడపిల్ల సిగ్గుపడకుండా ఎలా ఉంటుంది?

"నా పెళ్ళి అప్పుడేనా?"

"దానికింకా చదువుకోవాలని ఉందండీ కదు సుందరీ!?" అంది కౌసల్య, తన అభిప్రాయం కూడా అదే అయినట్టు

"సరే– ఇప్పుడే పెళ్ళి చేసెయ్యాలనలేదుగా నేనూను అయినా ఆ ఆలోచన ఒకవేపు ఉండటం కూడా మంచిదేగా ఏం సుందరీ సుమంత్ లాంటి అబ్బాయి ఏమనిపిస్తాడు నీకు?" చాలా యథాలాపంగా అడిగాడు కామేశ్వరరావు

నవ్వుతూ– "నాన్నా అతను నేనంటే ఇష్టమన్నాడు అయితే" అంది సుందరి, ఆపైన చెప్పలేకపోయింది

మధ్యలో అందుకుంది కౌసల్య– "ఇప్పట్నుంచీ అవన్నీ ఎందుకండీ" అంది భర్తతో "సుందరీ– పెళ్ళిచేసి నీ బరువు వదిలించుకోవాలని తపనేంలేదు మాకు నువ్వు మాకసలు బరువే కాదు నీ చదువు



నీ ఇష్టం వచ్చినంత వరకూ చదువుకో ఆ తర్వాతే పెళ్ళీ కాపురం— ఇవన్నీ !— ఏం? ఈ లోగా ఆ ఆలోచన రావాల్సిన అవసరం కలిగితే జాగ్రత్తగా ఆలోచించు అవసరమనిపిస్తే మమ్మల్ని సంప్రదించు—''

తల్లి మాటలోని సూచన అర్థమయింది సుందరికి, ''అలాగేలేమ్మా—'' అంది అక్కణ్ణుంచి లోపలిగదిలోకి కదులుతూ ఆమె మనసులో సుమంత్ మెదిలాడు

## 16

సెకండ్ ఇయర్ కూడా పాసై ఫైనల్‌లో కొచ్చేసింది సుందరి

ఈ సంవత్సర కాలం, అతి మామూలుగా గడుస్తూ వచ్చింది

అయితే లోలోపల సుందరిలో చాలా మార్పు లొచ్చాయి

స్నేహితురాళ్ళని మామూలుగా కలుస్తూ, వాళ్ళతో కబుర్లు సాగిస్తూ ఉన్నా— వాళ్ళను కాలక్షేప సాధనాలుగా కన్న ఎక్కువగా పట్టించు కోవటం మానేసింది

''సుందరీ నువ్వు మునుపటిలా నాతో మాట్లాడటంలేదు, నా కోసం హాస్టల్‌కి రావటం లేదు ఏం? నామీద కోపమా? ఎందుకూ?—'' అంది వీణ అమాయకంగా

''అదేం లేదే, ఫైనల్ కదా సీరియస్‌గా చదవాలి అదీగాక ఈ ప్రాక్టికల్స్ ఒకట్మొహటి నీమీద కోపమెందుకు వీణా నాకు? ''

''ఏమో నువ్వు నాకు దూరమౌతున్నా వనిపిస్తుంది భలే దిగులేస్తుంది ''

---

రిపబ్లిక్ దినోత్సవంనాడు విజయవాడ తుమ్మలపల్లి కళాక్షేత్రంలో శ్రీ టి ఎస్ రావ్ హిప్నాటిజమ్ ప్రదర్శన నిర్వహించారు హిప్నటైజ్ చేసిన వ్యక్తి కాళ్ళని గంటన్నరసేపు గాలిలో ఉంచినదృశ్యం



# అందానికి అవతలివైపు

''కుదరటం లేదు కాబట్టి కలవటంలేదు గాని నువ్వెప్పుడూ నా మనసుకి దగ్గరగా వుంటావుగా '' నవ్వుతూ అంది సుందరి

''ఎంత స్వీట్‌గా నవ్వుతావూ అందుకే ఐ లవ్యూ సోమచ్ '' అంది వీణ

వీణ బేలతనం, ఆ ముగ్ధ మనసులో తన సౌందర్యం పట్లగల ఆరాధన చూసి సగర్వంగా నవ్వు కుంది సుందరి

పల్లవి అప్పుడప్పుడూ సుందరి ఇంటికి వచ్చి కొంతసేపు ఉండిపోతుంది పల్లవితో బాటు అప్పుడప్పుడూ సుమంత్ కూడా వస్తాడు

పెళ్ళి విషయం ఇంట్లో ప్రస్తావన వచ్చిన తర్వాత సుమంత్ ప్రతి మాటనూ సీరియస్‌గా పట్టించుకుంటోంది సుందరి

అతనితో అప్పుడప్పుడూ సినిమాలకీ షికార్లకి వెళ్తోంది అలా వెళ్ళిన విషయం తల్లికి చెప్తూనే ఉంది కాని సుమంత్ పట్ల ఒక స్థిరమైన అభిప్రాయం ఏదీ కలగటంలేదు సుందరికి

''సుమంత్! ఎమ్మే పాసయ్యావు గదా నువ్వు ఉద్యోగం కోసం ఎందుకు ప్రయత్నించవు నువ్వు? తల్లిదండ్రులమీద ఎంతకాలం ఆధారపడతావు?'' ఒకరోజు కాలేజీ దారిలో తనతో నడుస్తూ వస్తున్న సుమంత్‌ని అడిగింది

''నిజమే సుందరీ— ఉద్యోగం కోసం ప్రయత్నించాలి ఇంజనీర్‌గా మా నాన్న అంతో ఇంతో వెనుకేశాడు ప్రస్తుతానికి జరుగుబాటు సమస్య లేదు అయినా— ఎప్పుడో ఒకప్పుడు స్వంతంగా ఆర్జించవలసిందేగా ఈలోగా చెప్పలేను అప్పుడప్పుడూ అదోలా అనిపిస్తుంటుంది నాకు ''

''అదోలానా? అంటే?''

''ఏమిటోలే తర్వాత చెప్తాను ''

ఇలా ఎన్నో 'తర్వాత'లు అయ్యాయి

జీవితం గురించీ, మనుష్యుల మధ్య సంబంధాల గురించీ అవసరమైన మేరకంటే ఎక్కువగా సుమంత్ ఆలోచిస్తున్నాడనిపిస్తుంది సుందరికి

అతని కోసం తను ఏమైనా చెయ్యగలిగితే బాగుండునని పిస్తుందిగాని, అదేమిటో అతను నోరు విడిచి ఏదీ చెప్పడు, అడగడు

అందుకే అతను సినిమాకో షికారుకో పిలిచి నప్పుడల్లా కాదనకుండా అతనితో వెళ్తుంది సుందరి

సుందరితో సుమంత్ ప్రవర్తన ఎప్పుడూ ఎంతో 'కల్చర్డ్'గా ఉంటుంది

సుమంత్‌లో సుందరికి మరీ మరీ నచ్చిన గుణం ఈ 'కల్చర్' ఒక్కటే

ఒకసారి ఏరికోరి ఏదో హిందీ సినిమాకు వెళ్ళారు

సినిమాకు వెళ్ళినమాత్రం సుందరి దృష్టి అంతా తెరమీదే ఉంటుంది

మధ్యలో ఎందుకో ఒకసారి సుమంత్ వేపు చూస్తే అతను తలొంచుకుని ఏదో ఆలోచనలో ఉండటం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది

''ఏమిటి సుమంత్ — అంతగా ఆలోచిస్తు న్నావ్?''

''ఏమీ లేదు —''

ఈ 'ఏమీ లేదు'లు కూడా చాలా అయ్యాయి

అంత చక్కటి రంగుల సినిమా చూస్తూ కూడా అలా తలొంచుకున్న సుమంత్‌ను చూస్తే ఎందుకో విపరీతమైన జాలి అనిపించింది చనువుగా అతని చేతిమీద చేయివేస్తూ, ''నాతో చెప్పవూ?'' అంది

చేయి కొద్దిగా వెనక్కి తీసుకోబోయి అలాగే ఉంచేసి, సుందరికేసి చాలాసేపు చూసి, కళ్ళు మూసుకున్నాడు సుమంత్ ''నీ గురించే'' అన్నాడు

ఆశ్చర్యపోలేదు సుందరి

ఇటీవల సుమంత్ ఆలోచనల్లో తనే ఎక్కువ భాగం ఆక్రమిస్తూ ఉంటుందని ఊహించింది

''నా గురించి ఆలోచించేందు కేముందీ? ఎందుకూ అసలు? ''

ఈ ప్రశ్నకూ సుమంత్ వెంటనే ఏమీజవాబు చెప్పలేదు సన్నగా అతను నవ్వినట్టు మాత్రం ఆ మసక చీకటిలో కనిపించింది

''తర్వాత చెప్తావా? '' అంది సుందరి నవ్వుతూ

మళ్ళీ నవ్వాడు సుమంత్

''తర్వాతే చెప్తానా?'' అనుకున్నట్టుంది అతని చూపు

''ఎప్పుడూ చెప్పనేమో! '' అన్నట్టుంది అతని నవ్వు

సుందరికి అర్థమయీ అర్థంకానట్టు ఉండి పోయింది అతని వాలకం

## 17

సుందరి ఎక్కువ ప్రయత్నమేమీ చెయ్య నవసరంలేకుండా, సుమంత్ గురించి పల్లవి చెప్పింది ఒకసారి—

''వాడు చిన్నతనంనుంచీకూడా అంతే సుందరీ! పైకి సరదాగా నవ్వుతూ తుళ్ళుతూ కనిపించినా లోపల్లోపల ఎప్పుడూ దేన్నిగురించో ఆలోచిస్తుం టాడు పుట్టి ఆలోచనేమిటి — మథనపడు తుంటాడు—''

''నా గురించి ఏమన్నా చెప్తాడా వీ అన్నయ్య? ''

''మనం ముగ్గురం వుండగా మాట్లాడు కుంటాం కదూ అంతే నేనేమైనా చెప్తే మాత్రం వింటాడు అయితే నీ గురించి రెండు మూడు సార్లు ''

''ఆ రెండు మూడు సార్లు ''

''చెప్తే—నువ్వేమీ అనుకోకూడదు—''

''ఛీ! నేనలా అనుకుంటానా ''

''రెండు మూడుసార్లు—తమాషాగా మాట్లా డాడులే నువ్వు చాలా అందంగా వుంటావుట అది వాడు చెప్పేదేమిట్నిగాని నీ అందం వెనుక కొంచెం అహంకారం వుందిట అది అహంకారం కూడా కాదుట! ఒకరకమైన స్వార్థంట! ఏమిటో చెప్తాడులే నా కదంతా అర్థం కాలేదు—''

''సుమంత్ అన్నాడా అలా?''

''ఏమీ అనుకోవన్నావు—''

''అది కాదు పల్లవీ '' అంటూ నవ్వేసింది సుందరి ''తమాషా మనిషిలే మీ అన్నయ్య ''

ఆ రాత్రి కొంచెం కలతగా ఉంది సుందరికి

# నాణ్యతా లేక పొదుపా?



# ఇప్పుడు బోనస్ బనియన్‌లో రెండూ పొందండి.



ఇప్పటి వరకు మీరు ఎప్పుడు
మంచి నాణ్యమైన బనియన్
కొనాలనుకొన్నా దాని పైని వెల
చూసి కంగారు పడ్డారు పొదుపు
చేయబోయి కొంటే దాని తక్కువ
నాణ్యత చూసి బాధపడ్డారు
కాని, బనియన్ లేకుండా గడపలేరు
కనుక రెండిటిలో ఏదో ఒకదానితో
సరిపెట్టుకొన్నారు
కాని ఇప్పుడు మీకోసమే వుంది
బోనస్-VIP నుండి సూపర్‌ఫైన్
బనియన్ ఇది మొదటిసారుగా
మీకు నాణ్యత, పొదుపు–రెండిటిని
ఇస్తుంది
ఎక్కువ నాణ్యత, తక్కువ వెలకు!
ఆశ్చర్యపడ్తారేమో కాని, వాడి చూడండి
మీకే తెలుస్తుంది



క్రొత్త

# బోనస్

## బనియన్

## ఎక్కువ నాణ్యత తక్కువ వెల

VIP

AVENUES/HH/B 254 TL



ఇటీవల హైదరాబాదులో 'కలహంసి ఆర్ట్స్' ప్రారంభోత్సవ సందర్భంగా ప్రసంగిస్తున్న సంస్థ అధ్యక్షులు శ్రీ డి ఎస్ మూర్తి, శ్రీ వనం నరసింహారావు, డా దివాకర్ల వెంకటావధాని, డా సి నారాయణరెడ్డి, వడ్డెపల్లి కృష్ణగార్లని చిత్రంలో చూడవచ్చు

## అందానికి అవతలివైపు

సుమంత్ అన్నాడని పల్లవి అన్న మాటలు పదే పదే గుర్తొచ్చాయి

సుమంత్‌తో కలిసి తను గడిపిన కాలమంతా దృశ్యాలు దృశ్యాలుగా గుర్తొచ్చింది

అంతలో సుందరి మనసులో ఒక స్మృతి మెరుపులా మెదిలింది

ఇద్దరూ ఒకసారి క్యాంటీన్‌లో కాఫీ తాగుతున్నారు

''అన్నట్టు — నేనెలా ఉంటానో నాతో ఎప్పుడూ చెప్పనేలేదేం సుమంత్ ?'' అంది నవ్వుతూ సుందరి

''ఊఁ ?'' అన్నాడు సుమంత్ తమాషాగా కళ్ళెగరేసి ''బాగానే వుంటావు —'' అన్నాడు 'నే' కావాలనే వొత్తి పలుకుతూ

''అంతేనా ?''

''లేదు నువ్వు గొప్ప సౌందర్యవతివి కాని—''

''కాని ?—''

''తర్వాత చెప్తాలే గాని —'' అంటూనే మాట మార్చేశాడు

పరుపుమీద దొర్లుతూ చీకట్లోకి చూసింది సుందరి సుమంత్ ఆకారం మెదిలినట్లయింది

నవ్వింది సుందరి

సుమంత్ నవ్వకుండా సీరియస్‌గా చూశాడు

''యు ఆర్ ఎ సిల్లీ '' అనుకుంది సుందరి

### 18

కామేశ్వరరావు తరపున దూరపు బంధువులెవరో కాకినాడలో ఉన్నారట

ఆయన రిటైర్డ్ తాసీల్దారు కొడుకు మెడిసిన్ ఫైనల్లో ఉన్నాట్ట నలభై యాభై వేలు కట్నాలతో సంబంధాలు రెడీగా ఉన్నాయట

సుందరిని ఇచ్చేట్టయితే కట్నం కొంచెం తక్కువయినా చేసుకోవచ్చని సూచనగా రాయబారం లాంటి వర్తమానం పంపారు వాళ్ళు

వచ్చిన పెద్దమనిషితో మర్యాదగా మాట్లాడి పంపేశాడు కామేశ్వరరావు సుందరికి ఇప్పట్లో పెళ్ళి చేసే ఆలోచన లేదని చెప్పాడు

సంగతంతా సుందరికి చెప్పింది కౌసల్య ''చూడు సుందరీ కట్నం ఇచ్చి అల్లుణ్ణి కొనుక్కునే పద్ధతి మన తాహతుకి సరిపోదు మనం వూరుకున్నా నీ పెళ్ళి గురించి లోకులు ఇక కదిలిస్తూనే వుంటారు మనం ఎవర్నీ మెప్పించాల్సిన అవసరం లేకున్నా— మన మటుకు మనం సుఖంగా బ్రతకాలి కదా ! చదువుమీది నుంచి నీ దృష్టి చెదిరిపోనియ్యకు జీవితంలో స్థిరపడే విషయం గురించి తరువాత చూసుకోవచ్చు ఏది చేసినా నువ్వు నీ మనసుకు పరిపూర్ణంగా నచ్చినట్టు చెయ్యాలి— ఎప్పటికైనా ''

ఇలాగే పల్లవికి కూడా సంబంధాలు వస్తున్నాయట

తన పెళ్ళికి ఇప్పుడేం తొందర ?—అంటోందిట పల్లవి

''మా అమ్మకు మరీ తొందరగా వుందే పోనీ ఆలోగా అన్నయ్య పెళ్ళయినా చేసెయ్యాలంటుంది వాడు వొప్పుకోడు ఏమాటా చెప్పడు! బొంబాయిలో బీటెక్ చేస్తోందట వొకమ్మాయి వాళ్ళు ఫుటోలు పంపారు ఆట్టే ఏం బాలేదనుకో అయినా వాడా ఫుటోలు చూణ్ణు గూడా లేదు ''

మరో రెండు రోజులు గడిచాక సుమంత్‌తో వేరుగా మాట్లాడే వీలు కలిగింది సుందరికి

ఆమె మనసు పరిపరి విధాల పరుగులెడుతోంది

''సినిమా కెళ్దామా ?''— అన్నాడు సుమంత్

''వెళ్ళి తీరాలా ?''

''అయితే వెళ్దాం ''

''వూఁ హూఁ ''

ఇద్దరూ నడుస్తున్నారు

మెయిన్‌రోడ్డు దిగిన కొంత దూరంలో ఒక పాతగుడి ఉంది అక్కడ జనం ఆట్టే ఉండరు

సాయంత్రపు వెలుగులు మెరుస్తున్న బండమీద వెళ్ళి కూచున్నారు

''ఏఁవిటి సుమంత్ ?''

''ఏం లేదు —''

''ఎప్పుడూ ఆ విషాదమేనా ?''

శూన్యంగా చూస్తూ నవ్వాడు

ఆ తర్వాత ఆమాటా ఈమాటా మాట్లాడుకున్నారు

''జీవితంలో నువ్వు ఏం సాధించదలిచావో చెప్పు సుమంత్—'' అంది సుందరి

ఈసారి సుమంత్ నవ్వలేదు ''ముందు నువ్వు చెప్పు—'' అన్నాడు

ఈ ప్రశ్న సుందరి ఎదురు చూడలేదు

సమాధానం సుందరికే తెలీదు లేక, తెలిసినట్టు ఆమెకున్నా, అర్థమయేట్టు ఎలా చెప్పాలో తెలీదు

''నువ్వు ఇంత అందంగా వుండాల్సింది కాదు సుందరీ కాని ఇంత అందంగా లేకుంటే నేను విన్ను '' అంటూ అర్థోక్తిలో తల దించుకున్నాడు సుమంత్ ''సరేలే నాకు ఏమిటోగా వుంది ''

సుమంత్ నసుగుడికి ఉన్నట్టుండి ఎక్కడలేని చిరాకు అనిపించింది సుందరికి ఎన్నో రోజులుగా అణచిపెట్టుకునివున్న అసహనం అది

''సుమంత్— సూటిగా అడుగుతా చెప్పు నా గురించి నువ్వు ఎలా అనుకుంటున్నావ్ ? నాకు- నాకు అహంకారం అన్నావుట—కదూ ?''

''ఽ— పల్లవి చెప్పిందా ? నా ఉద్దేశం ''

''తెలుస్తోందిలే తప్పునాదే నీతో ఇంత దగ్గరగా ఉండాల్సింది కాదు-''

''సుందరీ—''

''అసలు నువ్వట్టి సిల్లీ మనిషివి ! నాలో అహంకారం ఏం కనిపించిందో అర్థం కావటంలేదు ఏదన్నా కామెంట్ చేసేందుకూ్కడా ''

''అర్థతుండాలి—కదూ ?''

''వూఁ నేనలా అనలేదు నేను మాత్రం అందరు ఆడపిల్లల్లాగా ''

''సింపుల్‌గా వుండిపోయేదానివి కాదులే అయినా ఈ రాద్ధాంతం ఎందుకూ ? నువ్వు అందమైనదానివే ! నీకు అహంకారం లేదు కూడా ' — చాలా ?''

''స్టుపిట్ !'' ఉక్రోషంగా అంది సుందరి సుమంత్ గొంతులో ఎగతాళి ఆమెను ముల్లులా పొడిచింది ''నువ్వే బుద్ధిమంతుడివి పైకొచ్చే వాడివి సరేనా ? పల్లవి అన్నయ్య కాకుంటే ''

''నన్నసలు కేర్ చేసేదానివేకాదు ఔనా ?''

''నాకసలు మూడ్స్ బాగులేవు—నేవెళ్తున్నా ''

''ఇలా ఎప్పుడూ జరగలేదు 'మనం వెళ్దామా ?' అనలేవూ ?''

ఇద్దరూ లేచి తిరుగుముఖం పట్టారు

అతుకులుగా తప్ప మాటలు సాగలేదు

ఈ సంఘటన తర్వాత సుందరి సుమంత్ గురించి ఎక్కువ ఆలోచించలేదు

అటుపైని సుమంత్ సుందరిని కలిసే ప్రయత్నం చెయ్యలేదు

''సుందరీ అయ్యేయస్ కోచింగ్‌కని మా అన్నయ్య నిన్ననే బైలుదేరి ఢిల్లీ వెళ్ళాడు అదేవిటి— నీకు చెప్పలేదూ ? అంది పల్లవి ''

''లేదు- తొందరలో మరిచిపోయాడేమో—''

''ఇద్దరూ దెబ్బలాడుకున్నారా ?—''

''ఎందుకూ ? వూఁహూఁ—లేదు—''

అటుపైన సుందరి ఎందుకో పల్లవితోకూడా మామూలుగా ఉండలేకపోయింది

పరీక్షలు దగ్గరపడుతూండటంచేత సీరియస్‌గా చదువులో పడిపోయింది

**(ఇంకా వుంది)**

# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

సిహెచ్. ఆర్. — సిర్ పూర్ కాగజ్ నగర్

భార్య భర్త మాటపైన నడవాలంటే ఏం చేయాలి ?

★ నీటిమీద నడవడం నేర్చుకోవాలి! మరి — మగవారి మాటలు నీటిమీద రాతలేకద ?

ఆర్. ఆర్. వి. — పొంగూరు

స్త్రీ ఒకే పురుషుణ్ని ప్రేమిస్తుంది. ఆరాధిస్తుంది; పూజిస్తుంది. తన శరీరాన్ని కూడా అతనొక్కనికే అర్పిస్తుంది. కాని పురుషుని స్వభావం దీనికి విరుద్ధంగా వుంటుంది.

★ అది మీ భ్రమ! కట్టుకున్న భార్య కాల్చుకుతింటూవున్నా — పరాయి స్త్రీలని కన్నెత్తి చూడని భర్తలు చాలామంది వుంటారు. వారి కథలు అంతగా బయటకు రావు— ఎక్కడా అలాంటి వాళ్ల 'పేరంటాళ్లు' 'దేవుళ్లు' అయిన కథలు లేవు కనుక...

సిహెచ్. వి. ఎ. — గర్లకుర్తి

స్త్రీ అందమైనదైనంతమాత్రాన పురుషుని జీవితం సుఖంగా సాగిపోతుందా !

★ అసలు బాధలు అప్పుడే ప్రారంభమవుతాయి! అందమైన భార్య వుండగానే సరికాదు— ఆమెని ఆదరముగా చూడగల్గాలి. మాటకి ముందు 'అందమైనదానివని గర్వపడకు' అంటూ చెప్పేవాళ్లే ఎక్కువ.

నాకు ఆడవారితో మాట్లాడడం యిష్టం లేదు. ఒకవేళ వారలు మాట్లాడిస్తే ఏమిచేయాలి?

★ నేలచూపులు చూడండి! లేదా పల్కరిస్తే పారిపోండి.

గ్రామాలు అభివృద్ధి చెందకపోవడానికి కారణం ఏమిటి ?

★ అక్కడ సంపద పట్నాలకి తెచ్చుకుని అనుభవించేవారు ఎక్కువ కావడం. ఉండని వూరు గురించి ఎవరైనా ఎందుకు పట్టించుకోవడం?

జి. సిహెచ్. ఆర్. — ఖర్గారోడ్

చదువుకున్న ఆడపిల్ల పిల్లల్ని సరిగ్గా చూసుకోదని అంతా అంటున్నారు. నా పిల్లల క్షేమం కోరి ఎలాంటి స్త్రీని చేసుకోవాలో అర్థం కావడం లేదు.

★ చదువురాని 'సవతి తల్లి' కంటే కాస్తైనా చదువుకున్న 'పింతల్లి' వారి బాగోగులు బాధ్యతలు అర్థం చేసుకుంటుంది.

కె. వి. ఎస్. — కోవూరు

దేవుడు లేడని నా నమ్మకం. దేవుడు ఎక్కడ వున్నాడు అక్కా. చెంట్లో వున్నాడు ?

★ లేడని నమ్మే మనిషివి ఉన్నాడని నమ్మించడం ఎందుకు తమ్ముడూ. నువ్వు దేన్లోనూ లేడంటావు. నేను దేవుడు సర్వాంతర్యామి దేనిలో లేడు ? అంటాను. ఈ వాద వివాదాలకి అంతెక్కడ ?!

సిహెచ్. ఎన్. ఆర్. - ఎర్రైనపల్లి

నేటి న్యాయ వ్యవస్థపై మీ అభిప్రాయం ఏమిటి ?

★ ఆలస్యం అయినా ఎప్పటికో న్యాయం జరుగుతుంది న్యాయస్థానాల్లో— అన్న నమ్మకం పోలేదు— కనుకనే లక్షల కేసులు పెండింగులో వుంటున్నాయి

దసరా మామూళ్లపై మీ అభిప్రాయం ?

★ ఒక్క దసరాకేనా?! మామూళ్లు ప్రతి దానికీ అలవాటైపోయింది. జీతాలకంటే ఈ రాబడి బాగున్నట్టుంది !

వయోజన విద్యపై మీ అభిప్రాయం ?

★ చాలా ముఖ్యం. నిరక్షరాస్యత నిర్మూలన, కుటుంబనియంత్రణ— యీ దేశానికి అత్యవసర విషయాలు. వయోజన విద్య— పరీక్షల చదువుగా వుండకూడదు. దైనందిన జీవితానికి పనికివచ్చే రీతిన రూపొందించాలని నా అభిప్రాయం. పల్లెలలో చిన్న చిన్న వ్యాపారాలు చేసుకునే స్త్రీపురుషులకు, ఇతర వ్యాపకాలలో మోస పోకుండా చూసుకోగల నేర్పు అలవడడానికీ— అనువైన విద్యా విధానం రూపొందించాలి. ఇలా ఉపయోగించే 'కిట్' శ్రీమతి దుర్గాబాయిగారి ఆధ్వర్యాన హైదరాబాదు అక్షర భవన్ వారు రూపొందించారు కూడా.

కె. ఆర్. వి. ఆర్. — అంగాపిపాడు

కాలేజీలో ప్రవేశించే నవయౌవన విద్యార్థి విద్యార్థినులకు మీరిచ్చే సలహా ఏమిటి ?

★ చదువుకోండి. ట్యూషన్ల బెడద పెట్టుకోకండి. పాఠ్యపుస్తకాలు కొనండి, గైడ్లు మానండి. సాటి అమ్మాయిలని సాటి విద్యార్థిగా చూడండి. పుస్తకాలలో ప్రేమలేఖలు బట్వాడా ప్రారంభించకండి. కాలేజీలో చేరగానే చదువైపోదు; ప్రారంభం మాత్రమేనని గుర్తుంచుకోండి.

ఎ. ఎస్. — నాగర్ కర్నూలు

ఈనాటి యువతరంపై మీ అభిప్రాయం ఏమిటి ?

★ యువత ఎప్పుడూ విశ్రాంతి నెరుగని సముద్రంలాగా వుండాలని అనుకుంటాను నేను. కాని మనవాళ్లు చిన్న విషయాలలో కల్లోలం, పెద్ద విషయాలలో నిస్తబ్ధత ప్రదర్శిస్తారేమిటో అనిపిస్తుంది !

కోర్టు హాలులో తరాజుపట్టుకొన్న బొమ్మ కళ్లకు గంతలు వుంటాయి ఎందుకు ?

★ వివక్షత చూపక—సాక్ష్యాధారంగానే తీర్పు చెప్పడం జరుగుతున్నదన్నది — తెలియచెప్పడానికి.

కె. ఎన్. ఆర్. — గునుపల్లి

మన "తెలుగుదేశం" నాయకుడైన ఎన్. టి. ఆర్. పై మీ అభిప్రాయం ఏమిటి ?

★ అందగాడు ఎన్. టి. ఆర్. అనుకునేదాన్ని. కానిప్పుడు గట్టివాడే కాదు — సభ్యత సంస్కారాలతో హుందాగా ప్రవర్తించగల నాయకుడుగా రూపొందారని అనుకుంటున్నాను.



సృజన సమాఖ్య (విజయవాడ) వారు తమ సంస్థ ఆరవ వార్షికోత్సవం సందర్భంగా సినీనటి కుమారి జయమాలినికి సన్మానం చేశారు. సన్మానానంతరం మేనక నృత్యాన్ని ప్రదర్శించిన కుమారి జయమాలినిని చిత్రంలో చూడవచ్చు.



# యోగ్యుడు

### పోట్లూరి సుబ్రహ్మణ్యం




అది పెళ్ళివారిల్లు అందులోనూ మగపెళ్ళి వారిల్లు అంతా హడావుడిగా తిరుగుతున్నారు రాఘవయ్యగారి ఆఖరి కొడుకు వివాహం రాఘవయ్యగారు ఓ సంవత్సరం క్రితం సబ్ట్రెజరీ ఆఫీసరుగా రిటైరయ్యారు ఆయనకు నలుగురు కొడుకులు పెద్దకొడుక్కి ఉండూర్లోనే మునిసిపాలిటీ ఆఫీసులో ఉద్యోగం రెండవవాడు స్టేట్ బాంకులో ఉద్యోగం సంపాదించుకొన్నాడు ప్రక్క ఊర్లో ఉన్న బ్రాంచి ఆఫీసులో ఉద్యోగం రోజూ పోయి వస్తుంటాడు మూడవవాడు అదే ఊళ్ళో సబ్ట్రెజరీ ఆఫీసులో గుమాస్తా ప్రస్తుతం చివరివాడు బి యస్సీ వరకు చదివి ఉద్యోగం కోసం ప్రయత్నించక మెడికల్ స్టోరు నడుపుతున్నాడు రాఘవయ్యగారికి తాతలనాటి రెండంతస్తుల భవనముంది ఆయనకు మూడొందలు వరకూ పెన్షను వస్తుంది ముగ్గురు కొడుకులూ జీతమంతా తండ్రి చేతిలో పోస్తే, నాలుగవ కొడుకు షాపులో ఆదాయం, పెట్టుబడులు ఎప్పటికప్పుడు లెక్కగట్టి తెలియజేస్తుంటాడు రాఘవయ్య కొడుకుల జేబు ఖర్చుకి తనే ఇంతని ఇస్తాడు ఏది ఏమయినా అది అసలు సిసలైన ఉమ్మడి కుటుంబం

రాత్రి ఎనిమిది గంటలకు ముహూర్తం ముఖ్యమైన వాళ్ళు తా రెండు రోజుల క్రితమే వచ్చారు పెళ్ళి రోజు కాబట్టి ఉదయం నుంచి బంధువులు రావడం రద్దీగా ఉంది వచ్చినవాళ్ళను పరామర్శించడం, వాళ్ళకు కాఫీ టిఫిన్లు అందించడం అంతా హడావుడిగా ఉంది పచ్చని తోరణాలు లక్ష్మీకళను చూపుతున్నాయి రాఘవయ్యగారూ, మిగతా అతని కుటుంబ సభ్యులంతా రామం ఇంకా ఎందుకు రాలేదా అని ఆలోచిస్తున్నారు రామం రాఘవయ్యగారికి స్వయాన తమ్ముని కొడుకు అతనంటే ఇంటిల్లపాదికీ ప్రాణం మధ్యాహ్నం ఒంటిగంటకు వచ్చాడు రామం భార్యాబిడ్డలతో

ఆ రాత్రి రాఘవయ్యగారి స్తోమతకు తగ్గట్లు పెళ్ళి వైభవంగా జరిగింది అందంతోబాటు బి ఎ వరకు చదివిన విద్యావంతురాలయిన కోడలు రావడం అతనికి సంతోషాన్ని కలిగించింది క్రొత్త చుట్టాల పరిచయాలతో, సరిక్రొత్త చీరల గరగరలతో, వియ్యపురాళ్ళ ఛలోక్తులతో, బావామరదళ్ల సరస హాస్యోక్తులతో జరిగిపోయింది కాలం రామం ఓ పది రోజులుండి తర్వాత హైదరాబాదు బయలుదేరాడు అందరూ బాధగా వీడ్కోలిచ్చారు నిన్న మొన్న పెళ్ళయిన రాజ్యలక్ష్మి కూడా కళ్ళనీళ్లు పెట్టుకొంది ప్రయాణమవుతూ ఉంటే

'అవును రాఘవయ్యగారింట సభ్యులయిన ప్రతి ఒక్కరికీ ఈ ఆపేక్షలూ, ఆదరణలూ తప్పవేమో అది తరతరాలుగా వస్తున్న ఆ ఇంటి మహాత్మ్యమేమో, అనుకొన్నాడు రామం పెదనాన్న గురించి ఆలోచిస్తూ

* * *

లక్ష్మి కాపురానికి వచ్చి అప్పుడే నెల అయింది కాని అక్కడ పరిస్థితులు ఇప్పటికీ వంటపట్టించుకోలేకపోతోంది మొత్తం రాఘవయ్యగారిల్లు రెండతస్తుల భవనం ముందు, వెనుక చాల ఖాళీ స్థలముంది క్రింద వరండా, మధ్యలో హాలు, ఆనుకొనే నాలుగు గదులూ ఉన్నాయి మేడమీద రెండు గదులూ వరండా ఉన్నాయి రెండు గదుల్లో ఒకదాంట్లో తనూ, తన భర్త ఉంటారు రెండవ గది స్పేర్‌గా ఉంటుంది ఎవరైనా బంధువులొస్తే దాన్ని వాడుతారు క్రింద ఉన్న మూడు గదుల్లో ముగ్గురు అన్నదమ్ములూ, వాళ్ళ పిల్లలూ పడుకొంటారు వాళ్ళ వస్తువులూ, వాళ్ళ పిల్లల వస్తువులూ పెట్టుకొంటారు నాలుగవ గదిలో బట్టలూ అవీ, ఇనుప బీరువా మొదలయిన వస్తువులుంటాయి రాఘవయ్య దంపతులు బయట వరండాలో పడుకొంటారు హాల్లో కామన్ రేడియో ఉన్నా, ప్రతి ఒక్కరికీ పాకెట్ ట్రాన్సిస్టర్ ఉంది పగలంతా కలసి తిరిగినా, పడుకోబోయేటప్పటికి ఎవరి గదిలో వారు చేరుకొంటారు పెద్దా, చిన్నా కలసి పాతిక మందున్న పెద్ద కుటుంబం అది

క్రొత్త కోడలు కనుక తనకు ఇప్పటి వరకు పెద్దపెద్ద పనులు అంట గట్టడం లేదు తను ఇప్పుడు వంట రూములో కూరలు తరగడం వరకే చేస్తోంది అన్నం వండి వార్చడం, గిన్నెలు కడగడాలూ, పప్పురుబ్బడం, భోజనాలు పెట్టడం ఇవన్నీ అత్తగారు, పెద్దకోడలు చూసుకొంటున్నారు

మిగతా ఇద్దరి కోడళ్ల డ్యూటీ బట్టలుతకడం, టిఫిన్ కారియర్లు సర్ది పిల్లల్ని స్కూలుకు పంపడం లక్ష్మికి సన్నగా వణకు మొదలయింది ఆలోచిస్తుంటే తననూ బట్టలుతికే పనికి నియమిస్తారేమో! ఆ బావి దగ్గర రోజూ అంత ఎత్తున పడే వాటిని చూస్తుంటే భయం పుడుతూ ఉంది ఇంత అందమైన, నాజూకయిన తన శరీరం ఇంకేమయినా ఉందా అయినా పెళ్ళయిన వెంటనే వేరే కాపురం పెట్టక ఇదేమిట ? అనుకొంది

ఆ రాత్రి వల్లగా అసలు విషయం ఎత్తింది లక్ష్మి ప్రక్కలో బాంబు పడ్డట్లు ఫీలయ్యాడు వేణుగోపాల్

''ఏమిటి నువ్వనేది'' అన్నాడు చివరకు

''మనం వేరు కాపురం పోదామండీ అందరం దొడ్డి భోజనం కలసి చేయడం, సర్కస్ గుడారంలో లాగా పిల్లల అల్లరి ఒక ప్రశాంతమయిన వాతావరణం

లేదు ఇవన్నీ నాకు నచ్చవండి" మనసులోని మాట లన్నీ బయట పెట్టేసింది

వేణుగోపాల్ మౌనంగా ఉన్నాడు లక్ష్మి చిన్నగా ఏడుపు మొదలుపెట్టింది ఆమె ఏడుస్తూ ఉంటే వేణుగోపాల్‌కు ఏమిటేమిటోగా ఉంది 'ఎవరూ ఊహించని ఈ ఆలోచన ఈవిడకెలా వచ్చింది ఇది తెలిస్తే కుటుంబంలో అగ్నిప్రజ్వరిల్లదా' అను కొన్నాడు అందుకనే అనునయంగా భార్య భుజం మీద చేయివేసి తన వైపు త్రిప్పుకొని కళ్ళు తుడుస్తూ అన్నాడు,

"నీవు భ్రమలో ఉన్నావు ఇలా కలసి ఉమ్మడి కుటుంబంగా ఉన్నందువల్ల లాభాలు నీకర్థం కావడం లేదు అందరం కలసి వండుకొని తిన్నందువల్ల ఎంత ఖర్చు కలసి వస్తుందంటావ్ ఇంకో విషయం కూడా ఆలోచించు ఏ ఒక్కరూ అనారోగ్యంతో పనిచేయలేక పడుకొన్నా రోజులు హాయిగా గడచిపోతాయి పిల్లల అల్లరి ఎంత కాలక్షేపం పిన్నీ, బాబాయ్ అంటూ చుట్టూ తిరుగుతూ ఉంటే ఎంత ఆనందంగా ఉంటుంది ఒకరికొకరికున్న అనుభందం, ఆత్మీయతా కొంటే వస్తాయా ! పెద్దవాళ్ళున్న ఇంట్లో ఆడ వాళ్ళకుగాని, మగవాళ్ళకుగాని వినయము, విధేయత, క్రమశిక్షణా అలవడుతాయి స్వార్థానికి తావు అసలే ఉండదు ఒక వేళ నేను అర్థాంతరంగా చనిపోయానే అనుకో " టప్పున అతని నోరు మూసింది తన చేత్తో

"అలాంటి మాటలు నాతో మాట్లాడొద్దు"

"నేను ఉదాహరణకే చెప్పింది సరే నా విషయం వదిలెయ్ మా నాన్నా, బాబాయ్ కలసి ఇదే ఇంట్లో ఒకే కుటుంబంగా కాపురం చేసేవాళ్ళు మా బాబాయ్, పిన్నీ ఒకసారి సినిమా నుంచి రిక్షాలో వస్తూ ఏక్సిడెంటులో పోయారు అయినా మా రామం అన్నయ్యను మా నాన్నే పెంచి పెద్దచేశాడు అందుకే నే చెప్పేదేమిటంటే కలసి ఉంటే పిల్లల జీవితాలకో భద్రత ఉంటుంది" ఊపిరి పీల్చుకొన్నాడు

"అంతేగాని నా మాట విననంటారు"

"నీవు నన్నక్కడే అర్థం చేసుకోంది విన వలసిందయితే ఎందుకు వినను లక్ష్మీ"

"సరే ఉమ్మడికుటుంబంలో మీక్కనిపించిన లాభాలు అవే అయితే, నష్టాలు కష్టాలు కూడా వినండి పగటిపూట భర్తతో ! మాట మాట్లాడుకొనే స్వాతంత్ర్యం లేదు ఎవరి పిల్లలు ఎలా విసిగించినా నోరు మూసుకొని పడుండాలి నోరెత్తితే చాడీలు చెప్పినట్లవుతుంది మీరను కొన్నట్లు కుటుంబాలకు భద్రత కాదుగదా సోమరి తనం ఏర్పడుతుంది అవతలివాడు చేస్తున్నాడుగదా నేనెందుకు చేయాలి అనుకొంటారు మొన్నటికి మొన్న మీ పెద్ద వదిన వారంరోజులు రూములో పడుకొంది నిజానికి వంట్లో బాగులేదో లేక దొంగ వేషమో ఎవడికి తెలుసు ? ఎవరు ఎక్కువ సంపా దించినా తక్కువ సంపాదించినా ఇక్కడ అందరూ సమానమే మనం వాళ్ళ జీతాలకంటే ఎక్కువ సంపాదిస్తున్నాం అయినా ఏం లాభం ? వచ్చిన ఆదాయం తాను సంపాదించేది కాదుగా బట్టి యజమానికి పొదుపు చేయాల్సిన అవశ్యకత అంతగా కనబడదు ఇవన్నీ కలసి ఉంటే ఉండే నష్టాలు "

లక్ష్మి ఇచ్చిన సుదీర్ఘమైన ఉపన్యాసాన్ని ఎటూ అర్థం చేసుకోలేక ఆలోచనలో పడిపోయాడు వేణుగోపాల్ ఒక విధంగా ఆలోచిస్తే లక్ష్మి చెప్పేది నిజమేనేమోనని అనిపిస్తుంది మరొక విధంగా ఆలోచిస్తే ఇది అన్యాయం అనిపిస్తోంది కాని లక్ష్మికి ఎదురు జవాబు చెప్పాలంటే తన దగ్గర చెప్పవలసినవేమీ లేవని నిర్ణయించుకొన్నాడు కాని తనకు వేరు కాపురం పోతానని చెప్పగలిగే ధైర్యం లేదు

"కొంతకాలం ఆగు ఆలోచిస్తున్నాను" అన్నాడు చివరకు

లక్ష్మి ఈ మాటలకు ఎంతో ఆనందించింది, ఈ మాత్రమైనా మార్పు వచ్చినందుకు ఇది నిజానికి చిన్న మార్పేమీగాదు చాల పెద్దమార్పే ఈ మార్పును ఇలాగే రోజూ కొద్ది కొద్దిగా తెచ్చి చివరకు అనుకొన్నది సాధించవచ్చు ఇలాంటి ఆలోచనలు రాగానే ఆమె కారోజు తృప్తిగా నిద్ర పట్టింది

ఆమెతో సరేనన్నాడేగాని, వేణుగోపాల్‌కు ఓ వైపు భయంగానే ఉంది అంతమంది అన్నలు కలసి ఉంటున్నప్పుడు తను ఈ విషయం ప్రస్తావనకు తెస్తే అందరిలోకి తనే చెడ్డవాడవుతాడు అందుకే మెదలకుండా ఊరుకొన్నాడు లక్ష్మి ఏ రోజుకారోజు విషయం కదుపుతూనే ఉంది వేణుగోపాల్ 'అలాగే' అంటూ కాలం గడుపుతూనే ఉన్నాడు క్రమేణా లక్ష్మికి కూడా పనిభారం కాజొచ్చింది ఎలా తప్పించుకోవాలా అని ఆలోచిస్తున్న లక్ష్మికి నెల తప్పడం ఒక దారి చూపినట్లయ్యింది తనను తీసుకెళ్ళమని రహస్యంగా ఇంటికి ఉత్తరం వ్రాసింది

లక్ష్మి తండ్రి ఓ మాదిరిగా ఉన్నవాడు మూడవ నెలలో కూతుర్ని తీసుకువెళ్ళడానికి వచ్చాడు

"మరేం ఫర్వాలేదు తమ్ముడూ ! ఈ ఇల్లు బాగా కలసి వచ్చింది అమ్మాయి ఇక్కడే ఉంటుంది కాన్పుకూడా ఇక్కడే చేసుకొంటుంది ఇంతమందిమి ఉన్నాంగదా నీకేం భయంలేదు" అంది లక్ష్మి అత్తగారు

"మాకూ ఎవరున్నారు అక్కయ్యా ! ఉన్నది ఒక్కతే కూతురు అచ్చటా ముచ్చటా తీర్చు కుందాం, అమ్మాయిని తీసుకురండని నా భార్య ఒకటే గోల" జవాబిచ్చాడాయన

"అట్లాంటివేం పెట్టుకోకు కావాలంటే అయిదవనెల్లో తీసుకెళ్ళి ఓ పదిరోజులు పెట్టుకోండి మేం వచ్చి తీసుకొచ్చుకొంటాం" అంది అభిమానంగా లక్ష్మి తండ్రి ఏం మాట్లాడలేదు

మధ్యాహ్నం భోజనం చేసిన తరువాత తండ్రిని తన గదిలో కూర్చోబెట్టి కొద్దిసేపు మంతనా లాడింది ఆ రోజు సాయంత్రమే ఆయన వెళ్ళి పోయాడు

ఆ రోజు రాత్రి భర్తకు విషయమంతా చెప్పి, అయిదవ నెల రాగానే తాను పుట్టింటికి వెళ్తున్నానని, ఈ సమస్యను ఎలాగయినా పరిష్కరించాలని కోరింది వేణుగోపాల్ సరేనన్నాడు ఎప్పటిలాగే నవ్వుతూ ఆమె కిప్పుడొక పరిష్కారమంటూ దొరికింది అతనికీ ఈ సమస్యను తేల్చడానికి ఇదే సమయమనీ అనిపిం చింది రోజులు అలా గడచిపోతున్నాయి అయిదవ నెల రాగానే లక్ష్మిని తీసుకువెళ్ళాడు ఆమె తండ్రి

అనుకొన్న ప్రకారం పది రోజుల తర్వాత తీసుకురావడానికి వెళ్ళిన మామగారితో లక్ష్మి కాన్పు అయ్యేవరకూ ఇక్కడే ఉంటుందని చెప్పారు ఆమె తల్లిదండ్రులు కోడలు అభిప్రాయము కూడా అదే అయ్యేసరికి ఇంకేం చెప్పలేక గమ్మున వచ్చేసాడు భార్య దగ్గరకు నెలకోసారి పోయి వస్తున్నాడు వేణుగోపాల్ తొమ్మిదవ నెలలో ఆమెను హాస్పిటల్‌లో అడ్మిట్ చేసారు ఆమె మగశిశువును ప్రసవించింది

ఇంటిల్లపాదీ బారసాలకు వెళ్ళారు కోడల్ని తీసుకుపోయే విషయమై కదిలించాడు రాఘవయ్య 'ఇప్పుడేం తొందర వస్తుందిలే' అంటూ సర్దిపంపారు ఆమె తల్లిదండ్రులు కొడుకు పుట్టగానే భార్యకు మరీ చేరువైపోయాడు వేణుగోపాల్ ఏది ఏమయినా భార్య చెప్పినట్లు వినాలనుకొన్నాడు తన సుఖం కోసమే కదా ఆమె ఆలోచించేది అనే నిర్ణయానికి వచ్చాడు

ఆ రోజు ఉదయమే బట్టలుతుకుతున్న ఆడవాళ్ళకు వేణుగోపాల్ షర్టు జేబులోంచి లక్ష్మి వ్రాసిన బాంబు లాంటి ఉత్తరం బయటపడింది దాన్ని చదివి జాగ్రత్తగా మామగారికి అందించింది రెండవ కోడలు రాఘవయ్యగారికి దాన్ని చూడగానే గుండె ముక్కలయింది అందులో ఉంది నాలుగే నాలుగు పదాలయినా అవి కాల్చిన ఇనుప ముక్కలు 'వేరే కాపురముంటేనే తప్ప నేనిక్కడ్నుంచి రాను' అనేది ఉత్తరంలోని సారాంశం జరగే పరిణామాల గురించి ఆలోచిస్తున్న రాఘవయ్యకు ఇలాంటి ఉత్తరాలే ఒకే నెలలో మరి రెండు అందాయి ఇక తప్పదు అమ్మాయి మనసులో ఇదన్నమాట ఉండేది ఎన్నో తరాలుగా ఈ ఇంట్లోనే తమ వంశం అభివృద్ధి చెందింది కాని ప్రస్తుతం చెడ్డరోజులు వచ్చాయి

ఆ రాత్రి సంగతి చెప్పమని నిలదీసి అడిగాడు వేణుగోపాల్‌ని వేణుగోపాల్ ఆయన చెప్పేదంతా నిజమేనని, లక్ష్మి వేరు కాపురం పెట్టమని పెళ్ళయి నప్పట్నుంచీ పోరుతుందని, తనకే మాత్రమూ ఇష్టంలేదని అంటూ ఆమెమీద నెట్టి చెప్పాడు అన్నలందరూ తిట్టారు సంసార గౌరవం నాశనం చేసేదని తల్లి దుర్దినాలు వచ్చాయని ఏడ్చింది కోడళ్ళు చెవులు కొరుక్కున్నారు ఎప్పుడూ చూడని ఈ సంఘటనని ఆశ్చర్యంగా చూస్తున్నారు పిల్లలు

ఏం మాట్లాడకుండా ఊరుకొన్న రాఘవయ్య మరుసటి రోజే పెద్దకొడుకుని తీసుకొని లక్ష్మి వాళ్ళ ఊరు వెళ్ళాడు ఎంతో చెప్పి చూసారు ఆమె అమ్మా, నాన్నలకు లక్ష్మి మామగారితో ఎక్కువ మాట్లాడే అవకాశం కలిగించలేదు తలనొప్పి అనే సాకుతో ఆ రోజంతా తప్పించుకు తిరిగింది వేరు కాపురం పెడితేనే తప్ప తమ కూతుర్ని పంపమని చెప్పారు ఆమె తల్లిదండ్రులు దాంతో నిరాశా నిస్పృహలతో ఇంటికి తిరిగివచ్చారు

దారిలో పెద్దకొడుకుతో మాట్లాడి వేణుగోపాల్‌ను వేరుగా పెట్టడమే మంచిదనే నిర్ణయానికి వచ్చాడు ఆ రాత్రి అందరూ వేణుగోపాల్ దురదృష్టవంతుడని, కష్టాల్లో పడబోతున్నాడని అన్నారు వేణుగోపాల్ ఏం

మాట్లాడలేదు రాఘవయ్య తనే స్వయంగా తిరిగి అన్ని హంగులున్న చిన్న డాబా ఇల్లు కుదిర్చి పెట్టాడు బాడుగ రెండు వందలు అంత పెద్ద పట్టణంలో ఆమాత్రం బాడుగకు దొరకడం నిజంగా ఒక వరం వేణుగోపాల్ తల్లి, పెద్దకోడలు కొత్త ఇంట్లో పాలు పొంగించారు రాఘవయ్య ఇంటికి కావలసిన కొన్ని వస్తువులు కొనిచ్చాడు అంతవరకూ వేణుగోపాల్ సంపాదనలో మిగిల్చి పొదుపు చేసిన ఆరువేల రూపాయలు మొత్తమున్న బాంకు పాసుబుక్కు ఇచ్చాడు రామవయ్య

*  *  *

లక్ష్మికి ఇప్పుడు చాల ఆనందంగా ఉంది రాఘవయ్య దంపతులు అప్పుడప్పుడూ వచ్చి పలుకరించి వెళుతున్నారు మిగతా కోడళ్లు లక్ష్మి కాపురానికి వచ్చినప్పుడు మాత్రమే చూచి వెళ్ళారు మళ్ళీ ఈ మధ్య ఎప్పుడూ రాలేదు వాళ్ళందరికీ వేణుగోపాల్ వేరుపోయి కుటుంబ గౌరవాన్ని నాశనం చేసాడన్న ఆలోచన తప్ప మరేమీలేదు

ఆ రోజు వేణుగోపాల్ తన కొడుక్కి మొదట జన్మదినోత్సవ పండుగ చేస్తున్నాడు అంతకు ముందురోజే భర్తతో బిడ్డను తీసుకువెళ్ళి, తోడి కోడళ్ళను, అత్తగారిని, మిగతా కుటుంబాన్నంతా ఆహ్వానించింది లక్ష్మి దాంతో అందరికీ అక్కడకు వెళ్ళక తప్పలేదు

బంధువులతోనూ, స్నేహితులతోనూ ఆ ఇల్లు నిండిపోయింది బయటవేసిన షామియానా క్రింద ఎక్కువమంది కూర్చొన్నారు పండుగ సాయంత్రం ఆరుగంటలకల్లా పూర్తయింది అందరూ తాము తెచ్చిన ప్రెజంటేషన్సు ఇచ్చి, కాఫీ టిపిన్‌లు పూర్తిచేసి వెళ్ళిపోయారు లక్ష్మి తోడికోడళ్ళు తమ పిల్లల్ని భర్తలతో పంపి లక్ష్మి కోరికమీద అక్కడే ఉన్నారు

''లక్ష్మీ! ఈ ఇరుకు రూముల్లో ఎలా ఉంటున్నారు మీరు'' అడిగింది పెద్దకోడలు

''బిడ్డను పెట్టుకొని అంతపనీ నీ ఒక్కదానవే చేసుకోగలుగుతున్నావా'' ఆశ్చర్యంగా అడిగింది రెండవ కోడలు

''మీకు వచ్చే ఆదాయం భోజన ఖర్చులకు, ఇంటి బాడుగకు ఎలా సరిపోతుంది'' సందేహం వెలిబుచ్చింది మూడవ కోడలు

అందరి ప్రశ్నలకూ సమాధానంగా చిరునవ్వు నవ్వింది లక్ష్మి ''ఏదైనా మనం చేసుకొనేదాంట్లోనే ఉంది బావిలోని కప్ప బావే ప్రపంచం అనుకొన్నట్లు, మనం ఒక రకమయిన వాతావరణానికి అలవాటు పడి, అదే బాగుందనుకొంటే ఏం లాభం ? కళ్ళెత్తి ప్రపంచాన్ని పరిశీలించాలి ప్రజలు ఎలా పోతున్నారో గమనించి, క్రొత్తదనం కోసం ప్రాకులాడాలి ఇప్పుడు నాకు మీరనుకొన్నట్లు ఏ బాధలూ లేవు పగలంతా పత్రికలతో, బాబుతో కాలక్షేపం రోజూ సాయంత్రం షికారుకి, ప్రతి ఆదివారం సినిమాకి పోతున్నాం ఇందులో మేం ఇబ్బంది పడేదేంలేదు ఒక విధంగా వేరుపడడం, మేం ఆనందంగా ఉండడం కోసమేమోనని ఇప్పుడనిపిస్తూంది ?'' అంటూ చెప్పింది అంతేగాని తన బాంకు బాలెన్సు కరిగి పోయిన సంగతి చెప్పలేదు

# యోగ్యుడు

అందరూ ఆ సమయానికి తలలూపి ఇల్లు చేరుకున్నా, వాళ్ళ మనసుల్లో గూడు కట్టుకొన్న భావాలు నుడులు తిరగడం మానలేదు లక్ష్మివాళ్ళ ఇంట్లో వంటరూములోని డైనింగు టేబులూ, కుక్కరూ, గ్రైండరూ, బీరువా నిండా పేర్చి ఉన్న రకరకాల చీరలు వాళ్ళ కళ్ళముందు కదలసాగాయి అక్కడ గోడలకు రకరకాల వర్ణచిత్రాలు వ్రేలాడు తూంటే, ఇక్కడ ఏ కాలం నాటివో దేవుడిబొమ్మలు వెలసిపోయినట్లున్నాయి.. వారికారోజు నిద్రపట్ట లేదు తాము కూడా విడిపోయి ఎవరికి వాళ్ళు స్వతంత్రంగా బ్రతకాలని నిర్ణయించుకొన్నారు ఆ రోజునుంచి భర్తల్ని అదేపనిగా సాధించసాగారు ఆలోచించే కొద్దీ మగవాళ్ళకు కూడా అదే మంచి దనిపించింది తమ్ముడి సంసారం చూసిం తర్వాత

అప్పటివరకూ వారికి కనపడని నష్టాలు ఇప్పుడాయింట్లో కనిపించసాగాయి తను చేసే ప్రతిపనీ, సంపాదించే ప్రతిపైసా అవతలి వాళ్ళ కోసమే అనేటువంటి భావం ప్రతి ఒక్కరిలోనూ ఏర్పడింది ప్రతి ఒక్కరిలోనూ అనవసరమైన విసుగు, మొత్తానికి ఆ వాతావరణమంతా విష తుల్యమైపోయింది ఒకరితో ఒకరు మాట్లాడుకొనే మాటల్లో కూడ ఆప్యాయత లేదు రాఘవయ్యగారు తెలివిగలవారు కనుక మార్పును అతి త్వరలోనే పసిగట్టగలిగేరు దీనికంతటికీ కారణం లక్ష్మి నాటిన విషబీజాలేనని తెలుసు అందుకే అవి పెరగక ముందే త్రుంచి వేయాలనే ఉద్దేశ్యంతో ఆ రోజు రాత్రి అందర్నీ సమావేశపరచి అసలు విషయం ఎత్తాడు

తమకై తాము చెప్పలేక నానా అవస్థలు పడుతున్న అన్నదమ్ములు, తండ్రి ఇలా అడిగే సరికి కొంత ధైర్యం చిక్కి, తాము వేరు పోవాలను కొంటున్నట్లు స్పష్టంగా చెప్పారు తాను దీనివల్ల జరిగే అనర్థాలను చెప్పాలనుకొన్నా, వాళ్ళు వినేస్థితిలో లేరని, తెల్లవారగానే హైదరాబాదులో ఉన్న రామానికి టెలిగ్రాం కొట్టాడు వెంటనే బయలుదేరి రమ్మని

మరుసటి రోజు ఉదయం పది గంటలకల్లా హాజరయ్యాడు రామం అంతకు ముందు వేణుగోపాల్ వేరుపోయినప్పుడు భార్యాభర్తల్ని నాలుగు చీవాట్లేసి వాళ్ళ దృష్టిలో దుర్మార్గుడనిపించుకొని వెళ్ళిపోయిన రామం ఈసారి నాలుగు రోజులు సెలవు పడేసి మరీ వచ్చాడు 'ఈ సంసారానికి ఏదో గ్రహణం పట్టింది వీళ్ళకు ప్రశాంతంగా బ్రతికే రోజులు లేవు, మనసు లోనే అనుకొన్నాడు

వేరుపోతే చాల బాధలు పడాల్సి వస్తుందని, ఉమ్మడి కుటుంబాలు పొదుపుకు ఉదాహరణలయితే, విడి కాపురాలు ఖర్చుకు నిదర్శనాలని, ఉదాహరణకు తాను పెద్ద దిక్కులేక ఎన్ని అవస్థలుపడేదీ వివరిం చాడు కాని ఇదంతా వాళ్ళకు చెవిటి వాడిముందు శంఖం ఊదినట్లయ్యింది ఒకవేళ అలాంటి దేదయినా ఉంటే, అందరిలాగే తామూ ఇబ్బందులు పడటానికి సిద్ధమేననీ బదులు చెప్పారు

రాఘవయ్య కళ్ళలో నీళ్ళు నిండుకొన్నాయి జానకమ్మ నిస్తేజంగా చూస్తూ ఉండిపోయింది తమంత ఎదిగిన కొడుకులు వాళ్ళకు తాము చెప్పే స్థితిలో లేరు వాళ్ళు చెప్పినట్లు వినాల్సిన వయసులో ఉన్నారు తాము వాళ్ళ మానసిక సంఘర్షణకు విచలి తుడైపోయాడు రామం పెద్దమ్మ, పెదనాన్న తనను కొడుకుల కంటే ఎక్కువగా చూశారు అందు లోనూ ఈ ఇంట్లో ఆస్తి తనకు సగం రావాలి మిగతా సగంలో పెదనాన్న అతని కొడుకులూ పంచు కోవాలి కనుక తనకూ కొంత బాధ్యత ఉంది ఈ విషయంలో వీలున్నంత వరకూ పెదనాన్నను ఆదుకోవడం తన ధర్మం అనుకొన్నాడు

చర్చలూ, ప్రతి చర్చలూ సాయంత్రం వరకూ జరిగి ఒక నిర్ణయానికి వచ్చారు దాని ప్రకారం రాఘవయ్య దంపతులు రామం దగ్గర ఉండడం ప్రస్తుతమున్న ఇల్లు బాడుగకు ఇచ్చి, అది రాఘవయ్య పోషణార్థం ఉంచి, కొడుకులు వాళ్ళ సంసారాలతో ఇష్టమొచ్చిన చోట ఉండవచ్చు దానికి అంతా సమ్మతించారు రాఘవయ్య దృష్టిలో ఒక మహా వృక్షపు వ్రేళ్ళను తెగనరికి దాన్ని కూల్చి, కొమ్మలను, కాండాన్ని ముక్కలు చేసి కుప్పలుగా పెట్టి, ఒక్కో కుప్ప, ఒక్కో చోటికి తరలించినట్లయ్యింది తన దగ్గరున్న బాంకు పాసుపుస్తకాలు ఎవరివి వాళ్ళకు పంచాడు రాఘవయ్య

*  *  *

రోజులు చకచకా గడచిపోతున్నాయి రాఘవయ్య గారు, జానకమ్మ రామం ఇంటికి వచ్చి అప్పుడే నాలుగు సంవత్సరాలయింది వాళ్ళకు రామం ఇంట్లో పోగొట్టుకొన్నదేదో దొరికినట్లుగా ఉంది రామం ఇచ్చే గౌరవం, కోడలు వాళ్ళ మాటలకు విలువ నివ్వడం, పిల్లలు తాతయ్యా, నాన్నమ్మా అంటూ వెంటబడడం చాల ఆనందంగా ఉంది రామం పెదనాన్నకు వచ్చే అద్దె తాలూకు డబ్బును, ఆయన పేరనే బాంకులో పొదుపు చేస్తున్నాడు

ఆరోజు ఉదయాన ఆఫీసుకు బయలుదేరబో తూండగా ఓ కవరు అందించాడు పోష్టుమన్ అందులో నాలుగు కాగితాలు ఉన్నాయి నలుగురు కొడుకులూ మాట్లాడుకొని వ్రాసినట్లుంది

పెద్దకొడుకు వ్రాసిన దాంట్లో బాంకు బాలెన్సుతో ఎట్లాగో మూడేళ్ళు నెట్టుకొచ్చేడని, తరువాతనే కష్టాలన్నీ ఆరంభమయ్యాయని, అందరి లోకీ తక్కువ జీతం పొందుతున్న తాను, ఇంట్లో ఖర్చులకు, పిల్లల స్కూలు ఫీజులకు తట్టుకోలేక కొంత అప్పుల పాలయ్యాడనీ, ఇంకొంత కాలంపోతే అప్పిచ్చేవాడే దొరకడని తెలియజేసాడు చివరగా తను నాలుగు కుటుంబాలనూ కలిపి పూర్వంలాగే ఉండేట్లు చేయమనీ కోరాడు

రెండవ కొడుకు వ్రాస్తూ, తాను పేరుకు బాంకు ఉద్యోగస్థుడయినా, మిగతా అన్నదమ్ముల కంటె జీతమెక్కువ వస్తున్నా భార్య ఖర్చులకు తట్టుకోలేక అప్పులపాలవబోతున్నాడని, ఇంతకు ముందు నెలకు రెండుసార్లు వెళ్ళేది సినిమాకి, ఇప్పుడు వారానికి రెండుసార్లయినా వెళ్ళాలని పట్టుబడుతున్నదని, పూర్వం తన తండ్రి ఏ చీరలు తెస్తే అవే కడతూండేదని, ఇప్పుడు కనబడ్డ ప్రతి వెరైటీ కావాలని కోరుతూందని, తనను ఈ ఆపద లోంచి తప్పించాలంటే అందరితో కలసి పూర్వం మాదిరిగా ఉండేట్లు చేయడమేననీ వివరించాడు

మూడవ కొడుకు ఉత్తరంలో, తాను మొదట రెండు వందలా యాభై రూపాయల అద్దె ఇంట్లో

ఉండేవాడని, కాలక్రమేణా ఇప్పుడు వంద రూపాయల అద్దె ఇంట్లో ఉంటున్నాడని, దీన్నిబట్టి తన ఆర్థికస్థితి అర్థం చేసుకోమని వ్రాశాడు పిల్లలు మాట వినడంలేదని, ఎక్కడ జేబు దొంగలగా తయారవుతారోనని భయంగా ఉందని, తమని మళ్ళీ కలిపి పుణ్యం కట్టుకోమని కోరాడు

వేణుగోపాల్ వ్రాస్తూ, తాను నిక్షేపంలాంటి ఉమ్మడి కుటుంబం చీలడానికి కారణమైనందుకు తగిన శాస్తి జరిగిందని భార్య పశ్చాత్తాప పడుతున్నదని, మామగారు అంగీకరిస్తే క్షమాపణ చెప్పుకొని అందరితో కలసి ఉండడానికి సిద్ధంగా ఉందని తెలియజేసాడు ఇంట్లో పని భారం కావడంతో భార్యకు అప్పుడప్పుడూ గుండెనొప్పి వస్తున్నదని, వైద్యం చేయిస్తున్నాడని వ్రాసాడు ఇలా మెడికల్ షాపు వదలి ఇంటి పనుల్లో ఉండటంతో వ్యాపారం సరిగా జరగటంలేదని, అప్పుల పాలవబోతున్నాడని, ఇది చూసి మామగారు కూడా రావడం తగ్గించేరని, ఎలాగయినా అందర్నీ ఒకటి చేసి, ప్రశాంతంగా కాపురముండేట్లు చేయమని కోరాడు

ఉత్తరాలన్నీ పెదనాన్న, పెద్దమ్మకు చూపించాడు రామం

రాఘవయ్య ఒక్కసారి నిట్టూర్చి, "బాబూ! ఈ మార్పు తాత్కాలికమే వీళ్ళ మనసులు మళ్ళీ కొంతకాలం తర్వాత అయినా మారక తప్పవు అయినా మేము ఇప్పుడు కలసి ఉన్నా, పూర్వం మాదిరిగా వాళ్ళు నా మాట వినరు నీవు ధన్యుడవు నీ దగ్గరనే మా జీవితాల్ని చరమాంకం వరకు వెళ్ళబుచ్చాలనే నిర్ణయానికి ఎప్పుడో వచ్చాము"

"అయితే వాళ్ళ పరిస్థితి ఏమిటి పెదనాన్నా" బాధగా అడిగాడు రామం

"ఏముంది బాబూ! నీవు రేపే వెళ్ళి, మన ఇల్లు ఖాళీ చేయించి వాళ్ళనందులో ఉండమను కొడుకులు కాబట్టి మేము అప్పుడప్పుడూ వెళ్ళి చూసొస్తుంటాము అంత మాత్రమే" ఖండితంగా చెప్పేడు జానకమ్మ తల ఊపింది సెలవుపెట్టి ఆ రోజే బయలుదేరాడు రామం

* * *

ఇప్పుడు రాఘవయ్యగారి నలుగురు కొడుకులూ కలిసే ఉంటున్నారు ఒకే ఇంట్లో ఉంటున్నా వేరు వేరు కాపురాలు నిద్ర లేచింది మొదలు పడుకొనేంత వరకూ తీరని శ్రమ చిన్న పిల్లల తగాదాలు కొప్పడితే అన్నదమ్ముల మధ్య ఈర్ష్యా ద్వేషాలు ఒక కోడలు మీద ఒక కోడలు చెప్పుకొని చెవులు కొరుక్కోవడం ఇల్లంతా రణగొణ ధ్వనులు ఒక నిర్ణీత పద్ధతిలేదు ఒక బాధ్యత లేదు ఒక క్రమశిక్షణలేదు రోజులు గడపడమే తమ ధ్యేయంగా జీవిస్తున్నారు వాళ్ళు ఆ పట్టణంలో అందరితో బాటు 

సీరియల్

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం. కొలను వెంకట దుర్గాప్రసాద్



(గత సంచిక తరువాయి)

## డాక్టరు సెవార్డు డైరీ

(సెప్టెంబర్, 20 లోని భాగం)

మూలకు విసిరివేయబడ్డ ఆర్థర్ అయోమయంలో పడిపోయాడు కొన్ని క్షణాల పాటు అతనికి ఏం చెయ్యాలో, ఏం అనాలో తోచలేదు అతనిలో రౌద్రం నిద్రలేవకముందే, తన పరిస్థితి ఏమిటో, తను ఎక్కడున్నాడో, సందర్భం ఎటువంటిదో గ్రహించి మౌనంగా లేచి నిలబడ్డాడు

కళ్ళు మరల్చకుండా లూసీని చూస్తున్నాను వాన్ హెల్సింగు కూడా అంతే ఆమె శరీరం కుంచించుకు పోతున్నట్టు ఇద్దరం గమనించాం ఆమె మొహంలో ప్రేతకళ వస్తోంది ఆమె పదునైన పళ్ళు బిగుసుకున్నాయి కళ్ళు మూతలు పడ్డాయి వూపిరి భారంగా తీస్తోంది

కొన్ని క్షణాల్లో మళ్ళీ కళ్ళు తెరిచింది ఆమె చూపుల్లో నెమ్మదితనం కనిపించింది రక్తం లేని సన్నటి చెయ్యిని చాచి వాన్ హెల్సింగ్ చెయ్యిని పట్టుకుని దగ్గరకు లాక్కుని దాన్ని ముద్దుపెట్టుకుంది "మీరు నాకు నిజమైన స్నేహితులు! అతనికి కూడా మీరు నిజమైన స్నేహితులే! మీరు అతన్ని కాపాడాలి నాకు శాంతిని ప్రసాదించాలి" అంది ఆమె స్వరం విషాదంతో నిండిపోయి బలహీనంగా వుంది

"అలా ప్రమాణం చేస్తున్నాను!" ఆమె ప్రక్కన మోకాళ్ళమీదకు వంగి చెయ్యి పైకెత్తి శపథం చేస్తున్నవాడిలా అన్నాడు అతను ఆర్థర్ వంక తిరిగి "నువ్వు కూడా రా నాయనా! ఆమె చెయ్యి పుచ్చుకో ఆమె నుదురుపై ముద్దుపెట్టు, ఒక్కసారి మాత్రం" అన్నాడు

వారి పెదాలకు బదులు, కళ్ళు కలిశాయి ఇద్దరూ విడిపోయారు

లూసీ కళ్ళు మూసింది ఆమెను జాగ్రత్తగా గమనిస్తూవున్న వాన్ హెల్సింగ్ ఆర్థర్ చెయ్యి పుచ్చుకుని వెనక్కిలాగాడు లూసీ వూపిరి తీయటం గురకగా మారి టక్కున ఆగిపోయింది

"అంతా అయిపోయింది ఆమె చనిపోయింది" అన్నాడు వాన్ హెల్సింగ్

నేను ఆర్థర్ చెయ్యి పుచ్చుకుని డ్రాయింగు రూములోకి తీసుకెళ్ళాను అక్కడ అతను కూర్చుని మొహాన్ని రెండు చేతుల్లో దాచుకున్నాడు అతని ఏడుపు చూస్తుంటే, నేను నిలబడలేక పోయాను

మళ్ళీ గదిలోకి తిరిగి వెళ్ళాను వాన్ హెల్సింగ్ లూసీ మొహంలోకి గంభీరంగా చూస్తూ వున్నాడు ఆమె శరీరంలో కొంత మార్పుకనపడింది చావువల్ల ఆమెలో కొంత అందం వచ్చినట్టు అనిపించింది ఆమె బుగ్గలు పూర్వంలా వున్నాయి ఆమె పెదాలు కూడా కాస్త ఎరుపును సూచించాయి ఆమె గుండె పని చెయ్యటానికి ఇక రక్తం అవసరం లేనట్టుగా, ఆ రక్తం ఆమె మొహంలోకి వచ్చి ప్రేతకళను తగ్గించినట్టు అనిపించింది

"చనిపోయిందనుకున్నాం, ఆమె నిద్ర పోతుండగా,

నిద్రపోయిందనుకున్నాం, ఆమె చనిపోయినప్పుడు"

నేను వాన్ హెల్సింగ్ పక్కన నిలబడి "పాపం, ఆ అమ్మాయికి ఇప్పటికి పూర్తి విశ్రాంతి లభించింది" ఇక అంతా అయిపోయినట్టే" అన్నాను

అతను నా వంక తిరిగి "అయ్యో, కాదు నాయనా! అసలు ఇప్పుడే ప్రారంభమయింది" అన్నాడు

అతని మాటలకు అర్థం ఏమిటని అడిగితే, అడ్డంగా తలూపుతూ "ఇప్పుడు మనం చేసేదేమీ లేదు ..రగబోయేది వేచి చూడాలి" అన్నాడు

లూసీ, ఆమె తల్లి శవాలను ఖననం చెయ్యటానికి ఆ రోజు కాకుండా మరుసటి రోజుకి ఏర్పాట్లు చేయబడ్డాయి వీరి మరణాలకు సంబంధించిన బోళ్ళన్ని చట్టపరమైన విషయాలు నేనే చూసాను శవాల్ని ఖననం చేసేవాడు అతని మనుషులు వచ్చి ఎంతో శ్రద్ధగా, ఆప్తులకు చేసినట్టు చేసారు ఖననానికి సంబంధించిన ఏర్పాట్లు చెయ్యటంలో ఒకామె పాత్ర వుంది ఆమె పని అంతా అయిన తర్వాత లూసి గదినుండి, బయటకు వచ్చి నాతో రహస్యంగా అంది, "ఆమె శవం రూపంలోనైనా చాలా అందంగా వుంది ఆమెకు కర్మకాండయు చెయ్యటంలో పాలుపంచుకొనగలిగినందుకు వింత అనుభూతి పొందాము"

వాన్ హెల్సింగ్ వెళ్లిపోలేదు లూసీవాళ్ల ఇంట్లో పరిస్థితి అస్తవ్యస్తంగా తయారవటంతో అతను ఎక్కడికీ వెళ్లలేకపోయాడు అందుబాటులో బంధువులెవరూ కనిపించలేదు ఆర్థర్ మరుసటి రోజు వెళ్లిపోవాల్సి వచ్చింది తన తండ్రిపోవటంవల్ల ఇక ఈ ఇల్లూ వాకిలీ ఎవరికి అప్పగించి వెళ్లాలో తెలీలేదు ఇట్లాంటి పరిస్థితిలో వాన్ హెల్సింగ్, నేనూ ఇంట్లోని కాగితాలు పరీక్షించడం మొదలు పెట్టాం లూసీకి సంబంధించిన కాగితాలన్నీ తనే చూస్తానని వాన్ హెల్సింగ్ చెప్పాడు అతను విదేశీయుడు ఇంగ్లీషువాళ్ల చట్టానికి సంబంధించిన వ్యవహారాలు అతనికి సరిగ్గా తెలీదేమోకూడా అలాంటప్పుడు ఆ కాగితాలు చూసి తనకు తెలియకుండానే సమస్యలు సృష్టించవచ్చు నా భయాన్ని వ్యక్తం చేసాను

"తెలుసు, తెలుసు నేను లాయరా, డాక్టరా అన్న విషయం మర్చిపో ఇప్పుడు నేను చూసేది చట్టానికి సంబంధించిన విషయం కాదు ఆ విషయం నీకూ తెలుసు ఇక్కడ ఇంకా కొన్ని కాగితాలు వుండొచ్చు ఇట్లాంటివి" అంటూ తన జేబులోంచి పాకెట్ బుక్ తీసి అందులోంచి చించిన కాగితాల ముక్కలు తీసాడు అది లూసీ రాసి వుంచిన ఉత్తరం, తనే నిద్రలో చించేసింది

"ఆస్తిపాస్తులకు సంబంధించిన కాగితాలు ఏవైనా దొరికితే అవి సీలువేసి సొలిసిటర్‌కు ఈ రాత్రే పంపించు నేను ఇక్కడా, లూసీ వున్న పాతగదీ ఈ రాత్రంతా వెతుకుతాను, ఉపయోగం వున్నా లేకపోయినా లూసీ కాగితంపై పెట్టిన ఆలోచనలు ఇతర్లకు తెలియటం మంచిదికాదు" అన్నాడు

వాన్ హెల్సింగ్ చెప్పినట్టుగా నా పనిలో నేను మునిగిపోయాను అర్ధగంట తర్వాత లూసీ తల్లి

---

**జరిగిన కథ – 17 :** లూసీ ఆరోగ్యం గురించి జాన్ సెవార్డు ఆర్థర్ హాల్మ్‌వుడ్‌కి తెలియజేస్తుంటాడు లూసీ పరిస్థితి దయనీయంగా వుంది ఆమె వంట్లో రక్తం చాలా తక్కువగా వుంది అందువల్ల ఆమెకు రక్తం ఎక్కించటానికి ప్రయత్నాలు చేస్తుంటాడు ప్రొఫెసర్ వాన్ హెల్సింగ్ డాక్టర్ సెవార్డు లూసీకి తన వంట్లోని రక్తం ఇస్తాడు ఆమె పరిస్థితి ఇప్పుడు కొంచెం మెరుగ్గా వుంటుంది పారిపోయిన తోడేలు కథనం గురించి జులాజికల్ గార్డెన్స్ రక్షకుడిని "ది పాల్‌మాల్ గెజిట్" పత్రికా విలేఖరి ఇంటర్వ్యూ చేస్తుంటాడు పారిపోయిన తోడేలు దానంతటదే వచ్చేస్తుంది లూసీ పరిస్థితి ఎప్పటిలానే వుంటుంది ఆఖరి క్షణాల్లో వున్న తన ప్రేయసి లూసీని ముద్దు పెట్టుకోబోతున్న ఆర్థర్‌ను మెడ పట్టుకొని లాగిపారేస్తాడు వాన్ హెల్సింగ్

---

ఆస్తుల వ్యవహారాలు చూసే సొలిసిటర్ చిరునామా దొరికింది లూసీ తల్లి అన్నీ సవ్యంగా రాసిపెట్టి వుంచింది తనని ఎక్కడ ఖననం చెయ్యాలోకూడా రాసి వుంచింది అది తన సొలిసిటర్‌కు రాసిపెట్టిన ఉత్తరం దాన్ని నేను సీలు వేయబోతుండగా వాన్‌హెల్సింగ్ గదిలోకి వచ్చాడు "ఏమోయ్ జాన్! ఇప్పుడు నేను ఖాళీయే నీకేమన్నా సాయం చెయ్యమంటావా ?" అంటూ

"మీక్కావలసింది ఏమైనా దొరికిందా ?" అని అడిగాను

"ప్రత్యేకంగా దేనికోసమూ వెతకలేదు ఏదైనా దొరుకుతుందేమోనని వెతికాను కొన్ని ఉత్తరాలు, ఆమె రాసిన నోట్సు, కొత్తగా మొదలు పెట్టిన డైరీ దొరికాయి అవన్నీ నాదగ్గరే వుంచాను ఇప్పుడు మనం దానిగురించి ఏం మాట్లాడనవసరం లేదు పాపం ఆతను రేపు సాయంత్రం వస్తాడు గదా అతన్ని అడిగి, వీటి సంగతి చూస్తాను" అన్నాడు

అక్కడ పని పూర్తిచేసాం "ఏమోయ్ జాన్! మనం నిద్రపోవటం మంచిది మనకు బాగా విశ్రాంతి వుంటేగానీ కోలుకోలేం రేపు చెయ్యాల్సిన పనులు చాలా వున్నాయి ఇవాళ రాత్రి మనం ఎవరి కోసమూ మేల్కొని వుండనవసరం లేకపోయింది, చూసావా!" అన్నాడు

గదిలోంచి మేం బయటకు వెళ్లబోయేముందు ఒక్కసారి లూసీని చూడాలనుకున్నాం ఖననం చేసే మనిషి గదిలో చక్కటి ఏర్పాట్లు చేసాడు ఆమె గది ఒక స్మారక మందిరంగా మారింది గది అంతా తెల్లటి పూలతో అలంకరించబడింది ఆమె మొహంమీదకు గుడ్డ కప్పబడివుంది వాన్‌హెల్సింగ్ ఆమెమీదకు వంగి మొహంమీద గుడ్డను కొద్దిగా వెనక్కిలాగాడు అప్పుడు ఆమె మొహం కనపడింది పొడుగాటి కొవ్వొత్తుల వెలుగులో ఆమె మొహంలోని అందాన్ని చూస్తూ వుండిపోయాం ఆమె దేహంలో జీవమున్నట్టు కళగా వుంది చిక్కి శల్యమైన గుర్తులు లేవు నేను శవాన్ని చూస్తున్నట్టుగా నా కళ్ళను నేను నమ్మలేక పోయాను

ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఆమె వంక గంభీరంగా చూస్తూవున్నాడు ఆమెను నేను ప్రేమించినట్లు అతను ప్రేమించలేదు గదా, అందుకే, అతను కన్నీళ్ళు పెట్టలేదు అతను నా వైపు తిరిగి "నేను వచ్చేవరకు ఇక్కడే వుండు" అంటూ వెళ్ళిపోయాడు దోసిలి నిండా వెల్లుల్లిపాయలతో తిరిగి వచ్చాడు వెల్లుల్లిపాయల పెట్టె వచ్చి హాల్లో వుంది ఆ పెట్టెలోంచి వీటిని తీసుకువచ్చాడు వాటిని మంచం మీద మిగతా పూలతోపాటు వుంచాడు తన మెడలోంచి బంగారవు శిలువ తీసి లూసీ పెదాలపై వుంచాడు తర్వాత మొహం మీద గుడ్డ కప్పాడు ఇద్దరం బయటకు వచ్చేశాం

నా గదిలో నేను బట్టలు మార్చుకుంటూ వుండాగా, తలుపుతట్టి వాన్‌హెల్సింగ్ లోపలికి వచ్చాడు వస్తూనే, "రేపు రాత్రిలోగా శవపరీక్ష చేసే కత్తులు రెండు నాకు తెప్పించి పెట్టాలి" అన్నాడు

"ఏమిటి ? మనం శవపరీక్ష చెయ్యాలా ?" అడిగాడు

"అవును అనుకుంటే అవును కాదనుకుంటే కాదు ఆపరేషన్ చేద్దామనుకుంటున్నాను, అయితే అది నువ్వు అనుకున్నట్టుగా కాదు ఆమె తలనరికి, ఆమె గుండెను బయటకు తీద్దామనుకుంటున్నామ



హో! నువు సర్జను వయివుండి అలా భయపడిపోతున్నావేమిటి? వణకని చేతుల్తో, చెదరని గుండెతో మీరు ఆపరేషను చేస్తుండగా, ఇతర్లు వణికిపోతూ చూడాలి, అంతేగానీ అవును, మరచానోయ్ జాన్! నువ్వు అమ్మాయిని ప్రేమించావు కదా! ఆ విషయం నేను మరిచిపోకూడదు అందుకనే నేను ఆపరేషను చేస్తాను నువు కాస్త సాయం చెయ్యి చాలు ఈ రాత్రికే ఆపరేషన్ చేద్దామని వుంది, కాని ఆర్థర్ కోసం ఆగాలి రేపు అతని తండ్రి అంత్యక్రియలు తర్వాత అతనికి పనివుండదు అతను చూడటానికి వస్తాడు కదా మరునాడు అంత్యక్రియలు జరుగుతాయనగా, రాత్రికి మనిద్దరం అందరూ నిద్రపోయాక ఈ గదిలోకి వద్దాం శవపేటిక స్క్రూలు తీసి పై మూత ఎత్తివేద్దాం ఆపరేషన్ చేద్దాం మళ్ళీ మూత పెట్టేద్దాం మనకి తప్ప ఇంకెవరికీ తెలియదు" అన్నాడు

"కానీ ఇవన్నీ చేయటం ఎందుకు? ఆమె చనిపోయింది కదా! అనవసరంగా ఆమె దేహాన్ని ముక్కలు చెయ్యటం ఎందుకు? శవపరీక్ష అవసరం లేనప్పుడు, దానివల్ల ఏమీ ఉపయోగం లేనప్పుడు, ఇట్లా చెయ్యటం, ఆమెకుగానీ, మనకుగానీ, సైన్సుకుగానీ, మానవ విజ్ఞానానికిగానీ మంచిది కానప్పుడు, ఎందుకుచెయ్యటం? ఎటువంటి కారణం లేకుండా చెయ్యటం రాక్షసత్వం" అన్నాను

వాన్ హెల్సింగ్ దగ్గరకొచ్చి నా భుజంమీద చెయ్యివేసి ఆప్యాయంగా అన్నాడు "ఏమోయ్ జాన్! గాయపడిన నీ హృదయాన్ని చూస్తుంటే జాలి వేస్తోంది ఆమెను నువ్వంతగా ప్రేమించటంవల్లనే నీమీద నాకు ప్రేమ నువ్వు చెయ్యాల్సిన పని అయితే నేనే చెప్పేవాడ్ని కానీ నీకు తెలియకూడని విషయాలు కొన్ని వున్నాయి ఆ విషయం నువ్వు తెలుసుకోవాలి అవన్నీ సంతోషం కలిగించే విషయాలు కాకపోయినా, నాకు తెలిసినంతుకు నువ్వు మెచ్చుకోవాలి నాయనా జాన్! నువ్వు ఎన్నో ఏళ్ళు నా స్నేహితునిగా వుంటూ వచ్చావు ఎప్పుడైనా అకారణంగా ఏపని అయినా చేసానా? నేనూ మనిషినే తప్పులు చేస్తే చెయ్యవచ్చు కానీ నేను చేసేదాంట్లో నాకు నమ్మకం వుంది ఇటువంటి తెలియని సమస్యల్నునాయనే కదా నువు నన్ను పిలిస్తే వచ్చాను ఆర్థర్, చనిపోతున్న లూసీని

# జీవన్ మృతులు

ముద్దు పెట్టుకోబోతుంటే, నా బలమంతా ఉపయోగించి అతన్ని లాగి అవతల పడేశాను నువు విస్తుపోతూ, భయపడిపోతూ చూసావు, అవునా? అందుకు కృతజ్ఞతగా, లూసీ కళ్ళల్లో ప్రాణం పెట్టుకుని, బలహీనమైన చేతితో నా చెయ్యిలాగి ముద్దు పెట్టుకొని, హీనస్వరంతో నన్ను మెచ్చుకుంటూ వుండగా నువు చూసావు అవునా? నేను ఆమెకు ప్రమాణం చేసినప్పుడు, నువు విన్నావు అవునా? తర్వాతనే ఆమె తృప్తిగా కళ్ళుమూసింది, అవునా?"

"ఇప్పుడూ అంతే నేను చెయ్యబోయేదాని కంతా కారణం వుంది నీకు విషయాలు ఎంత వింతగా వున్నా, సందేహాలు వచ్చినా, నువు నన్ను నమ్మాలి ఎన్నో సంవత్సరాలుగా నువు నన్ను నమ్ముతూ వచ్చావు ఇంకా కొంత కాలం నన్ను నమ్ము జాన్! నువ్వు గనక నన్ను నమ్మనట్టయితే, నా ఆలోచనలు నీకు చెప్పాలి కానీ అది అంత మంచిదికాదు కానీ నేను చెయ్యదలుచుకుంటే, నువు నమ్మినా నమ్మకపోయినా చేస్తాను నాకు ఉత్సాహం, ప్రోత్సాహం లేవని, భారమైన గుండెతో ఒంటరిగా చేస్తాను" అంటూ ఒక్క క్షణం ఆగాడు మళ్ళా గంభీరంగా మారిపోయి "ఏమోయ్ జాన్! మన ముందున్న రోజులు చాలా భయంకరమయినవి మనిద్దరం విడిపోవద్దు ఒకటిగా వుండి పనిచేద్దాం మంచి ఫలితాన్ని సాధిద్దాం ఏమిటీ, నామీద నీకు నమ్మకం లేదా?" అన్నాడు

వెంటనే అతని చెయ్యి పుచ్చుకుని ప్రమాణం చేసాను నా గది తలుపుతీసి పట్టుకున్నాను అతను వెళ్ళిపోయాడు అతని గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాడు అట్లాగే నిలబడ్డాను కదలకుండా పనిమనిషి ఒకతి వరండాలోంచి వెళుతూ కనిపించింది ఆమె నన్ను చూడలేదు ఆమె తిన్నగా లూసీ వున్న గదిలోకి వెళ్లింది ఆ దృశ్యం నన్ను కదిలించింది ఆమెకు యజమానురాలంటే ఎంత ప్రేమ! శవాన్ని చూడాలంటే ఎంత భయం కానీ ఆ పిల్ల భయాన్ని వదిలేసి తను ప్రేమించిన యజమానురాల్ని చూడటానికి వెళుతోంది! లూసీ బయట కనిపించేటంతవరకూ ఆమె ఒంటరిగా వుండదేమో!

నేను బాగా నిద్రపోయాను చాలాసేపు లేచే సరికి బాగా పొద్దుపోయింది వాన్ హెల్సింగ్ నా గదిలోకి వస్తున్న అలికిడి విని లేచాను నా మంచం పక్కన నిలబడి అన్నాడు "శవ పరీక్ష కోసం కత్తుల గురించి నువు శ్రమ పడక్కర్లేదు ఆపరేషను చెయ్యం"

"ఎందుకని?" అడిగాను గతరాత్రి అతను ఎంతో నమ్మకంగా చెప్పింది నా మనసులో నాటుకు పోయింది

"ఎందుకంటే, చాలా ఆలస్యం అయిపోయింది లేదా తొందర పడుతున్నామేమో" అన్నాడు గంభీరంగా "ఇది చూడు దీన్ని రాత్రి దొంగిలించారు" అన్నాడు చేతిలో చిన్న బంగారు శిలువను పట్టుకుని

"ఎట్లా దొంగిలించారు? ఇది మీ దగ్గరికెలా వచ్చింది?" ఆశ్చర్యంతో అడిగాను

"ఎవరైతే దొంగిలించారో, ఆ పనికిరాని దొంగముండ దగ్గరనుంచి తీసుకున్నాను ఆ పని పిల్ల 'జీవన్మృతురా'లయిన లూసీ వంటిమీదనుంచి కొట్టేసింది అది తప్పకుండా శిక్ష అనుభవిస్తుంది నేనేం శిక్షించను ఎందుకంటే, తను చేసినది ఎంత తప్పో తనకు తెలీదు గాబట్టి ఇక ఏం జరగబోతుందో చూడాలి" అంటూ వెళ్లిపోయాడు

నేను మళ్ళీ అయోమయంలో పడిపోయాను, ఇదంతా ఏవిటా అని ఆలోచిస్తూ

ఉదయం అంతా అట్లాగే గడిచిపోయింది మధ్యాహ్నం సొలిసిటర్ వచ్చాడు అతని పేరు మార్క్వాండ్ హోల్మాన్, సన్స్, మార్క్వాండ్ లిడరేల్ తరపున వచ్చాడు అతనెంతో సౌమ్యంగా మసులుకున్నాడు మేం చేసిందానికి ఎంతో మెచ్చుకున్నాడు భోజనం చేస్తున్నప్పుడు కొన్నివివరాలు చెప్పాడు చాలా రోజులుగా తనకున్న గుండె జబ్బువల్ల తొందర్లో పోతానని వ్యవహారాలన్నీ చక్కబెట్టి వుంచిందట దావాలోపడి ఒక్క ఆస్తి మాత్రం ఎవరో దూరపు బంధువులకు వెళ్ళగా, మిగిలిన స్థిరాస్తి, చరాస్తి అంతా ఆర్థర్ హోల్మ్వుడ్ పేర రాసేసిందిట ఇది చెప్పి అతను ఇలా అన్నాడు

"ఆమె అట్లా రాయటం ఆపడానికి మేము





శ్రీరస్తు – శ్రీ త్రిపురసుందరి వరశివాభ్యాంనమః



# ఆంధ్రపత్రిక



## రుధిరోద్గారినామసంవత్సరపూర్ణశాస్త్రీయపంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,
'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణించబడినది

## పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో వెలువడినది

************* విడిప్రతివెల రూ. 4/-.. **************

రిజిస్టరు బుక్‌పోస్టు ద్వారా పంపుటకు రూ. 7/-

ఈ దిగువ చిరునామాకు మనియార్డరు పంపండి.

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధినగరం, విజయవాడ – 3

చాలా ప్రయత్నం చేసాం ఎందుకంటే ఆమె లూసీ పేర చిల్లిగవ్వ కూడా రాయలేదు పోనీ లూసీ తన పెళ్ళి విషయంలో స్వేచ్ఛగా ప్రవర్తించడానికీ లేదు ఆమెతో విరోధం తెచ్చుకున్నంతగా వాదించాం కానీ దానికామె 'నేను చెప్పినట్టు చేస్తారా చెయ్యరా' అని అడిగింది ఆమె అట్లా అన్న తర్వాత మేం చేసేదేముంది ఆమె చెప్పినట్టే రాసాం అయినా జరగవలసినట్టుగానే జరిగింది మేము చేపట్టే వంద కేసుల్లో తొంభైతొమ్మిది కేసులు న్యాయప్రకారంగానే చేస్తాం మా తీర్పు సరిగ్గానే వుంటుంది నిజం చెప్పాలంటే, ఆమె అలా రాయబట్టే సరిపోయింది, లేకపోతే, ఎన్నో ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సివచ్చేది ఎందుకంటే, ముందు తల్లి చనిపోయింది తర్వాత కొద్ది నిముషాల్లో కూతురు చనిపోయింది తల్లి ముందు చనిపోవటంవల్ల, కూతురు కొద్ది నిముషాలు బ్రతికి వున్నా, ఆస్తి లూసీకి చెందుతుంది లూసీ రాసిన విల్లు లేదు ఆమె బ్రతికున్న ఆ కొద్ది నిముషాల్లో విల్లు తయారుచేయడం అసాధ్యం అటువంటి పరిస్థితుల్లో ఎవరికీ చెందని ఆస్తులుగా పరిగణించాలి ఇట్లాంటప్పుడు, గాడ్ ఆల్మింగ్ ప్రభువు (ఆర్థర్ హోల్మ్‌వుడ్) వీళ్లకు ఎంత ఆప్తుడయినా ఆస్తికి వారసుడు కాలేడు వీళ్ల దాయాదులు కూడా చాలా తక్కువమంది అవటంచేత, ఆస్తి అంతా పరాయివాడికి వెళ్లినా, వాళ్లు చూస్తూ పూరుకోరు అందువల్ల లూసీ తల్లి ఆర్థర్ పేర విల్లు రాయటం ఎంతో మంచిదయింది అందుకు మాకెంతో సంతోషంగా వుంది'' అన్నాడు

అతను చాలా మంచివాడు జరిగింది విషాదమైనా, జరిగినదానిలో ఎటువంటి సమస్యలు ఉత్పన్నం కానందుకు, అతను పడ్డ సంతోషపు తీరు చూస్తే, పరిస్థితుల్ని ఎట్లా అవగాహన చేసుకొని నిలబడాలో అర్థం చేసుకోవచ్చు

అతను ఎక్కువసేపు వుండలేదు గాడ్ ఆల్మింగ్ ప్రభువును మళ్ళీ వచ్చి చూస్తానని చెప్పాడు మిస్టర్ మార్క్వాండ్ వచ్చివెళ్లటం మాకెంతో పూరటగా వుంది ఎందుకంటే, మేం చేసిన పనులకు, బయటనుంచి ఎలాంటి విమర్శలు లేకుండా తట్టుకోవచ్చుననిపించింది ఆర్థర్ అయిదు గంటలకు వస్తాడు అతనువచ్చే ముందు ఓసారి శవాలను చూడటానికి గదిలోకి వెళ్లాం తల్లీ కూతుళ్లను ఒకచోటే వుంచబడ్డారు శవాలను ఖననం చేసే మనిషి గదిలో అన్నీ అలంకరించి పెట్టాడు గదిని జూడగానే, విషాదం తెలిసివస్తోంది కానీ వాన్‌హెల్సింగ్‌కి అది నచ్చలేదు అతన్ని పిలిచి, పూర్వం గదిలో వస్తువులు ఎట్లా వున్నాయో, అట్లాగే మళ్ళీ వుంచమన్నాడు ఈ కొత్త ఏర్పాట్లు అన్నీ తీసివేయమన్నాడు గాడ్ ఆల్మింగ్ ప్రభువు వచ్చి చూస్తే అతనికి విషాదం ఎక్కువ అవుతుంది అతనిలో అట్లాంటి అనుభూతి కలిగించకూడదు, అని వాన్‌హెల్సింగ్ చెప్పి ఏర్పాట్లు మార్పించాడు

పాపం, అతను భగ్నహృదయుడుగా ఎంతో విషాదంగా కన్పించాడు ఒక పక్క తండ్రి, ఒక పక్క లూసీ ఎడబాటుతో, అతనిలోని మగధీరత్వమంతా కరిగిపోయినట్టు కన్పించాడు అతనికి

# జీవన్ మృతులు

తండ్రి అంటే ఎంత గౌరవమో, ఎంత అనుబంధమో నాకు తెలుసు ఇప్పుడు లూసీ మరణం దెబ్బమీద దెబ్బ అతను వచ్చినప్పుడు నాతో మామూలుగానే వున్నాడు వాన్‌హెల్సింగ్ అతన్ని ఎంతో ఆదరంగా చూసారు అతనిలో ఏదో ఆరాటం కనిపించింది అది ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ గమనించి అతన్ని నన్ను పైకి తీసుకురమ్మని చెప్పాడు నేను అతన్ని పైగదిలోకి తీసుకెళ్ళి తలుపు దగ్గర ఆగిపోయాను, అతను ఆమెతో ఒంటరిగా వుంటే బాగుంటుందని కానీ అతను నా చెయ్యి పుచ్చుకుని లోపలికి తీసుకెళ్లాడు, "నువ్వు కూడా ఆమెను ప్రేమించావు కదోయ్! ఆమె నాకంతా చెప్పింది ఆమె హృదయానికి చేరువైన స్నేహితుడివి నువ్వొక్కడివే ఆమెకోసం నువు చేసిన దానికి నీకెట్లా కృతజ్ఞతలు చెప్పాలో తెలీటం లేదు అది ఆలోచించలేను కూడా '' అంటూ

అలా మాట్లాడుతుండగా అతనికి దుఃఖం ఆగలేదు నా భుజాల చుట్టూ చేతులు వేసి, తలను నా హృదయాని కానించి ఏడ్చాడు "ఓ జాక్! జాక్! నేను ఏం చేయ్యాలి? నా ప్రాణానికి ప్రాణమైన ఆమె వెళ్ళిపోయింది ఇక ఈ ప్రపంచంలో నేను దేనికోసం బ్రతకాలి?"

నాకు చేతనైన విధంగా అతన్ని ఓదార్చాను ఇటువంటి సమయాల్లో మగవాళ్లకు ఎట్లా బాధను వెళ్లబోసుకోవాలో తెలీదు చేతిలో చేయివేసి పట్టుకోవడం, భుజాలమీద అరచేయి వుంచి నొక్కడం, కలసి రోదించటం — ఇదే తనకు ప్రియమైనవాడికి సానుభూతి చూపించగలిగిన భావప్రకటనలు అతను ఏడుపు మానేవరకు నేను నిలబడ్డాను తర్వాత "పద, ఆమెను చూద్దువుగాని" అన్నాను

ఇద్దరం మంచం దగ్గరకు వెళ్లాం ఆమె మొహంమీద కప్పబడి వున్న గుడ్డను కొద్దిగా తొలగించాను ఓ దేవుడా! ఆమె ఎంత అందంగా వుంది! గంట గంటకు ఆమె అందం రెట్టింపు అవుతోంది ఆమెను చూడగానే ఆశ్చర్యంతోబాటు, భయం కూడా వేసింది ఇక ఆర్థర్ అయితే వణుకుతున్నట్టు కనిపించాడు అతనిలో ఏదో సందేహం మొదలయింది కాసేపు మౌనం తర్వాత హీనస్వరంతో అడిగాడు "జాక్! ఈమె నిజంగా మరణించిందంటావా?"

నిజమేనని చెప్పాను, ఎంతో బాధగా కొన్ని సందర్భాలలో ఇట్లానే చనిపోయిన తర్వాత పూర్వం యవ్వనంలో వుండిన అందమంతా తిరిగి వచ్చినట్టు కనపడుతుంది ఎన్నో రోజులుగా బాధలు అనుభవించి చనిపోయేవాళ్ళు ఇట్లాగే కనపడతారు ఇవన్నీ అతనికి చెప్పాను అతను విన్నాడు మంచం ప్రక్కన మోకాళ్ళమీదకు వంగి కూర్చుని ఆమె అందమైన మొహంవంక తదేకంగా చూస్తూ వుండిపోయాడు తర్వాత నావైపు తిరిగాడు అదే వీడ్కోలు అని చెప్పాను ఆమెను ఇప్పుడు శవపేటికలో వుంచేవేళ అవుతోంది అతను లేచి నిలబడి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు ఆమె మీదకు వంగి నుదురుమీద ముద్దుపెట్టుకున్నాడు అతను బయటకు వచ్చేసాడు వస్తూ ఒకసారి నిలబడి తన భుజాలమీదుగా వెనక్కి తిరిగి ఆమెను చూసాడు

అతన్ని డ్రాయింగ్ రూములో వదిలేసాను అతను ఆమెకు వీడ్కోలు చెప్పటం అయిందని వాన్‌హెల్సింగ్‌తో చెప్పాను వెంటనే అతను ఖననం చేసే మనిషికి ఆమెను శవపేటికలో వుంచే ఏర్పాట్లు చేయమని పురమాయించాడు అతను మళ్ళా నా గదిలోకి వచ్చిన తర్వాత ఆర్థర్ వేసిన ప్రశ్న గురించి చెప్పాను

"నాకేం ఆశ్చర్యం లేదు ఎందుకంటే ఇప్పుడే నాకొక్క క్షణం సందేహం వేసింది!" అన్నాడు వాన్ హెల్సింగ్

మేం కలిసి భోం చేసాం పాపం, ఆర్థర్ మామూలు మనిషి కావటానికి యాతన పడుతున్నాడు భోజనం చేస్తున్నంతసేపు వాన్‌హెల్సింగ్ మౌనంగా వుండిపోయాడు ఇద్దరం సిగార్లు వెలిగించినప్పుడు అతను ఆర్థర్‌ని "ప్రభూ!" " " అని సంబోధించాడు వెంటనే ఆర్థర్ అడ్డుకుని "వద్దు వద్దు దయచేసి నన్ను అలా పిలవద్దు, ఎప్పుడైనా సరే క్షమించండి అట్లా అని నన్ను కించపరచమనిగాదు ఎందుకంటే, మా తండ్రి పోయింది మొన్ననే కదా!" అన్నాడు

దానికి ప్రొఫెసర్ "నేను సందేహపడుతూనే పిలిచాను నేను మిమ్మల్ని 'మిస్టర్' అని పిలవకూడదు కానీ మీరంటే నాకు ప్రేమ ఎక్కువయింది నిజం ఆర్థర్! నాకు నువ్వంటే ప్రేమ" అన్నాడు

"మీకు ఎట్లా తోస్తే అలాపిలవండి నన్ను ఒక మిత్రుడిగా భావించండి లూసీకి మీరెంత సహాయం చేసారో నేను మాటల్లో వెల్లడించలేకపోతున్నాను" అన్నాడు ఒక్కక్షణం ఆగి, "నాకన్నా ఆమె మిమ్మల్ని బాగా అర్థం చేసుకున్నదని నాకు తెలుసు నేను ఎప్పుడైనా మీ ఎడల అనుచితంగా ప్రవర్తించినా, ప్రవర్తించడానికి పూనుకున్నట్టు కనిపించినా — మీరు నన్ను తోసేసారు గుర్తుందా?— మీరు నన్ను క్షమించాలి" అన్నాడు

"నాకు తెలుసు అప్పుడు మీరు నన్ను నమ్మ

## కృత్రిమ వజ్రాలు !

జపానులోని సుమిటోమో ఎలక్ట్రిక్ కంపెనీవారు కృత్రిమ వజ్రాల తయారీని వ్యాపార రీత్యా 1984 నాటికి చేపట్టగలరని తెలియచేశారు కృత్రిమ వజ్రాల తయారీకి వీరు చేస్తున్న కృషి విజయవంతమైంది 12 కారెట్ల కృత్రిమ వజ్రాన్ని తయారు చేసినట్లు వీరు ప్రకటించారు వివిధ పరిశ్రమల్లో వజ్రాలను ఉపయోగిస్తారు డ్రిల్లింగ్ మిషన్లు, వీడియో టేప్‌రికార్డర్ల మాగ్నెటిక్ హెడ్స్, మరికొన్ని సున్నితమైన యంత్రాలలో సహజమైన వజ్రాలనే ఉపయోగిస్తున్నారు కృత్రిమ వజ్రాలకు అతి త్వరలోనే విపరీతమైన గిరాకీ ఏర్పడగలదని వీరు ఆశిస్తున్నారు

# బొమ్మచేతుల అభివృద్ధి

ఒక మనిషికి చెయ్యి పోతుంది మొండి బాహువు మాత్రమే మిగులుతుంది మొండి ముంజేతికి ఒక కృత్రిమ హస్తాన్ని తగిలించవచ్చు ఇందులో విశేషం ఏమీ లేదు కాని, ఈ కృత్రిమ హస్తం ఏ విధంగా పని చెయ్యగలదు ?

మొండి ముంజేతికి విద్యుచ్ఛక్తిని ప్రసారం చెయ్యగలిగిన సాధనాలని అమరుస్తారు ఇవి మెదడు నుంచి వచ్చే సంకేతాలని స్వీకరించగలవు ! ఈ సాంకేతాలని కృత్రిమ హస్తంలోని చిన్న మోటారులకి పంపిస్తాయి మొండి ముంజేతికి పెట్టిన సాధనాలు మోటారులు పనిచేసి కృత్రిమ హస్తం యొక్క వేళ్లని కదల్చగలవు అంటే, ''బొమ్మ చెయ్యి'' పని చెయ్యటం మొదలు పెడుతుందన్నమాట

ఈ బొమ్మ చెయ్యి చూడటానికి సహజమయిన హస్తంలాగే ఉంటుంది దాని బరువు కూడా ''అసలు చెయ్యి'' అంతే ఉంటుంది దీనిలో మొదడు నుంచి వచ్చే విద్యుత్ సంకేతాలని 40000 రెట్లు బలవంతం చేసేందుకు వేళ్లు ఉంటాయి [ట్రాన్సిస్టర్‌లు విద్యుత్ సంకేతాలని హెచ్చించే సాధనాలే



జర్మనీలో 16వ శతాబ్దంలో తయారైన ఇనప బొమ్మచేతులు
మంచి చేతిలో బొమ్మ చేతివేళ్లు బిగించేవాళ్లట

కదా, అంటారు కొందరు ! ] ఈ హెచ్చింపు వలననే కృత్రిమ హస్తాల అభివృద్ధి నేటి స్థాయి చేరుకోగలిగింది

మెదడు నుంచి వచ్చే కరెంటు సిగ్నల్‌లని పెంచేందుకు బాటరీలు కావాలి ఒక బొమ్మ చెయ్యి వాడకం సగం మిల్లివాట్ ఉంటుందిట అంటే, 5 రోజుల కొకసారి బాటరీలు మార్చాలని అంచనాలు వెయ్యబడ్డాయి

బొమ్మ చేతులు 1940 నుంచి వాడకంలో ఉన్నాయి కాని నేటి అభివృద్ధి అప్పటిలో అనూహ్యం అంటారు

పశ్చిమ జర్మనీలో ఒకటి లేదా రెండు చేతులు కోల్పోయిన వారి సంఖ్య 40000 దాకా ఉంటుందిట [డెర్ టాగెజ్పియెల్ పత్రికలో వ్యాసం ఆధారంగా జర్మన్ ట్రిబ్యూన్ ప్రచురించిన అంశం] ★

పరిస్థితుల్లో లేరు ఎందుకంటే, నేను బలవంతంగా తోసెసినదానికి, ఎంతో అర్థం చేసుకునే శక్తి వుండాలి ఇంకా మీరు నన్ను పూర్తిగా అర్థం చేసుకోలేదనే అనుకుంటాను ఇట్లాంటి పరిస్థితులు భవిష్యత్తులో ఇంకా రావచ్చు అప్పుడు కూడా నన్ను నమ్మరు నమ్మలేరు కానీ నన్ను పూర్తిగా నమ్మేరోజు కూడా వస్తుంది అప్పుడు నేను చేసినవి మీకు అర్థమవుతాయి చీకటిలోంచి వెలుగులోకి వస్తారు అప్పుడు నేను మొదట్నుంచి చేస్తూ వచ్చిన వాటికి మీరు నన్ను మెచ్చుకోవాలి అది మీ కోసం, ఇతర్ల కోసం, అంతేకాదు నేను ఎవరికైతే ప్రమాణం చేసానో ఆ లూసీ ఆత్మకోసం'' అన్నాడు వాన్ హెల్సింగ్

''నిజంగా నమ్ముతాను సార్ !'' అన్నాడు ఆర్థర్ ''మిమ్మల్ని ఎప్పుడూ నమ్ముతాను మీది ఎంతో గొప్ప హృదయమని నాకు తెలుసు పైగా మీరు జాక్ స్నేహితులు లూసీకికూడా ఆత్మీయులు కాబట్టి మీకు ఎట్లా తోస్తే అలా చెయ్యండి'' అన్నాడు

వాన్ హెల్సింగ్ రెండుసార్లు గొంతు సవరించుకున్నాడు, ఏదో మాట్లాడదల్చుకున్నట్టుగా చివరికి అడిగాడు ''మిమ్మల్ని ఓ విషయం అడగవచ్చా ?''

''తప్పకుండా ''

## జీవన్మృతులు

''లూసీ తల్లి తన ఆస్తినంతా మీ పేర వ్రాసిన విషయం మీకు తెలుసా ?''

''లేదు, పాపం అట్లా ఆమె చేస్తుందను కోలేదు ''

''ఇప్పుడు ఆస్తి అంతా మీది కాబట్టి, మీరు తోచినట్టు చేసుకోవచ్చు లూసీకి సంబంధించిన కాగితాలు కొన్ని వున్నాయి వాటిని చదువుకోటానికి నాకు అనుమతి ఇవ్వండి కేవలం చదవాలనే కోరికతో కాదు, నన్ను నమ్మండి వాటిని చదవడంలో ఒక ఉద్దేశం వుంది ఈ కాగితాలన్నీ మీకు చెందుతాయని తెలిసినతర్వాత, వాటిని తీసుకుని నా దగ్గరుంచాను ఎందుకంటే, పరాయివాళ్ల చేతిలో అవి పడటం మంచిదికాదు ఆమె ఆత్మలోకి ఎవరూ పరికించి చూడకూడదు అవసరమయితే నా దగ్గర వుంచుతాను మీరుకూడా వాటిని చూడలేదు అయినా వాటిని నాదగ్గరే వుంచుతాను, జాగ్రత్తగా మీకు ఇవ్వాల్సిన మంచి రోజున వాటిని తిరిగి ఇస్తాను ఆమె కాగితాలు అడగటం ఇబ్బందిగానే వుంటుంది అయినా మీరు ఒప్పుకుంటారని ఆశిస్తాను కదూ ! కనీసం లూసీ ఆత్మకోసం'' అన్నాడు

ఆర్థర్ ఎంతో ఆప్యాయంగా అన్నాడు ''డాక్టర్ వాన్ హెల్సింగ్, మీకు ఎట్లా చెయ్యాలనిపిస్తే అట్లా చెయ్యండి లూసీ వున్నాకూడా ఒప్పుకునేది అనే నమ్మకంతో నేను మాట్లాడుతున్నాను మిమ్మల్ని ఏమీ ప్రశ్నించను, ఆ రోజు వచ్చేవరకు ''

ప్రొఫెసర్ వాన్ హెల్సింగ్ లేచినిలబడి గంభీరంగా అన్నాడు, ''బాగా చెప్పారు ఇంకా మనకు బాధలున్నాయి అన్నీ బాధలే కాకపోవచ్చు అలాగని, ఇప్పుడు జరిగిందే చివరి బాధ కాదు మేము మనమంతా, మధురమైన నీరు దొరికేదాకా చేదునీటిని రుచి చూస్తూ వుండాలి కానీ మనం మాత్రం చాలా ధైర్యంగా, నిస్వార్థంగా, ఎవరి విధుల్ని వారు నిర్వర్తించాలి అప్పుడందరికీ మంచి జరుగుతుంది ''

రాత్రి ఆర్థర్ గదిలో, నేను సోఫాలో పడుకున్నాను వాన్ హెల్సింగ్ అసలు నిద్రపోలేదు ఇంటిని కాపలా కాస్తున్నట్టు, అటూ ఇటూ పచార్లు చేస్తూ కనిపించాడు క్షణంకూడా లూసీ శవపేటికకు దూరంగా వుండలేదు లూసీ శవపేటిక గులాబీలతో, లిల్లీ పూలతో నిండివున్నా, వాటి పరిమళాలను ఛేదించుకుని, వాటితోపాటు వుంచిన వెల్లుల్లిపాయల వాసనతో నిండిపోయింది

[ఇంకా వుంది]




## కె. ఎస్. - ఖాజీపేట

మూత్రపిండాలు రోగగ్రస్తమయితే "డయాలిసిస్"తో చికిత్స చేస్తారని విన్నాను డయాలిసిస్ అంటే ఏమిటి ఏ విధంగా చేస్తారు

★ డయాలిసిస్ విధానంలో మూత్రపిండాలు చేసే పనిని అంటే రక్తంలోని చెడు పదార్థాలను విసర్జించటం, రక్తంలో ఆమ్ల-క్షార బాలన్సు సరిచూడటం మొదలయిన వాటిని కృత్రిమంగా రసాయనిక చర్యల ద్వారా చేయటం జరుగుతుంది

కాన్సెన్ట్రేటెడ్ ద్రవాలు, డైల్యూట్ ద్రవాలలోకి ఒక సన్నని పొర ద్వారా చేరగలుగుతాయనేది శాస్త్రీయంగా అందరికీ తెలిసిందే ఈ విధానాన్ని డయాలిసిస్‌లో వాడతారు

రోగి రక్తాన్ని ట్యూబుల ద్వారా డయాలిస్ మెషిన్‌లోకి పంపి, శుభ్రపరచబడిన రక్తాన్ని తిరిగి శరీరానికి పంపిస్తారు

## జి బి. - ఖమ్మం

మా బాబుకి 7 సం॥లు వాడు నాలుగు సం॥ల పిల్లవాడికిమల్లే పొట్టిగా ఉంటాడు

★ ఒకరు పొడుగా, పొట్టా అన్నది 16, 17 సం॥ల ప్రాంతంలోనే నిర్ణీతంగా చెప్పగలుగుతాము

పొట్టిగా ఉన్నవారిని పొడుగు చేయటం దాదాపు అసాధ్యం అనే చెప్పవలసి ఉన్నది

## కె. ఎస్ పి. - పొన్నూరు

నేను 1 సం॥ క్రితం బజారు స్త్రీతో వ్యభిచరించాను నా రెండు బీజములలో ఒక బీజంలో గల నరాలు వాచినవి బీజం పెద్దదిగా అయింది నా గజ్జలలో బిళ్ళలు కట్టినట్లు చాలా రోజులనుంచి ఉంటున్నది నా అంగంపై రెండునెలల క్రితం పొక్కులు లేచాయి బాగా దురదగా ఉండేది

★ మీకు ఏర్పడిన లక్షణానికీ బజారు స్త్రీతో సంపర్కానికీ సంబంధం లేదనే చెప్పాలి మీలో స్వతహాగా ఉండే భయం వల్ల అలా అనిపిస్తున్నది

టెస్టికిల్స్ వాపుని సర్జన్కి చూపించి అవసరమైతే ఆపరేషన్ చేయించుకోవలసి ఉంటుంది

## డి కె ఆర్ - తుని

మా తమ్ముడి వయస్సు 15 సంవత్సరములు వాడి రెండు రొమ్ములు 2 సంవత్సరముల నుండి ఎత్తుగా కనిపిస్తున్నాయి ఏం చేస్తే ఆ వాపు తగ్గుతుందో తెలియజేయండి

★ గైనకోమాస్టియా అనేది యుక్తవయస్సు వచ్చిన వారికి రావటం కొంతవరకు సహజం ఇంకా కొన్ని సంవత్సరములు చూడండి మామూలు పరిస్థితికి రాకపోతే శస్త్ర చికిత్స ద్వారా వీటిని తొలగించవలసి ఉంటుంది

## కె. బి ఆర్. అముదాలవలస

మా పాపాయి వయస్సు 3 సం॥లు ఆ అమ్మాయి తల జుత్తు చేతితో లాగివేస్తున్నది జుట్టంతా ఊడిపోయి తల పట్టలా తయారవుతున్నది

★ శరీరానికి ప్రోటీన్లు తక్కువగా లభించటం వల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది ఆహారంలో పప్పు ఎక్కువగా వాడండి స్కిమ్డ్ మిల్క్, వేయించిన శనగపప్పు జావ ఇస్తే చాలా మంచిది

## పి వి. ఎల్. కాకినాడ

నా వయస్సు 17 సం॥లు వివాహం అయి 1 సం॥ అయింది ఏప్రిల్ నెలలో బాబు పుట్టాడు 3 సం॥ల వరకు పిల్లలు కలుగకుండా మాత్రలు వాడాలనుకుంటున్నాను ఏ బిళ్ళలు వాడాలి వాడితే ప్రమాదమేమీ లేదుగా ?

★ ఓవ్యులెన్ అనే మాత్రలు బజారులో దొరుకుతాయి వాటిని ఋతుస్రావం మొదలయిన 5వ రోజు నుంచి వాడటం మొదలుపెట్టాలి

కుటుంబ నియంత్రణ చికిత్సా కేంద్రాలలో ఈ మాత్రలు ఖర్చు లేకుండా ఉచితంగా ఇస్తారు

## ఎస్ కె. - హైదరాబాదు

నాకు 1½ సం ల క్రితం సెజేరియన్ ఆపరేషన్ అయినది తర్వాత పొత్తికడుపు భాగం, కడుపు భాగం లావుగా అయింది ఈ లావు తగ్గాలంటే ఏం చేయాలి ?

★ ఈ లావు తగ్గటానికి ఎక్సరసైజులు చేయటం మినహా వేరే మార్గం లేదు సెజేరియన్ ఆపరేషన్‌కీ కడుపుభాగం లావు అవటానికీ సంబంధం లేదనే చెప్పవలసి ఉన్నది

## యం కె. - తిరుపతి

నా వయస్సు 30 సం॥లు 4 సం॥లుగా కడుపునెప్పి డాక్టర్లకి చూపిస్తే కిడ్నీస్‌లో రాళ్ళు ఉన్నాయని మందులు, ఇంజక్షన్లు ఇచ్చారు కొంచెం కూడా తగ్గలేదు నెప్పి అధికం అయింది నిలబడలేను, కూర్చోలేను ?

★ మూత్రపిండాలలో "రాళ్ళు" (స్టోన్స్) ఉన్నప్పుడు అది స్వతహాగా విసర్జింపబడకపోతే శస్త్రచికిత్స ద్వారా తీసివేయవలసి ఉంటుంది ★






## స్టీలు యుగం !

మన పదిపైసలనాణెం చేయడానికి గవర్నమెంటుకుపదిహేనుపైసలుఖర్చవుతోందటరూపాయనాణెం చేయడానికి డెబ్బయ్యయిదు పైసలు ఖర్చవుతోందట ఈ నాణాల లోహాలు విదేశాల నుంచి దిగుమతి చేసుకోడంతో యీ ఖర్చు ఎక్కువవుతూ ఉన్నాయనీ కనుక నాణాలను స్టెయిన్లెస్టీలుతో తయారు చేయాలని చూస్తున్నామని ప్రభుత్వం అన్నదట ఈ స్టీలు తో రెండ్రూపాయల బిళ్ళ చేయడానికి పావలా ఖర్చవుతుందట రెండ్రూపాయలూ, రూపాయిబిళ్ళా తయారు చేయడానికి సాలునా 18 వేల టన్నులస్టీలు కావాలట ఈస్టీలు సేలం స్టీలుకర్మాగారం ఉత్పత్తి చేయగలదట మరిహనేం !

## సముద్రం మీద వంతెన !

ప్రపంచంలో కల్లా అతిపొడవైన బ్రిడ్జి సీటో ఐలాండ్ సముద్రం మీద కడుతున్నారట ఇది 1985 నాటికి పూర్తవుతుందట ఈ బ్రిడ్జి పొడవు 1800 మీటర్లట— సర్వేజనా సుఖినో భవంతు

## వెల్లుల్లి, క్యారట్ మహాత్యం !

చదువరీ వెల్లుల్లి మహాత్యం విన్నావా ! వెల్లుల్లిలో విటమిను—సి, విటమిను ఏ, బి, జి, ఉండటమేగాక సల్ఫరు, ఇనుము, కాల్షియము, ఎలిసిన్ అనేఖనిజాలు కూడా ఉన్నాయట వెల్లుల్లి ఇన్ఫ్లూయంజా, క్షయవంటి రోగాలను కుదర్చగలదట్ట అంతేగాక గుండెను, జీర్ణకోశాన్నీ శుభ్రపరచగలదట నులిపురుగులనుచంపి, జీర్ణాశయాన్ని శుభ్రం చేయగలదట లీవరును కూడా చక్కపరచగలదట హైబ్లడ్ప్రషరు, ఉబ్బసము వంటి జబ్బులను కూడా యిది అణిచి, నివారించగలదట అలాగే క్యారటులో విటమిను ఏ సమృద్ధిగా ఉంటుందట ఏ విటమిను ఎముకల, పళ్ళ గట్టిదనానికి, పెరుగుదలకూ కావాలట అజీర్ణంవల్ల అయ్యే విరేచనాలను కూడా యిది అరికట్టగలదట దీనిలో బి—1, బి—2 విటమినులు కూడా ఉన్నాయట దీనిలో మెగ్నీషియం వుండడంవల్ల యిది మలబద్ధకానికి చక్కనిమందట ఆపుపాలకు బదులు క్యారటు వాడవచ్చునట అతిమూత్ర వ్యాధికి ఇది మందట

## ఉత్తరం బట్వాడాకు 53 ఏళ్ళు !

న్యూయార్క్‌కు చెందిన వయిట్ప్లయిన్స్ అనే నగరంలో నివసిస్తున్న జొన్నీమార్ఫీ అనేఆవిడ తనకొచ్చిన ఓ ఉత్తరం చూసుకుని, నిర్ఘాంతపోయిందట ఆఉత్తరం పక్కవూల్లో ఉన్న ఆవిడ భర్త తాలూకు నాయనమ్మ 53 సంవత్సరాల క్రితం రాసినదట ఆవిడ భర్తా, ఆ భర్త నాయనమ్మ చనిపోయినా, 53 ఏళ్లానంతరం ఎంచక్కా చేరిన ఆ ఉత్తరాన్ని ఏంచెయ్యాలో ఆమెకు తెలీలేదట- అయ్యా ఓ చదువరీ, తంతితపాలాశాఖ ఏదేశపు వారైనా ఒకటే ఖ్యాతికాబోలు.



## కలిసొచ్చిన అదృష్టం !

బ్రిటన్‌కు చెందిన జాన్‌క్లార్క్ అనే ఆయన తన భార్య పొసగడలేని అర్భకుణ్ణి "నేనని" కోర్టులో భోరున విలపించి విడాకులపత్రం సమర్పించుకున్నాడట అయితే యీ విడాకులు మంజూరయ్యేలోగా అతగాడి భార్యా రత్నం ఓకారుప్రమాదంలో పచ్చడైపోయిందట ఆమె తన జీవితం మూడులక్షల రూపాయలకు భీమా చేయడంవల్ల ఆ డబ్బు ఎవరికి చేరాలోఅనుమానం వస్తే "నాకే, నాకేరావాలి" అన్నాడట జాన్‌క్లార్క్ ఈ కేసు విచారించిన కోర్టు విడాకులు మంజూరు కానందువల్ల వారిరువురూ సంబంధ బాంధవ్యాలు కల భార్యాభర్తలేనని చెపుతూ డబ్బు అతనికి యివ్వాలన్నారట

## గడియారం షాపు బహిష్కరణ !

నెల్లికుప్పం అనేవూరుకు చెందిన ఒకహోటలు యజమాని రామన్ ఓ గోడ గడియారం కొని తన హోటల్లో పెట్టాడట ఆ గడియారం తన పని తను చేయక సతాయింపు ప్రారంభించేసరికి దాన్ని రెండుసార్లు షాపుకు తీసుకువెళ్లి రిపేరు చేయించుకు వచ్చాట్ట అయినా అది అలానే అఘోరించ నారంభించేసరికాతను ఆ గడియారం తీసుకుని మరొకటి మార్చివ్వమంటే షాపువాడు "ముడియాదు" అన్నాడట దాంతో అతను ఆ గోడగడియారాన్ని తన హోటల్లో నలుగురికళ్లబడే చోట పెట్టి "మిత్రులారా, యీ గడియారం ఫలానా షాపులో ఫలానా తేదీన ఇంత డబ్బిచ్చి కొన్నాను. ఇది తిరగడంలేదు అమ్మినషాపు దీని బాధ్యత తీసుకోటంలేదు " అని రాసి విజ్ఞప్తి పెట్టాడట. దాంతో యీ హోటలుకొచ్చిన వారంతా చదివి ఆ షాపును బహిష్కరించారట దీనివల్ల బుద్ధివచ్చి ఆ షాపు యజమాని రామన్‌గారి హోటలుకు వెళ్లి ఓ కొత్తగడియారంయిచ్చి మహాప్రభూ ఆవిజ్ఞప్తి తీసెయ్యండి అని ప్రాదేయపడ్డాడట. *

# శ్రీమతి మాదిరెడ్డి సులోచన దుర్మరణం

ప్రముఖ నవలా రచయిత్రి శ్రీమతి మాదిరెడ్డి సులోచన ఫిబ్రవరి 17 న హైదరాబాదులోని ఉస్మానియా ఆస్పత్రిలో మృతి చెందారు 16 వ తేదీ తెల్లవారుజామున వారి స్వగృహంలో జరిగిన వంటగాస్ సిలెండర్ పేలుడు ప్రమాదంలో తీవ్రంగా గాయపడిన మాదిరెడ్డి దంపతులలో శ్రీ రామచంద్రారెడ్డి ఆస్పత్రిలో చేర్చిన తరువాత మృతి చెందారు శ్రీమతి సులోచన మృత్యువుతో పోరాడి అలసిపోయి ఆ మర్నాడు అసువులు కోల్పోయారు



శ్రీమతి సులోచన వయస్సు 47 సంవత్సరాలు ఆమె 75 పైగా నవలలు, అనేకానేక కధానికలూ రాశారు కొంతకాలం జాంబియాలో ఉపాధ్యాయినిగా పని చేశారు. ఈమె రాసిన నవల ఆధారంగా తీసిన 'తరం మారింది' చిత్రానికి రాష్ట్రప్రభుత్వం ఆమెకి 'నంది' అవార్డు యిచ్చి సత్కరించింది. ప్రేమలు — పెళ్లిళ్ళు, ఆడంబరాలు — అనుబంధాలు, అగ్ని పరీక్ష, కళ్యాణి, కలవారి సంసారం చిత్రాలు ఆమె నవలల ఆధారంగా తీసినవే ఈమె రచనలలో వాస్తవికత ప్రతిబింబిస్తుంది వీరికి ఒక కుమారుడు ఉన్నారు.

శ్రీమతి మాదిరెడ్డి సులోచన దుర్మరణం తెలుగు పాఠక లోకానికి తీరని లోటు.

మాధవయ్యగారి మారు చాల నిరుత్సాహ పడిపోయారు స్వంతింట్లో కూతురి పెళ్ళి జరిపించాలని మనసులో కోరిక. కానీ తప్పని పరిస్థితి- స తవ్‌లోనే పెళ్ళిచేసి కూతుర్ని అత్తవారింటికి పంపేరు

మూడునెలల్లో పూర్తికావలసిన యిల్లు పిమ్మెంటు కొరత కారణంగా మరో వాల్గు నెలలు నిల్చిపోయింది — బ్లాక్‌మార్కెట్లో పిమ్మెంటు రెట్టింపు ధరకు కొనటానికాయన మనస్సంగీకరించలేదు—

ఈలోగా దండల పెళ్ళిచేసుకుని కోడలితో సహ కాళ్ళమీద పడ్డాడు సుందరం. ఈమాటు తనతోపాటు మాణిక్యంకూడ చాల బాధపడింది.

'కట్నం ఆట్టే యిచ్చుకోలేరు — పైగా శాఖకూడ వేరు... మీ రొప్పుకుంటారో లేదోనని...' సంజాయిషీ యిచ్చేడు సుందరం.

కోడలు బుద్ధిమంతురాలు . సంప్రదాయ కుటుంబంలోంచి వచ్చింది — ఆపైన చక్కనిదీ-

ఈ కారణాలవల్లే కాబోలు ఎవరూ ఏం మాట్లాడలేకపోయారు.

మళ్ళీ పిమ్మెంటు స్వేచ్ఛా బజార్లో దొరికే సమయానికి ధర పెరిగిపోయింది. నల్లబజారు ధరతో సమానమైంది- అంచేత అనుకున్న దానికంటే మరో పదివేలు ఎక్కువే అయింది యిల్లు పూర్తయ్యేసరికి—

# గూడు

[10వ పేజీ తరువాయి]

గృహ ప్రవేశానికి కూతుళ్ళూ, అల్లుళ్ళూ, మనమలూ అంతా వచ్చారు.

పట్టరానంత సంతోషం కలిగిందానాడు మాధవయ్యగార్కి—

అయితే ఆ ఆనందం కూడ ఎంతోకాలం నిలవలేదు.

మరో యిరవై రోజులకే సుందరానికి ట్రాన్స్‌ఫర్ అయ్యింది—

'ఎవ్వరూ లేకపోతే యింత యింటికీ మేమిద్దరమే అయిపోతాం !' అని తన దిగులును వ్యక్తంచేసింది మాణిక్యమ్మ.

నిజమే పిల్లలంతా తమదగ్గ లేవున్నపుడు చాలీ చాలని అద్దె గదుల్లోనే కాలం గడిపేశారు— తీరా తమదంటూ ఓ యిల్లు కట్టుకున్నాక ఎవరూ తను దగ్గర లేకుండా పోతున్నారు

'అందుకే సగం అద్దెకిచ్చేట్టుగా కట్టుకుందామన్నాను- ఇప్పటికైనా మించి పోయిందేముంది- ఈ యిల్లు మీ యిద్దరికీ పెద్దదనిపిస్తే ఓ రెండుగదులున్న మంచి పోర్షన్ దగ్గర్లోనే అద్దెకుతీసుకుని మనిల్లు అద్దెకిస్తే నాలుగువందలైనా మిగుల్తాయి- ఓ విధంగా కొంత అప్పు అయినా తీరుతుంది' అన్నాడు సుందరం.

వెంటనే యేం మాట్లాడలేకపోయారు మాధవయ్యగారు.

స్వంతిల్లు కట్టుకున్నాక కూడ దాన్ని అద్దెకిచ్చి మరో యింట్లో అద్దెకుండడం ఎందుకో తను యిష్టపడలేకపోయాడు తన మౌనాన్ని గ్రహించి కాబోలు సుందరంకూడ మళ్ళీ ఆ ప్రసక్తి తేలేదు

తన బాధను గ్రహించిన మాణిక్యంకూడ ఏం మాట్లాడలేకపోయింది ఎన్నో కలలగని కట్టుకున్న యింట్లో తామిద్దరూ వంటరిగా మిగిలిపోయారు.

నిట్టూర్చేరు మాధవయ్యగారు

"ఇంకా వాకిట్లోనే కూర్చుండిపోయారా? మంచు బాగా పడుతున్నట్టుంది. లోపలికి రారాదూ" లోపల్నించి మాణిక్యమ్మగారి కేకకు ఆలోచన్లను అక్కడితో ఆపి లేచేరు.

ఆ రాత్రి చాలా సేపటివరకూ మాధవయ్యగార్కి నిద్రపట్టలేదు తలనిండా ఆలోచనలే

"నాది నాది అనుకున్నది నీది కాదురా" అన్నారెవరో కవి నిజమే నావాళ్ళనుకున్న పిల్లలంతా ఎవరి సంసారాలు వాళ్ళు చేసుకుంటూ ఎక్కడెక్కడో వున్నారు మరి యింతలా మమకారాన్ని పెంచుకున్న యీ యిల్లు కూడ తనదెలా అవుతుంది ? ఒక జీవితమంతా కూడబెట్టిన దాంట్లో స్థలం కొనగలిగేడు తను ఇంటికోసం తీసుకున్న అప్పంతా కొడుకు తీర్చాల్సిందే—

మరో రెండు రోజులపాటు అవే ఆలోచనలు !

మూడోనాడు ఓ నిశ్చయానికొచ్చి భార్యను కేకేశారు.

'పక్కవీధిలో రెండుగదుల పోర్షనొకటి ఖాళీ అయిందట మాణిక్యం ఓసారి వెళ్ళి చూసొస్తే.'

మాణిక్యమ్మగారు ఆశ్చర్యంగా చూశారాయనవంక

'సుందరం మాటలు మనసులో పెట్టుకోకండి' అని ఏదో అనబోయింది.

'లేదు మాణిక్యం అప్పుకూడ తీరాలిగా'

మాధవయ్యగారి గొంతు బొంగురుబోయింది.

ఆ ముఖంలో రాజీ కన్పించిందామెకు ★



# కొత్త సంవత్సరానికి పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపరా?



## బ్రిటిష్ పెయింట్స్ వైనల్ వేయించుకోండి మీ ఇంటి గోడల చేత ఉగాది శుభాకాంక్షలు పలికించండి

కొత్త సంవత్సరం, కొత్త ఇల్లు, ఇంట్లోకి కొత్త పెళ్లికూతురు— ఇన్ని కొత్త శుభ సందర్భాల్లో ఎవరైనా పాతకాలపు ఆయిల్-బౌండ్ డిస్టెంపర్ ఇష్టపడతారా? మీ ఇంటి గోడలకు వైనల్ వెయ్యండి అవి ఎలా జీవంతో కళకళలాడతాయో చూడండి.

వైనల్ మీ గోడలకు మన్నతి ఫినిష్ ఇస్తుంది, ఖరీదైనదిగా కన్పించేలా చేస్తుంది—మును పెన్నడూ లేనంతగా! వైనల్ వల్ల మరెన్నో ప్రత్యక్ష ప్రయోజనాలు కూడా—ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపరూ పోటీ పడలేనివి! ఇవన్నీ అదనపు ఖర్చేమీ లేకుండానే.




వైనల్‌ని ఏ ఆయిల్-బౌండ్ డిస్టెంపర్‌తోనైనా పోల్చి చూడండి ప్రతి విషయంలోనూ అతి శ్రేష్ఠమైనది వైనల్

| | వైనల్ | ఆయిల్ బౌండ్ డిస్టెంపర్ |
|---|---|---|
| [illegible] | [illegible] | [illegible] |
| ఆరడానికి పట్టే సమయం | 4 గంటలు | 12 గంటలు |
| [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | ఎక్కువ | తక్కువ |
| [illegible] | —తేడా లేదు— | |

* [illegible]

**బ్రిటిష్ పెయింట్స్**
**వైనల్**

ఆనందప్రదమైన తరుణంలో విశిష్టమైన పెయింట్

LINTAS(C)/VNL/66/2317 TL



బత్తుల వి దుర్గాప్రసాదరావు

ఇంటర్ కంలో మాట్లాడుతున్నాడు జి యం - తన పి ఏ తో ...

"లాభంలేదు, చెప్పింది చెయ్యండి ... తర్వాత విచారించిన లాభం వుండదు."

"సార్ !"

"నో..." ఇంటర్‌కం కట్ చేసేశాడు జి. యం.

నుదుట పట్టిన చెమట తుడుచుకున్నాడు పి ఏ కుర్చీ వెనక్కువాలిపోయాడు 'ఎలా చెప్పాలి?....ఎలావొప్పించాలి? ... ఎందుకిలా జరిగింది ?' — గతరాత్రి నించి ఇవే ప్రశ్నలు అతన్ని వుక్కిరిబిక్కిరి చేసేస్తున్నాయి. వింతగానో కలవరపరుస్తున్నాయి.

గతరాత్రి పి ఏ. తో ...

"చూడండి ! రేపు ఉదయం నే వొచ్చే సరికి రాజారావ్ పార్టీ కాంట్రాక్టును స్థిర పరిచినట్టు లెటర్ తయారుచేసి, నా సంతకం కోసం పంపించండి " చెప్పాడు జి యం.

"సార్ ! చిన్నవిషయం, ఆ కాంట్రాక్టును లక్ష్మణ్ పార్టీకి ఇవ్వడానికి వొప్పుకున్నాను. అందునిమిత్తం వాళ్ళనించి పెద్ద మొత్తంలో .... "

"నో, నేను చెప్పినట్టు చెయ్యండి." అడ్డుపడ్డాడు జి యం.

"సార్ !"

"నో మోర్ .." అంటూ కుర్చీలోంచి లేచి, తన రూంలోంచి బయటికి వచ్చేశాడు జి యం.

పి ఏ. కు వింతగా తోచింది జి యం. ప్రవర్తన 'ఎప్పుడూ ఇలా జరగలేదు ! .... ఏమిటీ వింత ?..'

మొదట్లో డైరెక్టుగా లంచం తీసుకోడానికి జి యం భయపడ్డాడు అందుకే పి ఏ సహాయం కోరేడు కాని అతనిపై సడన్‌గా అత్యాశ, అహం . ఇంకా ఏవేవో దాడి చేశాయి అతన్ని లోబర్చుకున్నాయి దాంతో డైరెక్టుగా రంగంలోకి దిగాడు దీని మూలంగా మొదటిసారిగా పి ఏ ఇరకాటంలో పడ్డాడు

ఆఫీసుకు రాగానే ఇంటర్‌కంతో పి ఏ ను కలిశాడు జి యం.

"చూడండీ ! నేను రాత్రి చెప్పింది చేశారా ? ఆ కాంట్రాకు పేపర్సను త్వరగా పంపించండి "

"సార్ ! దయచేసి నేను చెప్పింది కాస్త వినండి, ఈ సారికి ఈ విషయాన్ని నాకు వీలుగా చెయ్యండి ముందు ముందు..."

"నో...."

"సార్...."

"నో మోర్ చెప్పించెయ్యండి..."

"సార్ ! వాళ్ళిచ్చిందాంట్లో నా వాటా ఖర్చు అయిపోయింది.. అందుకని "

"నో . నో ... వీలులేదు మీరే ఏదో తంటాలుపడండి."

"సార్ .."

* * *

లంచ్ అవర్‌కు అయిదు నిమిషాలు వుండగా జి యం ఇంటర్ కంలో పిలిచాడు పి. ఏ ను

పి ఏ వచ్చాడు.

"చూడండీ ! మీరు నా మాట వినేటట్టు లేదు ..పైగా మీ వాటా మీరు ఖర్చుచేసేశామంటున్నారు ఆ మొత్తం మీరు తక్షణమే కలిపి వాళ్ళకిచ్చేయండి లేదా, కలపలేమంటారా ? ఆ మొత్తం నే నిస్తాను, మీరు ఉద్యోగంలోంచి తప్పుకుంటే .."

"సార్ !" .

"నో ! ఏదో ఒకటి జరగాలి "

పి ఏ. కు అంతా అయోమయంగావుంది . తన వాటాక్రింద వచ్చిన పెద్ద మొత్తాన్ని తను కలపగలడా ? ఆ మొత్తం గతవారంలో జరిగిన తన కూతురు పెళ్ళి క్రింద ఖర్చు అయిపోయింది పైగా తనింటి మీద కూడా అప్పు చేసేశాడు ఇప్పుడు తనదంటూ ఏమీ

లేదు! ఎలా ఈ సమస్యను పరిష్కరించగలడు?

"సార్ " ఏదో చెప్పబోయాడు

"నో మోర్ నన్ను వేడెక్కించకండి .." అడ్డుపడ్డాడు జి యం

ఆగి, నెమ్మదిగా అన్నాడు ప ఏ "సార్! ఇకముందు ఇలా జరగనివ్వను .. ఈసారికి .."

"నో ..నో...నో " మళీ జి యం అడ్డుపడ్డాడు "చూడండీ! గుట్టుగా మీరు ఉద్యోగంలోంచి తప్పుకోండి లేదంటే, బ్యాడ్ రిమార్క్సతో మిమ్మల్ని నేనే ఉద్యోగంలోంచి తీసేస్తాను, అంతవరకు తెచ్చుకోకండి మీకు, నాకు సరిపడదిక. హ్హు, సంతకం నాది, అనవసరంగా వాటా మీది, నాకిలా నచ్చటంలేదు, గ్రహించండి "

మరోసారి పి. ఏ. ప్రయత్నించాడు. లాభంలేకపోయింది మరి చేసేదిలేక, రాజీనామా రాసిచ్చాడు. దానిమీద జి యం. సంతకం పెట్టేశాడు ...

---

## పార్ట్‌నర్స్

"మీ ఛార్జిని హెచ్ సి గారికి అప్ప చెప్పండి నే నతనితో చెప్తాను . ఆ, ముందు వెళ్లి, ఆ మిగిలిన డబ్బు పట్టుకురండి, నేను మీ వాటాను కలిపి ఇస్తాను. వాళ్ళకది ఇచ్చేయండి..."

పి ఏ. భారంగా కదిలాడు. అతని కళ్లల్లో సన్నని కన్నీటి పొరలు .

"చూడండీ ! ఇంతవరకు మన మధ్య ఉన్న ఒప్పందం ప్రకారం, మీరు వసూలు చేసిన డబ్బును సగం, సగం పంచుకునేవాళ్ళం. అలాగే ప్రతినెల సగం, సగం వేసుకొని ఏదో ఓ స్టేట్ లాటరీ టిక్కెట్టును కొనేవాళ్ళం, వచ్చిన బహుమతి సగం, సగం అనుకున్నాం. అయినా మనకు ఇంతవరకూ ఏ బహుమతి రాలేదనుకోండి ... మీతో కలిసి వుంటే సుఖంలేదు ... ఇదిగోండి ఈ నెల మనం కొన్న టిక్కెట్టు, 50 పైసలు ఇచ్చి తీసుకోండి నాకా 50 పైసలైనా మిగులుతుంది.. "

*    *    *

చాలా రోజుల తర్వాత వచ్చిన తన మాజీ పి. ఏ. ను చూసి, 'ఎందుకొచ్చినట్టు ' అనుకున్నాడు జి యం ఆశ్చర్యంతో.

"గుడ్‌మార్నింగ్ సార్!" పి. ఏ లో ఉత్సాహం పొంగుతోంది. "నేను ఓ ఏ సి. సినిమా థియేటర్ కట్టదలిచాను, 'మొదటి పునాదిరాయి' మీరు వెయ్యాలి దయచేసి ఒప్పుకోండి..."

కొన్ని క్షణాలవరకూ ఏమీ మాట్లాడలేక పోయాడు జి. యం. 'నువ్వు ... సినిమా థియేటర్ కట్టడమా ?' అన్నట్టు చూశాడు, తన మాజీ పి. ఏ వేపు

"దయచేసి కాదనకండి ... అంతా మీ దయ ..."

"నా దయా ! ?"

"అవునుసార్ ! ఆ రోజు నాకు మీరు వదిలేసిన ఆ లాటరీ టిక్కెట్టు విజయం సాధించింది, నాకు 10 లక్షలు తెచ్చిపెట్టింది..."

తన మాజీ పి. ఏ. చెప్పుకు పోతోంది వింటూన్న జి. యం. చెమటలు కక్కేస్తున్నాడు, ఏ సి. రూంలో వున్నప్పటికీ ...తన కళ్లల్లో వూరుతూన్న నీళ్లను బయట పడకుండా ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు ...కానీ... !

# హైదరాబాదు నోటుబుక్

**చదువు లావుకు సన్మానం :**

ఉపజ్ఞకల కవి, చిత్రకారుడు, భావుకుడు తన విశిష్టతనుస్థిరపరచుకొనడం కోసం కొన్ని పాత్ర లనుసృష్టిస్తాడు. సృష్టించకపోతే పాతపాత్రలకు తన కొత్త దుస్తులు వేసి తనవిగా చేసుకొంటాడు. అలాటి విశిష్టతగల కళాకారుడు మిత్రులు శ్రీ భావరాజు వెంకట సత్యమూర్తి — బి. వి. సత్య మూర్తి. చదివిందిన్యాయశాస్త్రమైనా వలసింది చిత్రకళ. ఛిందులోను వ్యంగ్య చిత్రకళ. తెలుగు పత్రికా రంగంలో 'చదువుల్రావు కొత్త పాత్రను సృష్టించారు. శ్రీ సత్యమూర్తి తన బొమ్మనే చదువుల్రావుగాపరిచయంచేసి వారంవారంబోలెడు జోకులతో పాఠకులను ఉర్రూతలూగించే వారు. తన మీదే ఎన్నో ర్యాగ్లు వేసుకొని నవ్వు పుట్టించేవారు. చదువుల్రావు బొమ్మకు వేసిన షర్టు డిజైనుపై ఆ కాలంలో వెర్రి వ్యామోహ ముండేది యువతకు. సత్యమూర్తి ఆరడుగులఅంద గాడు. గర్వపువాయకూడలేని సహృదయుడు. దైవ చింతన గలవాడు. కమర్షియల్ ఆర్టిస్టుగా స్థిర పడినా మనస్సు వ్యాపార మాలినం కాని మనస్సే. ఈయనఇంతవరకునాలుగువేలకుపైగాకార్టూన్లు, ఎనభై రెండు బొమ్మల కథలు రచించాడు. చదువు ల్రావు, కబుర్ల్రావు, జంబూ, అగ్గి పుల్లారావు లాంటి ఎనిమిది విశిష్టపాత్రలను సృష్టించారు. "భగవాన్ శ్రీసత్యసాయి కళా సుధ" అనే బొమ్మల కథల పుస్తకం భవన్స్ జర్నల్‌లో ఆంగ్ల అనువాద దంతో ప్రచురితమైంది. ఇలాంటి ఉత్తమున్నే విజయనగర్‌కాలనీలోని బాలభారతి సాంస్కృతిక సంస్థ తన 18 వ వార్షికోత్సవంలో జనవరి 4 వ తేదీన ఇందిరా ప్రియదర్శినీ హాలులో సన్మానిం చడం ప్రశంసనీయం. ఈ ఉత్సవానికి ఆంధ్ర ప్రభ సచిత్రవారపత్రికసంపాదకులు శ్రీపొత్తూరి వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు. వాణీ పోలీసు డైరెక్టర్ జనరల్, స్టీల్ ప్లాంట్ కవిప నర్ శ్రీ ఎం. వి. నారాయణరావు ముఖ్యాతిథిగా వున్నారు. హైదరాబాద్ జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ డి. సుబ్బారావు ప్రత్యేక సంచికను ఆవిష్క రించారు. ప్రారంభంలో సంస్థ అధక్షులు శ్రీ కస్తూరీబాయి కృష్ణంరాజు సంస్థకార్యకలాపాలను వివరించారు సంస్థ కార్యదర్శిని శ్రీమతి ఆర్. సుశీలా రాణి స్వాగతం చెప్పారు. ప్రముఖ ఇంద్రజాలికుడు శ్రీ బి. వి. పట్టాభిరాం శిష్యురాలు కుమారి కవిత ఇంద్రజాల ప్రదర్శనం, సంస్థ విద్యార్థినుల సంగీత ప్రదర్శనం జరిగాయి. ఒక ఇరాన్ విద్యార్థి వీణ వాయించడం విశేషం. శ్రీ జీడిగుంట వెంకట రావు కృతజ్ఞతలతో ఉత్సవం సమాప్తమైంది.

**పదవీ విరమణ వయస్సు తగ్గింపు :**

రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల పదవీ విరమణ వయస్సు 58 సంవత్సరాల నుంచి 55 సంవత్స రాలకు తగ్గిస్తూ జనవరి 10 వ తేదీన రాష్ట్ర ప్రభుత్వం ఉత్తరువు జారీ చేసింది. ఈ సంగతిని ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు జనవరి 9 వ తేదీన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో తెలి పారు. మొదట ఈ వయ పరిమితి 55 సంవత్స రాలే వుంది. డాక్టర్‌చెన్నారెడ్డి పరిమితిని 58 సంవత్సరాలకు పొడిగించారు. ఈ తగ్గింపు వల్ల దాదాపు 30 వేల మంది ఉద్యోగులు జనవరి నెలా ఖరుకు ఉద్యోగాల నుంచివిరమించవలసివుంటుంది. ఈ కారణంగా దాదాపు 20 వేల మందికి ప్రమో షనులు, 30 వేల మంది నిరుద్యోగులకు ఉద్యోగావ కాశాలు వుంటాయి.

**ఉపశ్రుతి :**

"ఆత్మగౌరవ రక్షణ అంటే అలా వుండాలి. గడ్‌వాలీ రెజిమెంట్, పంజాబ్ రెజిమెంట్, మరాఠీ రెజిమెంట్ మున్నగునవి ఉన్నప్పుడు ఆంధ్ర రెజి మెంట్ ఎందుకుండరాదు ? ఇది ఆలోచించే ముఖ్యమంత్రి ఆంధ్ర రెజిమెంట్ ఏర్పాటుచేయా లన్నారు బేషుగ్గా వుంది — అన్నాను. ముఖ్య మంత్రి ఉద్దేశం మహా బాగానేవుంది. అయితే ఆ రెజిమెంటుకు ముందు నగరంలో దోమల సంహా రానికి, గుర్రపుడెక్క మొక్కను తొక్కివేయడానికి ఒక రెజిమెంటు ఏర్పాటుచేస్తే బాగుండును — అన్నాడు మిత్రుడు శ్రీ దమ్మాలపాటి శేషగిరి రావు.

—తిరుమల రామచంద్ర

# శ్రీ పాలగుమ్మి పద్మరాజు మృతి

ప్రఖ్యాత తెలుగు రచయిత శ్రీ పాలగుమ్మి పద్మరాజు ఫిబ్రవరి 17వ తేదీ ఉదయం న్యూఢిల్లీలో హఠాత్తుగా కన్నుమూశారు. ఆయన వయస్సు 67 సంవత్సరాలు.

ఆకాశవాణి వార్షిక అవార్డుల సందర్భంగా ఆయన ఢిల్లీ వెళ్ళారు

కథారచనలో శ్రీ పద్మరాజుది అందె వేసిన చెయ్యి 1952 లో హిందుస్తాన్ టైమ్స్ వారు న్యూయార్క్‌లోని హెరాల్డ్ ట్రిబ్యూన్ సహకారంతో నిర్వహించిన అంతర్జాతీయ కథానికల పోటీలో ఆయన రాసిన 'గాలివాన' కథకి బహుమతి లభించింది. కొన్ని కథలు సినిమాలుగా వచ్చాయి. శ్రీ పద్మరాజు కథలు, నాటికలు రేడియోలో ప్రసారం అయినాయి. కొన్ని చిత్రాలకి ఆయన సంభాషణలని సమ కూర్చారు.

శ్రీ పద్మరాజు రసాయన శాస్త్రంలో ఎం. ఎస్ సి. పట్టభద్రులు. కెమిస్ట్రీ శాఖ అధిపతిగా భీమవరం కళాశాలలో కొంతకాలం పని చేశారు తర్వాత ఉద్యోగాన్ని వదలిపెట్టి సాహిత్య సేవకి అంకితమైనారు.

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన శ్రీ పద్మరాజు సాహితీ రంగంలోని అన్ని ప్రక్రియలను తరచి చూచారు. నవలలు,



గేయాలు, నాటికలు రాశారు. బ్రతికినకాలేజీ, నల్లరేగడి, నింగి–నేల నవలలు ఆయనకి మంచిపేరు తెచ్చాయి. శ్రీ పాలగుమ్మి పద్మరాజు కేంద్ర సాహిత్య అకాడెమీ సలహా మండలి సభ్యులుగా కొంతకాలం పనిచేశారు. శ్రీ పాలగుమ్మి మృతి తెలుగు సాహితీ లోకానికి తీరని వెలితి. వీరికి భార్య, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు.

### డబ్బు + అమ్మాయి = కట్నం

వరకట్నపు పిశాచపు కబంధ హస్తాల్లో అమాయకులైన ఆడపడుచులు చిక్కుకు పోయినారు. వాళ్ళని రక్షించడం సాధ్యమా ? వరకట్నం నిర్మూలించటం సాధ్యమా ? అనే ఉచిత ప్రశ్నలకు వ్రాయండి.

అ మృ త వా ణి,

పి.బి.నెం.1588, సికింద్రాబాద-500003.

### కార్టూన్‌లు పంపేవారికి మనవి

కార్టూన్‌లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరుపెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ--3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తరప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్‌లు 'టపా' లో పోయినా, దారితప్పిపోయినా సంపాదకునిబాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్‌లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈకార్టూన్‌లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

## అవీ ఇవీ అన్నీ

### శ్రీ దిగవల్లి సుబ్బారావు అకాల మరణం

ప్రజారోగ్యశాఖ ప్రథమ డైరెక్టరు స్వర్గీయ దిగవల్లి సుబ్బారావుగారి పౌత్రుడు. స్వర్గీయ శివలెంక శంభుప్రసాద్ గారి దౌహిత్రుడు అయిన శ్రీ దిగవల్లి సుబ్బారావు ఫిబ్రవరి 16 న తేదీ రాత్రి మోటారు సైకిలుపై వెళ్తూ ప్రమాదవశాత్తు జారి పడి తలకి బలమైనగాయం తగిలి 17 న తేదీ తెల్లవారు జామున4గంటలకి గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రిలో అకాలమృత్యువుపాలైనారు. ఆయన వయస్సు 20 సంవత్సరాలు.

శ్రీ సుబ్బారావు బి హెచ్ ఇ ఎల్ లో ఛీఫ్ ఇంజనీరుగా పనిచేస్తున్న శ్రీ సీతారామారావు, కీ శే శివలెంక శంభుప్రసాద్ గారి జ్యేష్ఠ పుత్రిక శ్రీమతి లీలా భ్రమరాంబ దంపతులకు ఏకైక సంతానం

శ్రీ సుబ్బారావు భౌతిక కాయాన్ని అనేక మంది ఇంజనీరింగ్ విద్యార్థులు, ఆంధ్ర పత్రిక సిబ్బంది అశ్రునయనాలతో వీక్షించి వారి కుటుంబ సభ్యులకి తమ సంతాపాన్ని, సానుభూతిని వ్యక్తం చేశారు. శ్రీ సుబ్బారావు అకాల మృతికి సంతాప సూచకంగా సిద్ధార్థ ఇంజనీరింగ్ కళాశాలకి ఆ రోజున సెలవు ప్రకటించారు.

### అఖిలభారత చిత్రకళ పోటీలు

నవరంగ్ చిత్రకళా నికేతన్, వెల్లటూరు వారు మార్చి నెలలో 17 సంవత్సరాల లోపు బాలబాలికలకి, 35 సంవత్సరాలు దాటిన ప్రౌఢ చిత్రకారులకి విడివిడిగా పోటీలు నిర్వహిస్తారు. విజేతలకి మే నెలలో జరిగే 13వ అఖిలభారత బాలల చిత్రకళా ప్రదర్శనకి, 10వ అఖిలభారత అవుత్సాహిక చిత్రకళా ప్రదర్శనలతో పాటుగా 4వ ప్రాంతీయ ప్రౌఢ చిత్రకళా ప్రదర్శనని ఏర్పాటుచేసి బహుమతులు అందజేస్తారు. గడువు తేదీ మార్చి 15. వివరాలకి స్వంత చిరునామా కల కవరుతో శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మ, సెక్రటరీ, నవరంగ్ చిత్రకళా నికేతన్, వెల్లటూరు —522227, వయా తెనాలి, గుంటూరు జిలాకి రాయాలి.




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor . S Radhakrishna.

# మీరెవరి మదినైనా కలవర పెట్టాలనుకున్నప్పుడు

## అమాయకత్వం చిందించే బొట్టు పెట్టుకోండి.

మీ కనురెప్పలలో తత్తరపాటు,
నడకలో వయ్యారంతోపాటు
నొసట శింగార్ కుమ్‌కుమ్ బొట్టు
పెట్టుకు చూడండి.
శింగార్ రంగులలోని
అత్యుత్తమ పదార్థాలతో
తయారైంది, మీ హావభావాలకు
సరితూగేలా...మీ బట్టల
అందాన్ని మరింత చేసేలా.

S

**శింగార్**

**కుమ్ కుమ్ బొట్టు**
**—భారతదేశపు**
**అత్యంత అందమైన**
**సౌందర్య తిలకం**




everest/80/SH/76/tl